శ్రీ ర స్తు

# కోవలన్ — కన్నకి

అనువాదకుడు:

శ్రీ పరిగొండ సత్యనారాయణమూర్తి



# వచనగ్రంథములు.

'సైన్సు'పై లోకహత్యారోపణ (ప్రహసనము) ప్రతి 1-కి రు. 0
తిలకుగారి సెక్యూరిటీకేసు, ఉపన్యాసములు (ప్రాతది) ... 0
భారతరమణీమణులు, ప్రథమభాగము, 21 స్త్రీరత్నముల చరిత్ర 1
,, రెండవభాగము, 10 ,, ,, 0
,, మూఁడవభాగము, 12 ,, ,, 0
యజుర్వేదకథాసంగ్రహము, 50 చిత్రకథలు,
పార్నంది సర్వేశ్వరశాస్త్రి విరచితము ... 0
నీతిచంద్రిక, శ్రీ చిన్నయసూరి గారిది ... 0
,, టీకతో ... 1
చిన్నయసూరి జీవితము ... 1
పంచతంత్రము, వచనము, సులభశైలి ... 0
తెనాలిరామలింగనికథలు, జీవితము ... 0
,, A. S. P. అయ్యరుగారిది ... 0
రాజశేఖరుఁడు, గోపాలుఁడు .. 0
చార్ దర్వీషుకథలు .. 1
తాతాచార్యులకథలు .. 0
బేతాళునికథలు .. 0
వైద్యులకథలు .. 0
పరమానందశిష్యులకథలు .. 0
నలుగురుమంత్రులకథలు .. 0
అయిదుగురుదొంగలకథలు .. 0
రేచుక్క పగటిచుక్క కథలు .. 0
సత్యసేనవిజయము .. 0
ఋషులచరిత్ర .. 1
బాజీరాయనిచరిత్ర ... 1
మర్యాదరామన్నకథలు ... 0
మైరావణచరిత్ర ... 0
శకుంతలచరిత్ర, ప్రతిమలతో ... 0

శ్రీరస్తు

# కోవలన్–కన్నకి

అనువాదకుఁడు:

శ్రీ వరిగొండ సత్యనారాయణమూర్తి



చెన్నపురి:

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్

వారిచే బ్రకటితము.

1954

# మనవి



ద్రవిడవాఙ్మయ వారాశినుండి జీవరత్నరాజము నొక దానిని దీసి ఆంధ్రమాత నలంకరించుభాగ్యము నా కొదవి నందులకు, నాయానంద మమేయమై యున్నదనిన, నన్ను గర్వి యనియు రాజసుఁ డనియుఁ బాఠకులు తప్పు తలంప కుందురు గాక! శక్తివంచన లేక మాతృదేవేరి మదికెక్కుట కేపుత్రుఁ డభిలషింపఁడు?

సారస్వత మపారము; భాషలు పెక్కులు; విషయము లనంతము. దానం జేసి, భాషాభిలాభి కూపస్థమండూకమై, తెలిసినదానితోఁ దృప్తినంది యుండక, అనుక్షణము వినూతన విషయములను సేకరించి మాతృభాష నభివర్ధిల్లఁ జేయు టాతని కర్తవ్యమై యున్నది. ఈ యభిప్రాయమే నన్నీ యనువాద మునకుఁ బురికొల్పినది.

ఇదివఱకే పండితు లెందఱో దేవభాషయగు సంస్కృతమునుండియు, రాజభాషయగు నాంగ్లమునుండియు, రాష్ట్ర భాషయగు హిందీనుండియు గ్రంథములఁ బెక్కింటి ననువాద మొనరించియున్నారు. ఉర్దూ, బెంగాలీ, కన్నడము, అరవము నుండికూడఁ బెక్కుశాస్త్రములు తెలుఁగుచేయఁబడి యున్నవి; చేయఁబడుచున్నవి. దీనినిబట్టి, ఆంధ్రభాష సహజసంపత్తి దిన

దినాభివృద్ధి యగుటకుం దోడు, ఆంధ్రులితరవాఙ్మయవీథుల విహరించి వినూతనవిషయములను బరిగ్రహించుట కవకాశ మేర్పడుచున్నది. ఇది ముదావహము.

ఈ 'కోవలన్ - కన్నకి' గాథ మనోహరమైనది. నీతిదాయకమైనది. ఆంధ్రవాణి కీగ్రంథరత్న మపూర్వాభరణము. ఆకర్షవంతమగు కథాసరళి యటుండ, నీగ్రంథపఠనమునఁ బాఠకుఁ డిప్పటికి రమారమి రెండువేలసంవత్సరముల క్రిందటి ద్రవిడావని నొకమారు చుట్టి రాఁ గలఁడు. సకల సౌభాగ్యములఁ గళకళలాడు పట్టణములు, సర్వసస్యసంశోభితములగు గ్రామపరిసరములు, నిబిడారణ్యవిలసితములగు రాజ్యభాగములు—ఇట్లు సర్వాలంకారసుందరమగు ప్రకృతిమాత ఆంధ్రకుమారు నాహ్వానించి విమలోద్యానముల నుండు ఫల పుష్పములతోడను, జీవనదుల నుభయకూలముల నొఱసి ప్రవహించు నిర్మలోదకములతోడను సత్కరించును. కన్నకి, కోప్పెరుందేవులవంటి పతివ్రతాశిరోమణులు, శెంగుత్తువన్, నీడంచెలియన్ ప్రభుశేఖరులవంటి ధర్మమూర్తులు, మదారివంటి త్యాగధనులు,—ఆదర్శప్రాయులగు నిట్టిమహామహులు నాగర్భమునఁ బుట్టుభాగ్య మందితి నని ద్రవిడమాత సగర్వముగా వారిని జూపఁగలదు. ఆ భూమియందలి ప్రజల యాచారవ్యవహారముల నాతఁ డాకలించుకోఁ గలఁడు. వివిధ మతములకుఁ జెందియుఁ బ్రజలందఱు సహనముతో మెలఁగుచుండిరని యెఱుంగఁ గల్గఁడు. నేటివోలెఁ గాక, నాఁడు

సామాన్యజనులు గ్రామాభిముఖులై కృషీవలవృత్తి నవలంబించి సంతృప్తి నంది సంతోషవారాంబుధి నీదులాడుచుండిరని గ్రహింపఁ గలఁడు. ఆంధ్రకుమారుఁ డిట్లు ద్రవిడదేశాటనపరిజ్ఞానముతో, ద్రవిడపురాణపురుషుల పరిచయభాగ్యముతో, స్వమండలమునకుఁ దిరిగి వచ్చి తనవారి కంతయు నెఱుకపఱచును. వా రప్పుడు, తమకును తమ పొరుగున నుండు ద్రవిడ సోదరులకును, ఆచారమున, వ్యవహారమున, నైజగుణమున నించుకయేని వ్యత్యాసము లేదని గ్రహించి వారినెయ్యము నాకాంక్షించుటకు వీ లగును.

'మానవప్రకృతిని మదిలోన నుంచి
తాను మైత్రి యొనర్పఁ దగు, నేర్పుకైన!'

అని కదా యనుభవవాక్యము. మఱి మిత్రునికంటె బాంధవుఁ డెవఁ డున్నాఁడు ?

ఆంధ్రసహోదరున కిట్టిసాయ మొనరించు మహాదవకాశమును నా కొదవింపఁజేసిన మూలగ్రంథకర్త శ్రీ. ఏ. యస్. పి. అయ్యరు, యం. ఏ., ఐ. సి. యస్., యఫ్. ఆర్. యస్. యల్., గారికిని, ప్రచురణకర్తలు శ్రీ వావిళ్ల వేంకటేశ్వర శాస్త్రులుగారికిని నాధన్యవాదములు. 'బాలాదిత్య' 'శంభుతో నొకనాటి సహవాసము' మున్నగు ననువాదగ్రంథములకు నే నొనరించిన పరిశ్రమను, అవి పొందిన ప్రజాదరణను గుర్తించి శాఁబోలు న న్నీగ్రంథమును తెనుఁగుసేయు వారు కోరి

నంతనే, చేతఁ జిక్కిన యవకాశమును వృథపుచ్చనేరక, వసతి కొంతకుఁ గొంత లేకుండియు నేమారెయొ, ఎట్టులో యొకట్టుల కాలముఁ గల్పించుకొని, యథాశక్తి నీపుస్తకము ననువాద మొనరించి, ఆంధ్రవాణి కర్పించి ఆంధ్రకుమారుల నా విజ్ఞాన దీప్తుల నలరింప సాహసించితిని. ఈ యనువాదకార్యమునందు నాకుఁ దోడ్పడిన శ్రీ శ్రీకంటి వెంకటరత్నమును నే నిప్పట్టునఁ దలంచుట నా ధర్మమైయున్నది.

ఈ నాప్రయత్నమునందలి గుణలేశము నైన రాజహంసలరీతిఁ బాఠకులు గ్రహించినచో, నేను గృతకృత్యుఁడ నైతి నని సంతృప్తి నందుదును.

గూడూరు,
1-12-1940.

వరిగొండ సత్యనారాయణమూర్తి.

# పీఠిక

ఇప్పటికిఁ బదునెనిమిదివందల సంవత్సరములకుఁబూర్వము తమిళభాషయందు విరచితమైన 'శిలప్పదికారమ్' అను ప్రసిద్ధ పురాణములో 'కోవలన్—కన్నకి' యను గాథ యున్నది. ఈకథ రసవత్తరమై సజీవముగ నుండును. ద్రవిడభాషయందలి పురాణపంచకములోఁ జేరిన యీకథయు, దీని యుత్తరగాథయుఁ జాలవిఖ్యాతిఁ గాంచియున్నవి. ఈపురాణరత్నద్వయము ప్రచురణఁ గాంచిననాటినుండి నేటివఱకుఁ దమిళు లొందు గర్వము సహజమనియే చెప్పవలసి యున్నది. తన యీడు పడుచులందఱు సంసారసౌఖ్యముల ననుభవింపవలసియుండఁ దాను మాత్రము దివ్యప్రేమానందమున విషయసుఖములను వర్జించి సన్యసించిన సుకుమారసుందరాంగి చారిత్రమును 'మణిమేఖల' వర్ణించుచున్నది. దానం జేసి యాపురాణము వైరాగ్యభావబంధురమై సామాన్యపాఠకలోకమున కవగతము గాకున్నది. కాని 'శిలప్పదికారమ్' కథాసరళి యట్టిది కాదు. అది కోవలన్ కన్నకి సాంసారికజీవితము నభివర్ణించుచున్నది. ఆకథ యాద్యంతరహితమగు విషమసమస్యాపరిష్కారమునకుఁ దిగును. కట్టుకొనిన కన్నకిఁ గాదని, కోవలన్ జీవితానందసుధను మాధవి జుఱ్ఱుసాగినది. ఇట్లెంతయో కాలము కడఁజన, యా కథాఘట్టము మాఱినది. కోవలన్ తిరిగి కన్నకిని జేరినాఁడు. ఆతనికి మన్ననచేకూరినది. అంత నా దంపతులు సౌఖ్యముగ సంసార మొనరింప నెంచి మధురకుఁ బైనమాదురు. వారి నచట విషాదపిశాచ మతివికృతాకారమున నెదుర్కొనును. అన్యాయముగఁ గోవలన్ హతుఁ డయ్యెను.

ఆతఁ డేపాప మెఱుంగఁడని కన్నకి రాజుకడ నిరూపించును. విచారవిహ్వాలులై ప్రభుదంపతు లసువులు బాయుదురు. మధుర దగ్ధమైనది.

నాటక కర్త పాశ్చాత్యుఁ డైయుండినచో కథ విషాదాంతముగ నంతటితో ముగిసియుండెడిది. అసలు మన భారత దేశమున మానవజీవితము శోకసంపూరితము. ఖేదాంతములగు నాటకములు దుశ్చేష్టల కభ్యుదయ మిచ్చి దిదృక్షువులను దుఃఖసాగరమున ముంచును. కర్తకు రచనాకౌశల్యము చాలమిం జేసియే, కథను విషాదముతో నంతమొందింపవలసి వచ్చినదని జనులు తలంపసాగిరి. అది కారణముగ నీకథ శుభాంతముగ ముగింపఁ బడినది. యోగ్యతకే కడకు విజయము లభించినది. మహేంద్రుఁ డంతవాఁడు కోవలన్ కన్నకిలను స్వయముగ స్వర్గమునకుఁ దీసికొనిపోయెను. ఆ పుణ్యదంపతుల కట్లు శాశ్వతసౌఖ్య మబ్బినది. పాండ్యభూనాథుఁడును దేవేంద్రుని యతిథియై యపూర్వగౌరవము నందఁ గలిగెను. పతివ్రతాతిలకమై సతీదేవిగా నవతరించిన కన్నకికి శిల్పకళావిలసితమగు దేవాలయము నిర్మింపఁ బడెను. హిమాలయమునుండి తెచ్చిన శిలనుండి చెక్కిన కన్నకివిగ్రహ మందుఁ బ్రతిష్ఠింపఁ బడి నిత్యపూజ లందసాగెను.

'శిలప్పదికారమ్' నకుఁ గర్త మహాపండితుఁడు. అందలి భాష మధురము; శైలి జీవన్మయము; శ్రావ్యములగు భాగము లం దెన్నియో గలవు. కాని యాధునికులు వాని స్వరజ్ఞానమునను గోల్పోయిరి. దానికథాసరళి సహజసుందరమై పాఠకులదృష్టి నామూలాగ్రము బిగఁబట్టి యుంచును. నలోపాఖ్యా

నము, సావిత్రీచరిత్రము, రోమియో జూలియట్, ఎబిలార్డ్ హీలాయిస్—జగద్విఖ్యాతినందిన శృంగారకథలతోఁ దా నే మిటఁ గాని దీసిపోవుదునేమో యని శృంగారరససంభరితమగు నీ యాఖ్యానము భయమొందఁ గారణము లేదు. పై వాని యందలి కథానాయికల సంగతి వేరు; దీనియందలి కథా నాయికసంగతి వేరు. ఇచటఁ గన్నకిప్రియుఁడగు కోవలన్ నిజ పత్నియెడఁ గృతఘ్నుఁడై యేండ్లతరబడి యామెమాటయే మఱచి వేఱొకనాతిని మఱిగియుండెను. అటులయ్యును భారత సతీత్వ మెట్టిదో చూడుఁడు! కోవలన్‌పైఁ గన్నకికిఁ గల యను రాగము తఱుగుటకు బదులు నానాటికిఁ బెఱిగినది. కోవలన్ తప్ప మఱి యాసాధ్వికి దేవుఁడు లేఁడు. కడకుఁ గోవలన్‌ను తాను మరలఁ బొందుటకుఁగూడ నామె మఱి యితరదైవముల నారాధించుటకుఁ దిరస్కరించినది! ఇది యుత్తమనీతిసమ న్వితమగు నియమము; స్వార్థరహితమగు ననురాగము. పవిత్ర మగు ప్రేమ పాటాకోటిబేరముగాఁ గొనివచ్చు నంగడివస్తువు వంటిది గాదని చాటి చెప్పినది. ఈవిధమున భరతఖండము ప్రపంచ శృంగారసారస్వతమున కొకవింతయగు నోయగ మును, రుచిని గల్పించిన దనవచ్చును. పైఁగా, నియ్యది వాణి జ్యమే వృత్తిగాఁగల వైశ్యదంపతుల ప్రణయగాథ యగుటం జేసి, పాఠకమహాశయుఁ డిందలి సారగుణము నింకను సులభ ముగ గ్రహించి ధన్యుఁడు కాఁ గలఁడు. తనకు సర్వస్వమైన కోవల నన్యాయముగ హతుఁ డైనపుడు, ఇష్టదేవతాప్రతిమ నపవిత్ర మొనరించి పగులఁ గొట్టఁగా భక్తుఁ డుద్రేకమానస మునఁ బగఁ దీర్చుకొనునట్లు, కన్నకి నైతము మహాభయంకర ముగఁ గసి తీర్చుకొనినది.

ఈరీతి 'పత్నీవ్రతము' (పతివ్రతారాధన) ప్రభవ మొంది, మఱి యితరమతములతో నేనితోఁగాని మేళవింపక, వేయిసంవత్సరములకుఁ బైఁగా నిలిచియుండఁ గలిగినది. నేటికి సైత మీమతము, అగ్నిగుండము వేడుకతో సహా, ద్రౌపదీ దేవి పూజయందును, మళయాళదేశమున భగవతిపూజయందును కనఁబడుచునే నిలిచియున్నది. కొచ్చిన్ రాజ్యమున క్రాంగ నూరునందలి విఖ్యాతదేవాలయములోని భగవతివిగ్రహమున కొక్క_స్తనము మాత్ర మున్నది. మధుర దగ్ధమైనపిదపఁ గన్నకి సైత మిట్లే యుండినది. మఱియు, మధురాపురీ దహన వార్షికమగు భరణీనక్షత్రమున నచటఁ బ్రతివత్సరము వేల కొలఁదిజనులు తిరునాళ్ల జరుపుచుందురు. పశ్చిమసముద్రతీర ప్రాంతములందు నేఁడు కూడ నీ 'పత్నీవ్రతము' మిగుల పట్టుదలతో నాచరింపఁ బడుచున్నది, దీనిఁబట్టి, శెంగుత్తువన్ పూర్వరాజధాని యగు వంజికరువూర్, పశ్చిమతీరస్థమగు నిప్పటి తిరువంజికాలమ్ నగరమేగాని, కొందఱువిజ్ఞు లభిప్రాయ పడునట్లు తిరుచినాపల్లి మండలాంతర్గతమగు నిప్పటికరూర్ పట్టణాము కాదనియు వాదించుట కాధారము చిక్కినది.

తమిళనాటకరంగమున నిప్పటికిని 'కోవలన్' ప్రజానురంజకముగ నున్నది. కాని, కథకుఁ దలతోఁక లేక వికారరూపము నందినది. అందలిరసము చిందఱవందఱయై నాటకఫల స్ఫురితి నిర్మూలమైనది. మూలపురాణమందలి శృంగారనాయిక యగు మాధవి నేటినాటకమున సామాన్యయగు గణికాంగనగా నున్నది. దృఢసంకల్పయు, సుగుణరాశియు, స్వార్థత్యాగినియు నగు సాధ్వీశిరోరత్నము కన్నకి, అనదయు, పతిత్యక్తయు నగు సామాన్యవనితగా నున్నది. ద్రవిడేతరమహా

జనుల హితాభిలాషతో వారి కీగ్రంథరూపమున నీమహా-పురాణగాథయొక్క పోకడలను జూపి ద్రావిడుల యాచార ములను, ఆశయములను సక్రమముగ వినిపింప నిచ్ఛగించితని. మూలము, వైఖరి ద్రావిడ మయ్యును, బ్రాహ్మణులు, జైనులు, బౌద్ధులు బలవంతులై యుండిరని కథచెప్పకయే చెప్పుచున్నది. సంస్కృతనాయకులు నాయికలు చాలవఱకు బ్రాహ్మణులుగనో, క్షత్రియులుగనో యున్నారు; కాని యిందలి నాయకులు నాయికలు వైశ్యులై వర్తకులై యుండుట యెన్నఁదగినవిషయము. ద్రావిడులు ప్రజాసామాన్యముతో క్షీరనీరన్యాయమునఁ గూడి మాడి యుండెడివారు. సంఘమునం దెల్లరకు గౌరవప్రతిష్ఠ లుండెడివి. కాని యార్యులసంగతి వేరు. వారికిఁ జాతుర్వర్ణ్య వ్యవస్థ ముఖ్యమైనది. బ్రహ్మక్షత్రియకులముల కార్యు లొసం గినపదవి పూజార్హము కాదనుట సాహసము కానేరదు. ఆ యగ్రకులజు లిహపరలోకములందు—కడకుఁ గల్పనా ప్రపంచ మందుఁ గూడ సాధారణముగ స్వార్థపరులై సర్వశ్రేయములఁ దామే యనుభవించుచుండెడివారు.

కాని మనకథాకాలమున సకలవర్ణములు, జాతులు, తెగలు—అంద అన్యోన్యముగ నుండిరని తెల్లమగుచున్నది. 'శిలప్పదికారమ్'లో గాని, 'మణిమేఖల'యందుఁ గాని మత కలహములు, సంఘవైషమ్యములు వెతకినను గానరావు. బ్రాహ్మ ణులు, ఆజీవకులు, జైనులు, బౌద్ధులు, పాషండులు, మతాంత రులు, నాస్తికులు—అందఱును కలిసి మెలిసి యుండిరి. ఏమత మునకుఁ జెందియున్న నేమి, మానవులు సామాన్యముగ దేవా లయములన్నింటికి మతవిచక్షణ లేకపోవుచుండిరి. జైనప్రచా రకు లొకరయెడ నహింసాతత్త్వమును బోధించుచుండిరి; వేఱొక

యెడ బౌద్ధులు ధమ్మపదమును బ్రచురించుచుండిరి. మఱొక చోట ద్విజులు వేదాధ్యయన మొనరించుచు యజ్ఞయాగములఁ గావించుచుండిరి. ఇంకొకచోట 'మరవులు' జీవబలులిచ్చుచుండిరి.

కృపాళువగు శివుఁడు, తాండవాభిలాషియగు శ్రీకృష్ణుఁడు, ఉల్లాసవంతుఁడగు బలరాముఁడు, శృంగారరసాధిపతియగు శిష్ఠదేవుఁడు, క్రీడాసక్తుఁడగు స్కాందుఁడు, భోగపరాయణుఁడగు నింద్రుఁడు, తపనుఁడగు సూర్యుఁడు, శీతకరుఁడగు చంద్రుఁడు—వీరంద ఱొకరిప్రక్క నొకరు తమతమ యాలయములం దుపవిష్టులై యుండిరి. తీర్థంకరులు, అర్హతులు, శాక్యముని—వీరును నిజమందిరముల విశ్రమించి యుండిరి. ఈ దేవతల యనుచరు లెవ్వరుగాని యొండొరులఁ గలనైనఁ దూలనాడి యెఱుంగరు. ఒకవేళ వారి కెప్పుడైన భేదాభిప్రాయములు కలిగినచో 'మీదారి మీది; మాదారి మాది' యని వారు సాధారణముగ సఖ్యపడు చుండెడివారు. ఇట్లే మనకథయందుఁ గావుండి మదలఱతోఁ జెప్పియున్నాఁడు.

ధనికుల జీవితవిధాన మత్యున్నతమై యుండినది. వారి యాహారము, వస్త్రములు, భూషణములు—అన్నియు నమూల్యములై శోభావంతములై యుండినవి. నాట్య, గాన, చిత్ర, శిల్పకళాదులు వన్నెకెక్కి యుండినవి. రాజులు ప్రతిభావంతులై, వ్యాకులముతోఁ దమకడ కరుదెంచు దౌర్భాగ్యులకు నైత మందుబాటులో నుండిరి. వారి న్యాయశాసకబుద్ధి నిష్కళంకము; నిరుపమానము. మొత్తముమీఁద వారి ప్రజలు సౌఖ్యముగనే యుండిరి. బ్రాహ్మణులు గౌరవము నందుచుండిరి; కాని, యీావల సంభవించినట్లు, దేశములోఁ బలుకుఁబడిని

బడయుటకుఁ గాని, ఇతరులను శాసించుటకుఁ గాని, తగిన ప్రజామోదము వారికిఁ జేకూరలేదు. ఇప్పటివలెఁ గుల తత్త్వము కఠినముగా నుండక, అంత్యకులజులపైఁ గొంచెము నకుఁ గొంచెము పట్టు విడచుచుండినది.

అమానుషకృత్యములు విశ్వసనీయములై యుండినవి; కల తప్పదని నమ్ముచుండిరి. మఱి వారకాంతలకు లెక్కయే లేదు; వారి నైపుణ్యమును జెప్పఁ దరము కాదు. కడకు రాజులు, రాజకుమారులు, బ్రాహ్మణులు, గృహస్థులు గూడ ధారాళముగ వారితో నెయ్య మొనరించుచుండియు, సంఘ దూరులు గాకుండెడివారు. 'సతీత్వము'న కధిదేవతయగు 'సతీ దేవి'ని గూర్చి యీపురాణము వాకొనుచున్నది గాని, 'పత్నీ త్వము'న కధిదేవతయగు 'పత్నీదేవు'ని గూర్చి యొకపలుకైనఁ బలుకలేదు. ఆకాలమున నిట్టియోచన కవసరము లేకపోయి నది కాఁబోలు! ఈయభిప్రాయమున ద్రవిడపురాణకర్త సోదర సంస్కృతకవితో నేకీభవించుచున్నాఁడు. సంస్కృతకవియుఁ బతివ్రతలఁ గూర్చియే నుడివెను గాని 'పత్నీవ్రత' పదము నైనఁ బ్రయోగింప లేదు. మధురాపురిని గన్నకి దగ్ధ మొనరించి నందులకు సమానముగా, సంస్కృతమునందుఁ గామాంధుఁ డగు కిరాతుని దమయంతి మంటల మాడ్చియున్నది. అన్యాయ ముగాఁ గోవలనిపై దొంగతనము మోపినందుకుఁ దోడుగా, సంస్కృతమున 'మృచ్ఛకటిక'లోఁ జారుదత్తునిపై హత్యాపరా ధముఁ బెట్టఁబడి యున్నది. కర్మఫలమును, పునర్జన్మను దెలియం జేయు నిట్టికథలవంటి వెన్నియో సంస్కృతమునఁ గలవు.

సంస్కృతమున వర్ణించినవిధముగా హైందవసామాన్య ధర్మసంప్రదాయము బౌద్ధులకు, జైనులకుఁ గూడ ననుసరణ

యోగ్యమై యుండినది. సర్వసాధారణమగు నీ హైందవ ధర్మ పద్ధతి, ఒక్కజాతి ప్రభవమునకుఁ గాక, హైందవోర్వియం దలి జాతులు, తెగలు, వారి కళాసౌష్ఠవము—తూర్పుపడ మరలు, ఉత్తర దక్షిణములను వివక్షలేక—అన్నింటి పుట్టు కకుఁ గారణమై యున్నది.

పూర్వ మెప్పుడో సంస్కృత గ్రంథోద్యానములయం దును, ద్రవిడభాషా వనవాటికలయందును వికసించిన భారత విజ్ఞానపుష్ప మీనాటికిని బరిమళముల వెదఁజల్లుచున్నది. ఈ విజ్ఞానపద్ధతియం దొకచిత్రము గలదు. మానవునకు సంఘము నందుండు గౌరవమునకు, పదవికిఁ దగియుండున ట్లాతని నడ వడి యుండవలయును. కులీనులు నీతిపథమును దప్పరని భావింపఁ బడుచుండినది. ఇందుకుఁ దార్కాణము: వైశ్యుఁ డగుకోవలన్ తాను నిజపత్ని కొనరించిన యన్యాయమును గుర్తించినవెంటనే, కన్నీరు మాత్రము విడిచి యామె మన్న నను గోరును. మఱి క్షత్రియోత్తంసుఁడగు నీడంచెలియన్ ప్రభువు తాను కోవలన్ కొనరించిన యధర్మమును గమనిం చినక్షణమే పిడుగడచినట్లు ప్రాణములఁ బాయును.

ఈ పురాణమునందు విశదముగాలేని పట్టుల నక్క డక్కడ నేను పూరించితిని. కాని యివన్నియు నాపురాణము నందే కొన్నిభాగములఁ దత్సారానుగుణ్యముగ సూచింపఁ బడియే యున్నవి: ఆకాలమున 'కురళ్'నందలి నీతిని ద్రవిడ దేశవాసు లవలంబించు చుండెడివారు. కాఁబట్టి, కొన్నిభాగ ములయందు నేనా 'కురళ్' సారమును గ్రహించితిని. 'శిల ప్పదికారమ్' నందును, 'మణిమేఖల'యందును, 'కురళ్'లోని పద్యమొక్కటి మార్పు లేమియు లేక కూర్పఁబడి యున్నది.

కాన నేని ట్లొనరించుటయందుఁ గాలవ్యత్యాసము గదా యను ప్రశ్నకుఁ దావు రాఁ జాలదు.

చోద్యమగు నొకసంగతి: పదునెనిమిదివందల సంవత్సరములక్రిందటఁ గూడ నౌత్తరాహులగు నార్యులకును, దాక్షిణాత్యులగు ద్రావిడులకును నివురుగప్పిన నిప్పువంటిపగ యుండనే యుండినది. ఆర్యభూమీశులు ద్రావిడుల నతినీచముగా నిందించినారని చేరరాజేంద్రుఁడు శెంగుత్తువన్ విని యుగ్రుఁడై వారిపైకి దండెత్తి పోయెను. అది ఫలితముగా జరిగిన ఘోరయుద్ధములో వేనకువేలు నిహతులైరు. పాండ్యభూపతి నీడంచెలియన్ ప్రభువరేణ్యునకుఁ గల 'ఆర్యపాడై తాండ్య' అనఁగా 'ఆర్యవిజేత' యను బిరుదుకూడ పై విషయమును నిర్ధారించుచున్నది. చోళదేశాధీశుఁడు కారికాళనరేంద్రుఁడు కూడ హిమగిరిచెంతకు దండువెడలి, అచటఁ దన వ్యాఘ్రచిహ్నమును జెక్కించెను. కాన నాతఁ డెవఁడో యొకయార్యరాజుతో సమర మొనరించి యుండుననియే పై సంగతి విశదపఱచుచున్నది. కావున, నేటి ద్రావిడార్యవైషమ్యము నిన్ననో మొన్ననో పుట్టినదని గాని, హిందీప్రచారోద్యమమువలనఁ గలిగినదనిగాని, తలంపఁ జనదు. ఈస్పర్ధలు పర్వతములు పుట్టినప్పటివి. నేఁడో, నిజవృత్తాంతము తాఱుమాఱైనది. దాక్షిణాత్యులైనవారెల్ల నౌత్తరాహులకుఁ బ్రతిపక్షులని చెప్పక, కేవలము దక్షిణసముద్రప్రాంతవాసులే వారికెదురై యున్నారనుచున్నారు. ఈపగకుఁ బ్రతిఫలముగఁ బూర్వము రుధిరము ప్రవహించెడిది; పీనుఁగులు గుట్టలయ్యెడివి. కాని, నేఁడో పండ్లుకొఱుకుటతోఁడను, మాటలతోఁడను వివాదము పరిష్కార మగుచున్నది. మదోన్మత్తులగు నార్యులతో బ్రాహ్మణే

తరుఁ డగు శెంగుత్తువన్ పోరాడినపుడు బ్రాహ్మణుఁడగు మదలన్ బాసటగాయుండెనని మన మిచట గమనింపవలసి యున్నది.

నేనీ కథారచనను ముగించినపిదప, శ్రీ రామచంద్ర దీక్షితరు అమోఘముగ ననువాద మొనరించిన 'శిలప్పదికారమ్' నుజూచుట తటస్థించినది. నాకథను బ్రచురింపఁ బోవుటకు ముందు నేనాగ్రంథమును బరిశీలించితిని. అదికారణముగ, తమిళభాషలో మూలగ్రంథమును జదువుటకు శక్తిచాలని పాఠకు లీ యనువాదగ్రంథము నామూలముగఁ బఠించిన, 'శిలప్పదికారమ్' నందలి విషయముల నన్లే గ్రహించుటకు వీలుండునని నేను నిబ్బరముతోఁ జెప్పుచున్నాను.

మఱియొకమాటతో ముగింతును. ద్రావిడులు తమ పూర్వచారిత్రమునకై సహజగర్వ మూనుట కీ గ్రంథము తోడ్పడుననియు, తమ మాతృభాష నింకను నిట్టి 'శిలప్పదికారమ్' లతోడను, 'మణిమేఖల'లతోడను భాగ్యవంత మొనరించి తమప్రతిష్ఠ నింకను బెంపొందింపఁ జేసికొనుట సాధ్యమును, ధర్మమునై యున్నది. ఇంతే కాదు. దక్షిణదేశమునఁ గేదారములకు జీవనప్రదమగు కావేరీపూతజలములను గంగాయమునాతోయములు మీఱఁజాలనిరీతిగా, ద్రవిడభూమి యందుఁ దమిళభాషకుఁ గల కీర్తిప్రతిష్ఠల నేమైన సంస్కృత హిందీవాఙ్మయములు డిందుపఱచునేమో యను భయము కూడఁ బాఱిపోవును. ద్రావిడుల సహజగుణములను, కళానైపుణ్యమును ద్రావిడేతరులు గ్రహించుటకై యీగ్రంథము తోడ్పడునని నేను నమ్ముచున్నాను.

వే. యస్. పి. అయ్యర్.

# విషయసూచిక

ప్రకరణము. | | పుట.

# మొదటి ప్రకరణము

## కన్నకీ కోవలర్కల వివాహము

శ్రీమంతుండును సూర్య శిబి వంశీయుండును నగు చోళ రాజేంద్రుఁ డొకఁడు పదునెనిమిదివందల సంవత్సరములక్రిందట నుండెను. అతనిరథము భయంకరమగు వ్యాఘ్రపతాకమును గలది. ఆతనిరాజ్యము చోళమండలము. దానికి రాజధాని గావేరీపూంపట్టణము. 'పుహార్' అని దీనికి మఱియొక పేరు. ఆపురత్న్మి కావేరినదీ ముఖద్వారమున విహరించుచు, తులలేని వాణిజ్యముద్వారా దక్షిణోత్తరముల, తూర్పుపడమరలఁ గల భూభాగములతోఁ జేతులు గలిపి సయ్యాటలాడుచుండును. ఉత్తరమునఁ దిరుపతికొండలు, దక్షిణమున వల్లారునది, తూర్పున బంగాళాఖాతము, పడమరఁ జోళమండలపుఁ బొలిమేర—వీనికి మధ్యఁగల విశాలచోళమండలమున నుత్పత్తియగు సకలవస్తుసముదాయమునకు ముఖ్యపట్టణము విక్రయస్థానమై యుండెడిది. ఆరాజ్యవైభవమును, కీర్తిని, సౌఖ్యానందములను ప్రభువరేణ్యుఁ డగు కారికాళుఁ డెన్నియోమడుంగు లభివృద్ధిపఱచెను. ఉద్యానవనపరివేష్టితములగు రాజభవనములను నిర్మించెను. శృంగారవన విరాజితములగు దేవాలయములం బెక్కింటిని బ్రతిష్ఠించెను. తనప్రజలచేతను, లంకాద్వీపమునుండి బంధించుకొనివచ్చిన 12,000 రాజకీయ

ఖైదీలచేతను, ఆరాజన్యుఁడు కావేరీనది కిరువైపుల నూఱు మైళ్లపొడవున నెత్తగు గట్టులు పోయించుటయే గాక, పెద్ద యనకట్టను గట్టించి లెక్కకు మిక్కిలియగు పంటకాలువలను ద్రవ్వించెను. ఇట్లాతఁడు తంజాపూరుమండలమును దక్షిణ దిశకు 'ధాన్యాగారము'గా నొనరించి, అంతకుమున్నే ముత్య ప్రవాళవ్యాపారమునఁ బ్రసిద్ధికెక్కియుండు 'పుహార్' ను ధాన్యమెగుమతిచేయు రేవుపట్టణములలోఁ గేంద్రస్థానముగాఁ జేసెను. ఆభూపతి హిమగిరికి దండెత్తి పర్వతమును దాయుటకు దాటిన కనుమను దానే 'చోళకనుమ'యను పేరిడి, ఆ పర్వతశ్రేణికి 'చోళశ్రేణి' యను నామమిచ్చి, దానిపైఁ దన వ్యాఘ్రచిహ్నమును జెక్కించెను. నాగుల నోడించి నాగపట్టణము నాక్రమించెను. 'వేణి' యుద్ధమునఁ జేరరాజోత్తముని పొగరడంచెను. లంకాద్వీపముపై దాడివెడలి లోఁబఱచుకొనెను. ఇట్లా పుడమిఱేఁడు తనరాజ్యగౌరవమును, రాజధానిప్రతిష్ఠను పెంపొందింపఁజేయఁ గలిగెను. అప్పటికే యాచారములో నుండిన ఇంద్రోత్సవమునకుఁ దోడు, కావేరీనదికి మొదటివెల్లువ వచ్చినపుడు పండుగలు చేయుట ట్లాతఁ డొనరించి నిత్యకల్యాణము పచ్చతోరణమై యలరారుచుండు 'పుహార్'ను నిరుపమానంద చంద్రికతో నింపి దైనందిన నిర్వాచారజీవితమునకు శోభఁ దెచ్చెను.

ఆపురి యడ్డముగా మూఁడుమైళ్లపొడ వుండును. అది విశాలములగు రెండుభాగములుగా విడఁదీయఁబడి యుండెను. రెంటిలో నొకటి 'మరువూర్ పాకమ్' ఓడరేవు చెంతనేయున్నది. అచట ధనాధికులగు విదేశీయుల భవనములును, జన

షమృద్ధములగు విపణివీథులును, విక్రయశాలలును గలవు. దూర దేశములనుండి యరుదెంచిన నావికులచటఁ గాననగుచుందురు. పట్టుబట్టలు, పగడములు, ముత్యములు, బంగారు, మణులు, చందనము, గోపనసము (ఒకవిధమగు బంక), పదునెనిమిది విధములగు ధాన్యములు—అంగడివీథియందు కావలసినన్ని చిక్కుచుండును. చాకళ్లు, వడ్రంగులు, కమ్మర్లు, శిల్పులు, కుమ్మర్లు, కంసాలులు, కల్లుగీడ్డంగులు, బెస్తవాండ్రు, మాదిగ వాండ్రు, కుట్రపువారు, మేళగాండ్రు—వీరికి వేరు వేరువీథు లుండెడివి. ఉప్పు, మాంసము, చమురు, ఇత్తళి, రాగి, బెండు, బట్టలు—యీావర్తకులును వేరువేరు వీథులయందుండిరి. రంగులు, స్నానమునకు వలయుచూర్ణములు, సున్నిపిండి, చల్లనిలేపనము, పూలు, ధూపసువాసనాద్రవ్యములు—వీనిని వీథులఁ దిరిగి వర్తకు లమ్ముచుందురు.

రెండవ భాగమగు 'పట్టినపాకమ్' చాల నాగరక ప్రదేశము. దానికిని 'మరువూరి పాకమ్' నకు నడుమ నుండు మైదానమునం దనుదినము సంత జరుగుచుండును. 'పట్టినపాకమ్' నందు రాజవీథి, తేరువీథి, భోగ్యపదార్థముల నమ్మునంగళ్లు గలవు. అచటి రాజవీథియందు ద్రావిడులగు వైశ్యశిఖామణులు దివ్య భవనములందు నివసించుచుండిరి. బ్రాహ్మణులు, క్షత్రియులు, రైతులు, జ్యోతిష్కులు, వైద్యులు, రత్నములను సానఁబట్టు వారు, నెఱజాణలగు భోగముచానలు, నటకులు—వీరు వేరు వేరు వీథులయందుఁ గాపురముండిరి.

నగరమధ్యభాగమునఁ గూడలియందు 'భూతచతుకము (గ్రామదేవతాలయము) కలదు. 'కపటసన్యాసులను, జారులను

చోరులను, ద్రోహులను, అసత్యవాదులను, త్రాటఁగట్టి మ్రింగుదు' నని గ్రామశక్తి ప్రతిదిన మర్ధరాత్రమున బెదరించు బెడిదపువాక్యములు చుట్టుపట్లఁ బదిమైళ్లవఱకు విననగుచుండు నను ప్రతీతి కలదు. సంతప్రదేశమందు వేలకువేలు సరకు మూటలు తూకములతో ఆసామివిలాసములతో గుట్టలుగుట్ట లుగాఁ బడియుండెడివి. వీనికి ద్వారబంధములుగాని, తాళము వేయుటఁగాని, కడకుఁ కాపుకాయుటఁ గాని వాడుక లేదు. ఒకవేళ యెవఁడైన దొంగతనమునకుఁ బాల్పడినచోఁ దొంగ సొత్తును దలపైనుండి క్రింద దింపనీయక సూర్యోదయమగు వఱకు నగరమంతయుఁ దిరుగఁజేసి, కడకుఁ బురరక్షకభటులకు వాని నొప్పగించి ప్రాణము దీయించునంత ప్రభావ మా గ్రామ శక్తికిఁ గలదని జనులు నమ్ముచుందురు. నగరమునందింకను దేవళములు గలవు. అందొకటి శ్రీవిష్ణుదేవాలయము. శ్రీ మహావిష్ణువు పాలసముద్రములో శేషశయ్యపై యనంతశయన మున యోగనిద్రాముద్రితుఁడై యం దుపవసించి యుండును. ఇంకను శివాలయము, ఇంద్రాలయము, మురుగళమందిరము, కృష్ణమందిరము, బలరామాలయము కూడ నున్నవి. ఇంద్ర ప్రతిష్ఠాపనములని ప్రసిద్ధికెక్కిన బోధివృక్షమును, బౌద్ధవిహార సప్తకమును గలవు. బంగారుపూలతోనిండిన యశోకవృక్ష మును, దానిచెంతనే శృంగారమగు 'శిలాతలము'ను (జైన దేవాలయము) గలవు.

ఆ మహాపట్టణమున మహానాయకుఁడను విఖ్యాతవణి క్పుంగవుఁ డొకఁడు కలఁడు. సప్తసముద్రముల నాతనినౌకలు పోనితావుగాని, వ్యాపారము పాఱనిచోటుగాని లేదని చెప్ప

వచ్చును. ఆతఁ డడిగిన లేదను నుడువెఱుంగని నెఱదాత; దానకర్ణుఁడు. మితిమెఱుంగని మేఘునిరీతి యాతఁ డీవియం దంత మెఱుంగఁడు. ఆతని పత్ని పేరు 'ఆండాళ్.' ఆదంపతులు కావేరీనదీకూలమునఁగల సౌధరాజమునఁ బరమానందసౌఖ్య డోలికల నూగులాడుచు నివసించు చుండిరి. కాని బిడ్డలు లేని కొఱతమాత్రము ప్రేమానందబంధురులగు నా దంపతులను బాధించుచుండెను. సంతానప్రాప్తికై వేదసాదులకు వా రన్న దాన మొనరించిరి; లెక్కకు మిక్కిలియగు దానములు జేసిరి. కూడ వా రగ్ని దేవునిగూర్చి యథావిధిగఁ బ్రార్థింప నామహా దేవుని ప్రసాదముగా వారికొక బాలిక కలిగెను. అపరంజిని గేరు మైకాంతితో నుండు నాబాలికామణికి వారు కన్నకి యని పేరు పెట్టిరి. ఆకన్నె యనుదిన ప్రవర్ధమానయై పదునాలు గేడుల యీడుకు వచ్చునప్పటికంతయుఁ జూపఱమనములఁ జూఱఁగొన సాగిన దనుటలో నతిశయోక్తి లేదన నగును. శృంగారలావణ్యములఁ గమలాలయఁ బోలి, ఆదర్శగృహిణి యగు నరుంధతీదేవితో సౌశీల్యసౌభాగ్యాది సంసారధర్మముల యం దెనయై యున్నదని కన్నకిని గన్నవారంద అంగీకరించు చుండిరి.

ఆనగరమునందే మఱియొక వర్తకశ్రేష్ఠుఁడు మహాసత్తుఁ డనుపేర నుండెను. లెక్కకందని బిడారు లెన్నియో యాత నికిఁ గలవు. అవి ద్వీపకల్పమున నన్నివైపుల సంచరించు చుం డును. కారికాళరాజేంద్రుఁడు కావేరీనదికి గట్టిపోయించి, కాలువలు ద్రవ్వించుటకుఁ బూర్వము ఘోరమగుకఱవు సంభ వింపఁగా, మహాసత్తుఁ జేమాత్రము గాని వెనుకంజవేయక

బాధితులగు పేదలకుఁ బెక్కుర కనేకవిధముల సాయ మొన రించెను. ఆదాతృత్వమును గమనించి కారికాళరాజేంద్రుఁ డాదానవీరునకు వంశపారంపర్యముగ నుత్తమాధికార పద విని బ్రసాదించి యాదరించెను. మహాసత్వ్వన కొకపుత్రుఁడు గలఁడు. అతఁడు సుందరాంగుఁడు; సకల గుణాభిరాముఁడు; పేరు కోవలన్; పదునారేండ్లు నిండియు నిండని యువకుఁడు. దేవదేవుఁడగు 'సుబ్రహ్మణ్యస్వామియే యిట్లు కోవలన్‌రూప మున నవతరించెనేమో యని యౌవనవిరాజితుఁడగు కోవ లన్‌ను గూర్చి పౌరులు భావించుచుందురు.

కన్నకీకోవలన్‌ల వివాహము సముచితమనియు, అది జరుగుననియుఁ బురమునఁగల సంధానకర్తలు భవిష్యత్సూచక ముగ ననుచు, ఆ యువతీయువకు లన్నివిధముల నుత్తమో త్తము లనుచుండిరి. కోవలన్ మిత్రులు కన్నకిని గుఱించి చెప్పి, ఆతనికిఁ దగుసతి యాకాంతయే యని నొక్కి పలికిరి. కన్నకిచెలు లామెకుఁ గోవలన్‌ను గూర్చి చెప్పి, పుహారునం దామె చేపట్టఁదగిన యువకుఁ డొక్కకోవలన్ తప్ప మఱి లేడని నిర్ధారించిరి. ఇట్లు వారిని సహజానురాగము కలిపి వెనఁ గొన, ఒకరినొకరు గాంచవలయు ననుకోరిక లీరికలెత్తసా గెను. ఒకనాఁడు 'ప్రథమ ప్రవాహామహోత్సవము'ను బుర స్కరించుకొని, ఆ యువతీయువకుల స్నేహితు లొకానొక యుపాయమున వారినెదురు పదుపఁ గలిగిరి. ప్రథమసందర్శన మునసే ఒక్కక్షణములో వారు ప్రేమబద్ధులైరి. ఆవెనుక వారు తమ ప్రేమోదంతమును గూర్చి తమతల్లిదండ్రులతో నొక్కపలుకైనఁ బలికినవారు కారు.

కన్నకికిఁ బదునాల్గేండ్లు నిండినవిగదా; శాస్త్రప్రకారము కోమటికన్నె కప్పటికే పెండ్లియై యుండవలసినది. ఆమెతల్లి ఆండాళ్ యీవిషయమై కలవరపడ సాగెను. తనభర్త మహానాయకుఁడు తన తనయ వివాహమును గూర్చి యే మాత్రము గాని శ్రద్ధవహించుట లేదని కూడ నామె లోలోనఁ గుమిలి పోవుచుండెను. ఒకనాటి సంజవేళ తనసతి చిన్నవోయి యుండుటను గాంచి మహానాయకుఁడు కారణ మడుగ నామె "ఏమి చూచుకొని నేనెగిరి పడవలయు?" నని చిరాకుతో జబాబు చెప్పెను. అందుల కాతఁడు 'తెలివి తక్కువ దానా! నీయదృష్టమునకుఁ గన్నులుతిరిగి నీవు దైవ మును మఱచిన ట్లున్నావుసుమా?' యని బుద్ధిచెప్పెను. సేవకుల ముందు పతి తన్ను విదలించినందున, ఆండాళ్‌కుఁ గినుక యినుమడించెను. ఆమె కామాటలు పుండుపై ముల్లు గ్రుచ్చి నట్లు కాఁగా, కోపముతోఁ దనగదికిఁ బోయి పరుండెను.

మహానాయకుఁడును భోజనానంతరము పడుకగదిని జేరి, భార్యకొఱకు వేచియుండెను. కాని యెంతసేపటికి నామె రానందునఁ బరిచారికను బిలిచి యామెఁ గొనిరమ్మని బంపెను. విచిత్రము చూడుఁడు: ఆతఁడు నైతము కన్నకిపెండ్లిని నిర్ధా రింప నెంచియే, తనపత్నితో నావిషయమై ముచ్చటింప నెంచి యుండెను.

ఆండాళ్ పడుకటింటికి వచ్చి పతిని డాసి "ఎందుకుఁ బిలిపించితిరి?" అని యడిగెను.

"ముఖ్యమగు నొకవిషయమును గుఱించి నీతో

యోచింపవలసి యున్నది. రా; వచ్చి నాప్రక్కన గూర్చుండు మ”ని మహానాయకుఁడు పిలిచెను.

“నేను తెలివితక్కువదానను లెండు. నాతో యోచించి ప్రయోజన మేమియుండును?” అని యామె నిష్ఠురముగఁ బలికి మొగము త్రిప్పుకొనెను.

మహానాయకుఁ డది గ్రహించి లేనవ్వుతో “ఓహో! మహారాణిగారికి నేడు కోపమువచ్చినట్లున్న దే! సరి, సరి! కారణము తెలిసినది! నిన్నట్లు వేడుక కంటినేగాని, వేరు గాదు. చూడు! మనకన్నకి కల్యాణముగూర్చి నీతో మాట్లాడవలసి యున్నది” అని బుజ్జగించెను.

ఆపలుకులకు ఆండాళ్ మోము వికసించెను. ఆమె పెదవులఁ జిఱునగ వగపడెను. పతిదిక్కు తిరిగి “కన్నకి పెండ్లియా?” అని యామె యాతనిఁ జేరి “నామానసము నింతకాలముగాఁ గలంచుచుండిన దా సంగతియే కదా?” యనెను.

“ఎంత వెఱ్ఱిదానవు!” అని యాతఁడు భార్యబుగ్గ గిల్లి కౌఁగిటఁ జేర్చుకొని “నాతో నెందులకుఁ జెప్పవైతివి? ఇన్నాళ్లుగా నదేసంగతిని గూర్చి నేనుగూడఁ గలఁతఁజెందుచుంటిని గదా? ఒకసంగతి వినుము: నిన్నసాయంకాలము మనకుల వృద్ధులు ‘సమితి సమారాధన’ను జరుపుటకై సభచేసిరి. అప్పుడు మహాసత్తువుఁడు నన్నావలకుఁ గొనిపోయి ఆమాటలీమాటలు నడుమ మనతో వియ్యమందుటకుఁ దా నువ్విళ్లూరుచుండునట్లు నాకు సూచించినాఁడు. కాని నీమన స్సెఱుంగు

నంతవఱకు ఎట్టుం బలుకుటకుంగాని లేదని తలంచి, నేనెట్టుగాని మాట జాఱవిడువ లేదు. ఆతనికుమారుఁడు కోవలక్ ప్రజాను రంజకుఁ డని మన మెఱింగిన సంగతియే గదా! ఆతఁడు మన తనూజకుఁ దగినవరుఁడని నావిశ్వాసము" అని పలికెను.

"న న్నడిగినచోఁ జిలుకముక్కునకు దొండపండు గట్టి నట్లు వారిసంబంధము సమంజసమై, సంస్తుతనీయమై యుండు నందును. వెంటనే యీమనువు నిర్ధారింపుఁడు. ఏమాత్రము గాని జాగుసేయకుఁడు. నాతో యోచింపకయే మీకై మీరే యిట్టి సంబంధమును నిశ్చయించి యుండవలసినది; ఇం దేమి లోటున్నదని నాతో ప్రస్తావింప నెంచితిరి?"

"అట్లు గాదు. నీయభిప్రాయ మెఱుంగకయే నేనెట్లు మాట యీయఁగలను? అదియుఁ గాక, యిట్టివిషయముల యందలి మన వేగిరపాటు ఏదియేని సంశయములకుఁ గారణ మీయవచ్చును. కోవలక్ మనకుఁ గాంక్షణీయుఁడగు నల్లుఁడు గావచ్చుఁగాక! మనకన్నకిమాత్ర మినుమిక్కిలిగాఁ గోరఁదగిన కోడలుగాదా?"

"అవు నది నిజముగాక మఱేమి? చూడండి; రేపు శుక్రవారము శుభదినము; మీరు మహాసత్తుని గలుసుకొని సంబంధమును నిర్ధారింపుఁడు."

"ఆలాగే"

ఆదంపతులు లోరేయి యనుభవించిన సౌఖ్యము కొన్ని యేండ్లకీవల యనుభవించి యుండరని గట్టిగాఁ జెప్పవచ్చును.

తమ యేకైకపుత్రికను గూర్చి వారేమేమియో మాట్లాడు కొనిరి. ఇంతయేల? వారారాత్రి కన్నుమూసినవారు గారు!

మఱునాటి యుదయమున మహానాయకుఁడు మహా సత్త్వుని గలుసుకొని వివాహవిషయముఁ బ్రస్తావించెను. మహాసత్త్వునకుఁ గొండయెక్కినంత సంతోషము కలిగెను. కాని యాతఁ డొక్కమాట మాత్రము చెప్పెను. పెండ్లియాడ నుండు వధూవరు లొండొరులఁ జూచుకొనినచో, పిమ్మట వారిసమ్మతితో, లేక వారియాక్షేపణ లేశమైనను లేక కల్యాణము జరుపనగు నని యాతఁ డనెను.

"బావా! నీకుఁ దెలియని దేమికలదు? ఇట్టివిషయము లందు వారియభిప్రాయ మెఱుంగుట ముఖ్యమును, సమంజసమును గదా?"

"ఔనౌను. నేను కా దనను. అందు మించిపోవునది లేదు. రెండువైపులనుండి యాక్షేపణ లేట్టివిగాని యుండవని నాకింతకుముందే తెలియును."

వారు కోవలన్ కన్నకిలను బిలువఁబంపిరి. 'నీవు పెండ్లి యాడనుండు కన్యను జూచుటకు రమ్మ'ని కోవలన్‌కు, 'నీవు జేపట్టనుండు వరునిఁ గాంచుటకు రమ్మ'ని కన్నకికి వర్తమాన మంపి వారిని రప్పించిరి. ఆత్మబంధువులకు నైతఁ మింతదనుకఁ దెలియకుండురీతిగాఁ, గోవలన్ కన్నకిల హృదయఫలకము లన్యోన్య రూప ముద్రితములై యున్నవి. కాన నావార్త యా రమణీరమణుల మనోవ్యాకులతకుఁ గారణ మయ్యెను.

దానంజేసి, మనస్సులు వెనుకకు లాగుచున్నను, దేహములను మాత్రము ముందుకునడిపి, పిత్రాజ్ఞను వారు దాటరైరి. కాని, వారి యాశ్చర్యమును, సంతోషమును నేమందును? నిశ్శబ్ద నిరాశాంధకారమునఁ దిరుగుచు, పరస్పర పాణిగ్రహణమున కడ్డుతగులు క్షణము నొకయుగముగా నెంచుతామ్మే, ఎవరినో గాదు, ఒకరినొకరు చేపట్టు భాగ్యమంద నున్నారని గ్రహించి పొందిన యానందమునకు మేరయున్నదా? వెల్లివిరియు వారి ప్రేమానందములు వారిజనకులకు వింతఁ గొలుపలేదు. తమ కుమారీ కుమారుల యనురాగము సహజమును నిర్దోషము నని వారికి బాగుగాఁ దెలియును. ఇట్లా పిన్నల సమ్మతి నందిన పిదప పెండ్లిముహూర్తము నిర్ణయింపఁబడెను.

ముద్దుగుమ్మలు మదగజము నెక్కి నగరమందలి పెద్ద లను బెండ్లికిఁ బిలిచి వచ్చిరి. ధౌతవర్ణాంకితములగు ఛత్రములం బట్టి వధూవరులను రాజవీథులయందు వైభవోపేతముగఁ గర్ణపేయములగు మంగళవాద్యములతో నుత్సవ మొనరించిరి. ఆణిముత్యములచేతను; మణిమాణిక్యములచేతను ధగద్ధ గాయమానముగ నలంకరించిన చవికను, నిర్మించిరి. దానికి మధ్య నీలవర్ణపుఁ బట్టుబట్టతో చాందిని గట్టి రంగురంగుల పూలతో శృంగారించి, వధూవరుల నందుఁ గూర్చుండఁజేసిరి. పందిలిగుంజలన్నియుఁ బూలమాలలతోఁ జుట్టఁబడి యుండెను. అవి మణిమయములై వివిధవర్ణములగు దీపకళికలతోఁ జుట్టఁ బడి యుండెను. ఆదృశ్యరామణీయకత దేవలోకమును దలం పునకుఁ దెచ్చుచుండినది. అది తోరాబలముగల శుభ్రముహూ

ర్తము. దివ్యాలంకార సంశోభితయగు కన్నకి పాణిని గ్రహించి కోవలన్ హవ్యవాహనునకు సప్తపది యొనరించి ప్రదక్షిణము గావించెను. ప్రభువరేణ్యుఁడు, పౌరప్రముఖులు సాక్షిగ నుండు నాసభయందుఁ గోవలన్ కన్నకికంఠమున మంగళ సూత్రధారణ మొనరించెను. అన్నలమిన్నలు వంతులువేసి కొని వరుసపాటలను కర్ణానందముగఁ బాడుచుఁ బుష్పము లతో సుగంధద్రవ్యములతో నతిథిసత్కార మొనరించు చుండిరి. లావణ్యవతులు గొందఱు వధూవరులకుఁ జందన మలఁది పరిమళతాంబూలముల నిచ్చిరి. కుందరదనలు కొందఱు దీపపుఁబళ్లెములఁ బట్టి, పాలకులఁ దెచ్చి యారమణీరమణుల చుట్టును బెట్టి "మీజీవితము సౌఖ్యావహమై, నిర్మలమై యుండుఁ గాక! మీకెడఁబాటు లేకుండుఁ గాక! మీప్రేమ యెన్నఁడుఁ దఱుగక, ఎప్పుడును బెరుగుచుండును గాక!" అని దీవనలిచ్చిరి. అంత వారు సోయగము రూపొంది చిందులాడు శయనాగారమునకుఁ దీసికొని పోయి, అందు విడిచిరి.

ఆ కాముకీకాముకులు రత్నములుదాపిన కాళ్లతో నుండుపాన్పుపైఁ గూర్చుండి, పడుకటింటి వైభవమును గన్ను లతోఁ గ్రోలసాగిరి. వారంత మేడపైకిఁ బోయిరి. అచట వారికై పాన్పువేసి యుండిరి. కోవలన్ మల్లెపూలమాలను ధరించెను; కన్నకి చేమంతిపూలదండను వేసికొనెను. కోవలన్ తనకంఠహారమును దీసి కన్నకి మెడయందు వేసి

'ప్రాణసఖి! జ్యోత్స్నయలమై యాశాంతసీమ
రమ్ము! ననుఁ గౌఁగిలింప స్వర్ణలతమాడ్కి;

తారకై సుధాంశునివలెఁ దాపమందు
నన్ను ముంపకు బహుళసంతాపమందు'

అని పలికి బిగికౌఁగిటఁ జేర్చి యదుముకొని చుఱుక్కున ముద్దు పెట్టుకొనెను. ఆజవరాలిమేను పులకలెత్తెను. కోరికలు క్రెళ్లు ఱికెను. ఆయువతి యానందపరవశయై

'కలిసికొంటిని, కాలమ్ము గడిచిపోయె
ముద్దులాడితి నీపైని మురువుచేత;
నిండు హృదయంబు దుఃఖాబ్ధి నీదులాడె;
జీవితము నీవు లేకున్నఁ జీకుచెందె;
కనులఁ గట్టిన నీవిప్పు కఱవుదీర
దగ్గఱం జేర్చి నెమ్మదిఁ దన్వుచుండ
భయపిశాచంబు దూరానఁ బట్టఁబడియె,
దుఃఖఘాతము నట్టెటఁ ద్రోయఁబడియె.
నాహృదయపీఠి నిల్పి సంతతము నీదు
మూర్తిఁ బూజించితి వలపుఁబూలచేత.
అయ్యయో! మనమింక నెడబాయఁ దగదు
జన్మజన్మాలకైన నీజగతియందు.'

అని ప్రేమమీఱఁ బలికెను.

అందుల కాయువకుఁడు సంతోషమున నుప్పొంగి "అట్లే యగుఁగాక! ప్రేయసీ! నన్నింకను బిగియారఁ గౌఁగిలించుము. నురుగులు దేరుమధువుకొలఁకుఁ ద్రాగుఁబోతు తందనాలాడు రీతి, నీయధరమును మఱిమఱి యానవలయునని నా కుబలా

టము గలుగుచున్నది. కోమలాంగీ! ప్రేమపాత్రమునఁ ద్రాగు తేనెకలిసిన పాలవలె, నీముద్దులు తియ్యగా నున్నవి సుమా! వలచి వలపించుకొనిన వనితామణి కౌఁగిటనుండునంత మధుర తరానందమునకు వైకుంఠపదవియైన సరియగునా? నాసయనేం ద్రియములప్రయోజనము, కర్ణేంద్రియములయుపయోగము, ఘ్రాణేంద్రియము కలిమి, చిలుకలకొలికీ! నీవలన సార్థక మగు చున్నది. నీకంకణనిస్వనములు, నూపురనినాదములు నీరూప లావణ్యములఁ బ్రస్తుతించుచున్న ట్లున్నవి సుమా! కామ దేవుఁడు రతీదేవి నెడబాయుటకుఁ గలనైన నెంచనివిధమున, నేను నిన్నెట్లు క్షణమైన విడిచియుండ నోపుదును?" అని ప్రియోక్తు లాడెను.

వారంతఁ బాన్పుపైఁ బరుండిరి. విశాలములగు నా కాంతభుజములపై నాయుకుఁడు చందనముతోడను, చెఱకు రసముతోడను, కామవల్లి - సాయమునఁ గామదేవునిచిహ్న ములఁ జిత్రించెను. అతోయ్యలి నాతఁడు బిగ్గఁ గౌఁగిలించు కొని "ప్రేయసీ! కాముఁడు, మహేంద్రుఁడు, స్కాందుఁడు, నీసౌందర్య పరమావధికిఁ దోడ్పడి రనుట నిస్సంశయము. మయూరము తన లావణ్యమును నీయెదుటఁ బ్రదర్శించుటకు సిగ్గొందుచుండును. నీసమక్షమున హంస నడచుటకు జంకుచుం డును. నీమధురస్వరముతో సరిపోల్చినఁ గోయిలపలుకు కొంగురువోయిన ట్లుండును. ఓ చక్రస్తనీ! అలినీలాలకా! సింహేంద్రమధ్యా! మధురాధరీ! లావణ్యనేత్రీ! నీకు మఱి

నగలతోఁ బనియేమి? కమ్మనితావులను వెదఁజల్లు నీకు మఱి పరిమళములతోఁ బ్రయోజన మేమి? నీవు మగువలలో ముత్యమువంటి దానవుగదా! మఱి, ముత్యములు నీరూపము నకు శోభ నెట్లీయఁ గలవు? కాంతామణీ! కన్నకీ! నీవు లక్ష్మీ పార్వతీ సరస్వతులకంటె సౌందర్యవతివి సుమా! రమ్ము! నారీ మణీ! నవమోహనాంగీ! రమ్ము! దగ్గఱకు రమ్ము! వచ్చి, నీ బాహువల్లరుల నన్నుఁ బెనఁగొని నన్నానందసామ్రాజ్య పట్టభద్రునిఁ జేయుము"ని యుద్రేకమానసమునఁ బలికెను.

కన్నకి యాతని నాలింగన మొనరించుకొనెను. వారి కారాత్రి చల్లనివెన్నెలగాని, నల్లనియాకసముగాని మదికి రాలేదు. ఆరేయియంతయు వారు కామకేళి నుండిరి.

# రెండవ ప్రకరణము

———

## మబ్బు క్రమ్మినది.

మహాసత్వనిగ్రహమునఁ గోవలఁకన్నకిలు చాలదిన ములు సౌఖ్యాందోళికల నూగుచుఁ గాలము వెళ్లఁబుచ్చు చుండిరి. అతిథులను, అభ్యాగతులను, బంధువులను, మిత్రు లను, కన్నకి తగువిధమున నాదరించుటకు వీలగునట్లు సేవకాది పరిచారకులఁ బెక్కుర నొసంగి సకలసౌందర్య నిలయమగు సౌధమున నాయువతీయువకులను కోవలఁ తల్లి కాపురముం చెను. 'వినూతన వధూవరులు వేరుగానుండు భవనమునం దుండిన, వారి ప్రణయరాజ్యము ప్రేమశాంతులకు నిలయమై యుండును. పెద్దలయాటంకము వారికుండదు' అని యామె యనెను.

మూఁడేండ్లు నిండినవి. కామరసాధిదేవతలగు రతీమన్మ థులవలె నారమణీరమణు లతులితానందము ననుభవించి సౌఖ్యాంబుధిఁ దేలియాడిరి. అప్పటివారి యానంద మనంతము; అనుపమానము. సంసారధర్మమును జక్కఁగ నిర్వహించి 'సతీ త్వమున సాటిలేని దని' కన్నకి ప్రజాదరణను బడసెను. 'అన్న మో రామచంద్రా'యను పేదల కన్నదాన మొనరించి 'అన్న పూర్ణ'యను ప్రతీతి సంతఁ గలిగెను. కోవలఁగూడ ధనాధికుఁ డనియు, పౌరప్రముఖుఁ డగు వణిక్కుమారుఁ డనియు, నిరు

షమ కళాకుశలుఁ డనియు— ముఖ్యముగా సంగీత నాట్య కళాభిమాని యని—విఖ్యాతి నందెను. అతఁ డసమానుఁడగు వైణికుఁడు; మురళి నూదుటయం దతని కతఁడే సాటి. గాన కళయం దాయువకుఁడు కూలంకషప్రజ్ఞఁ గలవాఁడు. శాస్త్రీయమును, ప్రజానుమోదసహితము నగు నాట్యకళయం దాతఁ డనుభవపరుఁడు. అపుడపుడు పురమునందు జరుగు నాట్య సంగీతసభల కాతఁడు పోవుచుండువాడుక కలదు.

ఆకాలమున 'పుహార్'నందుఁ జిత్రావతి యనువేశ్య యుండెను. గానమునందును, నాట్యమునందు నాపడపుఁజెలి ప్రవీణురాలు. ఆగణికకళాప్రదర్శనములకుఁ బ్రేక్షకు లమిత ముగా వచ్చుచుండెడివారు. రాజులు, రాజకుమారులు గూడ నాసభల నలంకరించు చుండిరి. కోవలన్ పోనిసభ యొక్కటి యైన లేదనుట యతిశయోక్తి కాదు. ఆతఁడు ప్రతిసభకు యథావిధిగఁ బోవుచుండెను. చిత్రావతి కొకకుమార్తె కలదు. ఆ కోమలిపేరు మాధవి. ఆ వెలయాలిసౌందర్య మలౌక్యము; అప్రతిమానము. నాట్యము, సంగీతము, సౌందర్యము సమ్మే ళనమొంది యిట్లు రూపుదాల్చెనా యని యామెగువను గన్న వారికిఁ దోఁచుచుండును. పూర్వ మెప్పుడో యా వారకాంత వంశమున నదేపేరున మాధవి యను సుదతి యుండినదఁట! ఆమాధవియే యిప్పు డీమాధవిగా జన్మించెనా యని స్ఫు రించు చుండును. అప్సరసయగు నూర్వశి పూర్వ మగస్త్య మహర్షిశాపమున మాధవి యనుపేరుతో భూలోకమున భోగమువెలఁదిగా జన్మింపవలసి వచ్చెను. ఊర్వశి ఇంద్రసభ యందు నాట్యముచేయుచుండ, నామెయాటకుఁ దగినట్లు

నారదమహాముని వీణవాయించుట లేదనియు, ఊర్వశి ఇంద్రుని కుమారుఁడగు జయంతునిపై మోహదృష్టులఁ బ్రసరించుచు సరిగ నటించుట లేదని యగస్త్యుఁడు గమనించెను. ఆతఁడందులకుఁ గోపోద్రిక్తుఁడై "ఊర్వశి భువిపై వేశ్యయై పుట్టును గాక! జయంతుఁడు పురుషవేణువై జన్మించును గాక! ఇట్లు భ్రష్టయగు నూర్వశియు, యచ్చరమచ్చకంటి సంతతియు ధరణిపై పుహార్‌లో జరుగు మహేంద్రోత్సవమునఁ బురుషవేణువును వేత్రముగా ధరించి నృత్య మొనరించు చుందురు గాక! జయంతకుమారుఁ డీవిధమున నూర్వశినాట్యమునకుఁ బ్రతిబంధక మగుటకుబదులు, పురుషవేణువురూపమునఁ దోడ్పడి, మోహాంధులగు నీ తరుణీతరుణు లీవిధమున దేవేంద్రు నుచిత రీతి గౌరవించుచుందురు గాక! ఇఁక నారదుఁడు సైత మవజ్ఞఁ జేసెఁ గావున, తంత్రీనిస్వనము నొసంగు సంగీతవాద్యములలో నాతనివీణియ సాటిలేనిదను ఖ్యాతిని బాసి ప్రతిపక్షులకు భయపడుచుండుఁ గాక" అని శపించెను.

శాపానుసారముగా నూర్వశి పూర్వము మాధవియై పుహార్ నందుఁ బుట్టెను. పదునాఱవయేటనే యాపడుచు సంగీత నాట్యకళలందు సరిలేని దనిపించుకొనెను. అగస్త్యమహర్షి యాదేశము ననుసరించి ఇరువదెనిమిదిరోజులు మహేంద్రోత్సవమును జరిపినఁ దనరాజ్యమున క్షామాది యరిష్టములు కలుగవనియు, గ్రామశక్తి దేవేంద్రునిముదలతో ద్రోహులను గలుషాత్ములను బట్టి దండించుననియు, అప్పటి చోళరాజేంద్రుం డగు 'తోడితాడ్‌సంబియన్' తలంచి య ట్లొనరించెను. ఆ ప్రథమమహేంద్రోత్సవమునఁ బురుషవేణువురూప

మున నుండి జయంతుని వేత్రదండముగా ధరించి మాధ
నృత్య మొనరించెను. అప్పుడిరువురకు శాపమోక్షము కాఁగా,
ఇంద్రపురమగు నమరావతికిఁ బోయిరి. కాని యీ మాధవి
వంశీయులకు మాత్ర మనువత్సరము మహేంద్రోత్సవమున
నాట్య మొనరించు యాచారము నిలిచిపోయినది.

ఏడేండ్లప్రాయముననే తనపుత్రికకు సంగీతనాట్యముల
యం దసమాన ప్రావీణ్య మలవడియున్నదని చిత్రావతి గమనించి
నగరమం దఖండప్రజ్ఞావంతుఁడగు నుపాధ్యాయు నొకని నా
కాంతకు విద్యగఱుప నియమించెను. పదునాల్గేండ్లు నిండు
నప్పటికంతయు మాధవికిఁ గల విద్యాపటిమ నిరుపమాన
మయ్యెను. సంగీతనాట్యకళలందును, శృంగార లావణ్యము
లందును మాధవితో సమానులగు సుందరు లారాజ్యమున
నుచ్చునకైన లేకుండిరి. 'దేశి' 'మార్గి' యను రెండువిధములగు
నాట్యములం దావారనారికి సమానమగు ప్రావీణ్య మలవడి
యుండినది. నాట్యశాస్త్రమందును, వేషధారణాదికౌశలము
నందును ఆనెలఁత యప్రతిమురాలై యుండెను.

సంగీతనాట్యకళాభిమానియగు కోవలఁడు పలుమారు
చిత్రావతియింటికిఁ బోవుచుండువాఁడు కాన, మాధవిగాన
మును విని నాట్యమును గాంచుచుండెడివాఁడు. అట్టియెడ నా
యువకుఁ డాచంద్రముఖి సుకుమారరూపసంపదను జూచి
ముగ్ధుఁ డగుచుఁ దనపత్ని కన్నకి కా వెలయాలికివోలె గాన
విద్యగాని నాట్యకళగాని రాదుగదా యని చింతించుచుండు
వాఁడు. "ఆహా! చిత్తరంజకములగు నిట్టికళలు కులాంగనల
కనర్హములని తలంచు మనదేశాచారమున కేమనవలయు!

మాధవివోలె నాప్రేయసియైతము సంగీతనాట్యకళలతో శోభిల్లు చుండిన బంగారునకుఁ బరిమళమబ్బినట్లు వన్నెకెక్కి యుండె డిది గదా!" యని యాతఁడనుకొనుచుండును.

మాధవిపై నాతనికిఁ గల యభిమానము ముఖ్యముగ కేవలము కళోపాసనయే యనవలయును. కన్నకికూడ మాధవి చేయు నృత్యమును గాంచి సంగీతమును విని యానందింపవలయు నను నుత్సాహముతో నొకనాఁడు కోవలన్ మాధవిని దనయింటికిఁ గొనివచ్చెను. అతని కళాభిమాన మంతస్వచ్ఛమై యుండినది. ఆవేశ్యసౌందర్యము శృంగారలావణ్యములతో నతిశయించి, నటనాకౌశలముతో నభివర్ధిల్లుచుండెను. మొట్ట మొదటఁ జూచినప్పుడే, మాధవిమనస్సు కోవలన్‌పై లగ్న మైనది. నాఁడే యాచిగురుఁబోఁడి యాసుందరునిఁ దనవలలోఁ జిక్కించుకొనవలయునని నిశ్చయించెను. కోవలన్ కూడ మాధవిపైఁ బలుమారు పఱపు ప్రేమవిలోకనములయందుఁ దమ సంసారసౌఖ్యమునకుఁ గలుగనుండు నాపదను గన్నకి గ్రహింపఁ గలిగినది, కాని యామె కంతలో నమ్మకము కలిగి ధైర్యముఁ కలుగుచుండెడిది. "ఔనౌను. నాట్యకళయందు నావిభునకుఁ గల నిష్కళంకమగు ప్రేమ నా కిట్టి సందియములకుఁ గారణ మైనది. మాధవిపై నాభర్తకుఁగల యభిమానము ప్రమాద మును దెచ్చునని ఎవ్వరుగాని కలనైన భావించుటలేదు. నేను మాత్ర మట్లు సంశయింప వచ్చునా? నేను నాప్రాణేశ్వరునిఁ బరులకంటె ననుచితముగ విమర్శింప వచ్చునా?" అని యా మానవతి కుదుటఁ బడుచుండెడిది. అటులయ్యును నాసాధ్వీ మణి మానసవీథియం దాసందేహము చిందులుద్రొక్కుచు

నాట్యమును సాంతముగఁ జూచుట కామెకు విసుఁగు జనింపఁ జేసెను. మఱి యొక్క క్షణము కూర్చొనుటకుఁ గూడ నామెకు మనస్కరించలేదు. అభినయ మెప్పుడెప్పుడు ముగియునా యని యామూగుడ పరిభ్రమించుమానసమును గుదియఁబట్టి బడలిన శరీరమును నిలువఁబెట్టి యుండెను. నృత్యమైన వెంటనే యామెకు పెద్దబరువు దించినట్లయ్యెను. ఆమె యొకనిట్టూర్పు విడిచెను. కోవలన్ బహూకరించిన వెలలేని ముత్యాలహార మును బరిగ్రహించి మాధవియుఁ జిత్రావతియు నిజసదనము లకుఁ బోయిరి.

నయనోత్సవముగ నలంకరించియుండు పడుకటింటిలో నారేయి కోవలన్ కన్నకిలు జేరిరి. కన్నకి తనపతికిఁ జందన మలఁది కర్పూరతాంబూల మీయ దాని నాతఁ డన్యమానస మున స్వీకరించెను.

అది గాంచి కన్నకి "నాథుఁ డెద్దానినిగుఱించియో యాలోచించున ట్లున్నది?" అని హెచ్చరించెను.

"ఏమియు లేదు" అని కోవలన్ ప్రియకాంతను బిగిఁ గౌఁగిటఁ జేర్చుకొని చెక్కిలినొక్కి మందహాస మొనరించెను.

"మనకల ఫలవంతమైన నెంత బాగుండును!" అని కన్నకి పలికెను.

ఏకల?"

కన్నకినేత్రములు బాష్పపూరితము లయ్యెను. కోవ లన్‌కు కల జ్ఞప్తికి వచ్చెను. "నే నెంత మందమతిని. కాంతా! వగవకుము, ముద్దులుమూటగట్టు నాడుబిడ్డ నీకుఁ బుట్టినట్లు

నీవు కలగంటివి. ఇదియే కదా? అది యెన్నఁడో వచ్చిన కల గదా!" అని యాతఁ డామె ననునయించెను.

"కాదు కాదు. ఆకల నిన్ననో మొన్ననో వచ్చినట్లున్నది" అని కన్నకి ఖిన్నయై యనెను. అంత నామె తమ జీవయాత్రయం దీవిధమున జరిగిన భంగపాటును విస్మరించుటకు మనసారఁ బ్రయత్నింపనెంచి పతివక్షమున వ్రాలి "నాకు నీవు వినా మఱి గతిలేదు. తల్లి, తండ్రి, తోఁబుట్టువు, పతి, దైవము— అందఱును నాకు నీవే సుమా!" అని పలికెను. కోవలన్ కాపలుకు లమృతోపమానము లయ్యెను. అతని యానందము వెల్లివిరిసెను. అపతివ్రతాశిరోమణి నాతఁడు దగ్గఱకుఁ దీసికొని వక్షమున కదుముకొని, మోము మోమునఁ జేర్చి మోవి యానెను. నిర్మలములును, నిశ్చలానురాగ ప్రతిబింబితములును, విశ్వాసభావ సమ్మిశ్రితములు నగు నా యెలనాగ నయనములందుఁ జూడ్కి నిలిపి, బాష్పబిందుస్రావమునఁ జాఱలు కట్టిన చెక్కిళ్లను జూఱక్కున నాతఁడు ముద్దుపెట్టుకొనెను.

"నీవు విలపించుచున్నా వెందుకు?"

"ఆనందము పట్టలేక యేడ్చుచున్నాను."

"కాదు కాదు. నీకన్నీటి బిందువులు ఘోరముగ నున్నవి. కలికీ! ఇంతకుముందు సాయంకాలము జరిగిన నాట్యమును జూచి నేను పరధ్యానమున నిన్నుఁ దగురీతి యాదరింపనైతినేమో కదా! నన్నుఁ దప్పుఁ దలంపకుము. నాట్యమన్నను, సంగీతమన్నను నే నానందపరవశుఁడ నగుచుందును. వానిపైని యభిమానము నానెత్తురులోఁ గలిసి పాఱుచున్న దనవచ్చును.

ఇది నాలోపము; అపరాధము. ఆహా! నాకా యాదరాభిమానములే లేకుండిన నెంతయో బాగుండెడిది గదా!"

"అందు దోష మేమున్నది? నాకంత యసూయ లేదు. మీ యిష్టమువచ్చినట్లు మీరావారకాంత సంగీతనాట్యముల నానందింపుఁడు. మీరు సౌఖ్యపడవలయుననియే నా యభిలాష."

'ప్రేయసీ! నీయౌదార్య మనుపమానము; నీ ధర్మగుణము నిస్తులము. పవిత్రమగు నీప్రేమ కర్హుఁడనగుటకుఁ బ్రయత్నించెద"నని కోవలన్ మరల నాయింతిని బిగియార నాలింగన మొనరించు కొనెను. అప్పు డాకలికియు నాతని భుజములపైఁ జేతులు వేయుఁ నాదంపతుల యనురాగమును గొనియాడుచున్నవో యనఁ గన్నకి పాదనూపురములు కాళ్ల కదలికచే సందడి చేసెను. ఆసడి నాలకించి కోవలన్ "నీయందెలు మిగుల సొగసైనవి సుమా! అవి యమూల్యము లనుకొందు న"నెను.

"ఔను. మాతల్లి వానిని నాకిచ్చినది. అగస్త్యమహాముని శిష్యుఁడును, మహేంద్రోత్సవకర్తయు నగు తొడితోడ్ నంబియన్ ప్రభుశేఖరుఁడు వానిని మావంశమునకు బహూకరించెను. మూల్య మింతయని చెప్పరాని పచ్చ లామంజీరములలం దున్నవి. జగమునం దీయందియ లిట్టి వివియే యనియు దీనితో సరితూగు జత మఱియొకటి లేనే లేదనియు మాతల్లి యనుచుండెడిది."

"విశ్వమానవకోటియందుఁ గన్నకివి నీవొక్కతవే యనియు, మఱి నీకు సమానులు లేరనియుఁ గూడ నీతల్లి

యనుచుండెడిదా!" యని కోవలన్ హాస్యమాడి చెంప గిల్లి ముద్దుపెట్టుకొనెను. ఆయువకుఁ డాక్షణమునందే తానికఁ జిత్రావతి యింటివైపైనఁ బోఁగాదని కూడ నిశ్చయించుకొనెను. కన్నకి సౌందర్య సౌశీల్యాది త్యాగగుణము లాయువకు నట్టి నిర్ధారణమునకుఁ బురికొల్పినవి.

అట్లే కొన్ని మాసములవఱకుఁ గోవలన్ చిత్రావతి యింటిమొగమైనఁ జూచినపాపమునఁ బోలేదు. ఇంత యేల? చిత్రావతి కాపురముండు వీథినఁ గూడఁ బోవుట యాతఁడు మానెను. ఇట్లు కోవలన్ కన్నకిలు ప్రమోదవారాశియందు మునుకలు వేయుచుండిరి. వారి స్నేహబంధమునుండి తప్పించుకొని దినములు నెలలై దాటి యురుకుచుండెను. కన్నకి మానస కుహరమునం దెన్నఁడో జొచ్చిన సంశయాంధకారము పత్యనురాగ తేజమున విచ్చిపోయెను. మహాసత్వుఁడు నాతని పత్ని వీలు చిక్కినపుడెల్ల నా కాముకీ కాముకులచెంతఁ గాలము గడుపుచుండిరి. హైందవులకుఁ బరిచితములగు చక్రవాకములభంగి యొండొరుల నెడబాయని యా యువతీ యువకులకు వారు "ప్రేమవిహంగము" లని ముద్దుపేరు బెట్టి గేలిసేయుచుండెడివారు. ఎప్పుడెప్పుడు తమకు మనుమఁడో మనుమరాలో పుట్టునా, ఎప్పుడెప్పు డాబిడ్డ నింటికిఁ గొనిపోయి ముద్దుమురిపెములతోఁ బ్రొద్దుపుచ్చుదమా యని యా వృద్ధదంపతులు దినమొక యుగముగాఁ గాలము గడపుచుండిరి.

వినుఁడు. మహేంద్రోత్సవము సమీపించినది. రాజసభామందిరమునఁ బ్రభుసమక్షమున మాధవి తన నాట్యకళానైపుణ్యమును బ్రదర్శింపవలసియున్నది. పిదప పురుషవరేణ్యు నెవ్వనినైనఁ గామించి యాగణికకులధర్మమగు వేశ్యావృత్తి నవలంబింపవలయును. ఇది యాచారము. బాలురు, వృద్ధులు, స్త్రీలు, పురుషులు—నగరమం దెల్లరినోట నీమాటలే వినవచ్చుచుండినవి. కోవలన్ మిత్రులందఱు మాధవి యాటను జూడఁ బోవుచుండిరి. కేవలము శాసనముఁబంటి యాహ్వానము రాజుకడనుండి కోవలనుకుఁ గూడ వచ్చినది. కోవలన్ స్వతంత్రుఁడై యుండిన నాసభకుఁ బోకయే యుండెడివాఁడు. ఏలయన, మాధవిపైని మోహము నాతఁ డింతకాలముగా నదిమిపట్టియుండెనే గాని, ఒక్కసారిగా గెంటివేయఁ జాలకుండెను. కాన నామోహ మిప్పుడు మాధవి సందర్శనమున మిక్కుటపడక పోదు. సభ కాతఁడు పోక విధిలేదు. ఏమాత్ర మాతఁడు వెనుఁదీసినను; వ్యాఖ్యానముల కంతముండదు. నిజమారయ, మాధవిని జూడవలయునని యాతని కుబలాటము మెండుగాఁ గలదు. ఆకలువకంటి కిన్నెరగానమును విని, దివ్యమగు నభినయమును జూచి యానందింపవలయుననియు· నాతఁ డువ్వి

ఘ్లూరుచుండెను. పరస్పరవిరుద్ధములగు నీభావములు రూపొంది విజిగీషతో నాతని హృత్తలమునఁ బోరాడసాగెను. నిర్ధారణ కెటువచ్చుటకుఁ గాని, కన్నకి యుండియు సాయము లభించ లేదు. తన భర్త కోవలన్ సానిసభకుఁ బోయి సానందబంధురుఁడు కావలయుననియే యామానవతి యభిప్రాయము. మాధవిపైఁ దన పతికుండిన తాత్కాలిక భ్రాంతి యెన్నఁడో వదలిపోయెనని యామె నమ్మకము. ఈ యాఱుమాసములుగాఁ గోవల నామె కొసంగిన సంసారసౌఖ్య మామె సంశయమును దొలఁగించెను. "నాపతికి నాపైనుండు ప్రేమ నిరంతరము; నిష్కళంకము; హృదయపూర్వకము గదా! సానిదానికొఱ కాపవిత్రప్రేమజ్యోతి మినుకుమినుకుమనుచుఁ బోవునా?" అని యావిమలాంగి సమాధాన పడుచుండెడిది. పాపము! ఎంతటి యమాయికురాలు! లోనఁ బురుఁగులతో లుకలుకలాడుచుఁ, బైకిఁ బచ్చగా మినమిన లాడుచుఁ గంటి కింపానగూర్చు రసాలము నారమణి చూడలేదు కాఁబోలు! కోవలన్‌గూడఁ దనకు మాధవిపైఁగల మోహావేశ మెంత యణఁచుకొనినను సాధ్యము కాకున్నదని భార్యతోఁ జెప్పిన వాఁడు కాఁడు. విషయము లన్నింటిని విశదముగా వినిపించి తనపత్నియభిప్రాయము నెఱుంగుటకుఁ గోవలన్ సాహసింపఁ జాలక పోయెను.

కోవలన్ కిది పెద్దసంకట మయ్యెను. ఆతనికి మనశ్శాంతి దూరమైనది. ఆతని హృదయము కోఁతపడి రెండుగాఁ జీలినట్లుండెను. జ్యేష్ఠ శుద్ధ పూర్ణిమ శనివారము డాయుచున్నది. ఆనాఁడే మహేంద్రోత్సవ మారంభించును. నాఁడే మాధవి

స్నృత్యము. ఆదినము సమీపించుకొలఁది కోవలన్ మనస్సునఁ జేయి పెట్టి కలంచినట్లు కాసాగెను. "అయ్యో! దైవమా! నాదుర్విధి కేమందును? సుందరాంగియు, ప్రేమస్వరూపిణియు, త్యాగమూర్తియు నగు కన్నకిస్వరూపమున దివ్యభోగములు నా పాదాక్రాంతములై నిలిచియుండ, నేనో వానిఁ గాలఁదన్ని, మాధవిపై భ్రమఁ గొనియున్నాఁడను. బుద్ధిమాంద్యమును గలిగించునంత యాకర్షణగాని, విశుద్ధధర్మమును విస్మరింపఁ జేయునంత ఘనతగాని, నాట్యసంగీతములం దేమియున్నది? వీలుండిన నే నా నాట్యమునకుఁ బోకయే యుందును; కాని యది నాకెట్లు సాధ్యము? నాప్రేయసి కన్నకి న న్నాసభకుఁ బొమ్మని పలుమారు చెప్పుచున్నది. నాప్రాణమైనఁ బోయు దును గాని, కన్నకి కంటఁ దడిపెట్టినఁ జూడఁజాలను. అదియుఁ గాక, అదేమి చిత్రమో, మాధవి గానాభినయములఁ గాంచి నచో నేను వివశుఁడనై, ఆసుందరికి దాసుఁడ నౌచుందును. త్రాగుడువలని కష్టనష్టములు స్మారకముగా నుండునపుడు గ్రహించియుఁ, ద్రాగుఁబోతు సమయము చిక్కినపుడంతయు మఱిమఱి త్రాగువిధమున, కామాంధకారము కన్నులఁ గప్పు చున్నదని యెఱింగియు నొక్కమారు మాధవిని గాంచినంతనే, ఆయంగన యపాంగవిలోకములకు, మందహాసచంద్రికలకుఁ బ్రాకులాడుచు నాప్రాణముల నా సుందరాంగికి ధారవోయు చుందును గదా! ఆ కోమలాంగి యంగసౌష్ఠవము నామదికిఁ బిచ్చి పుట్టించుచుండును! ఇఁక నేనేమి చేయఁగల" నని కోవలన్ తలంచుచు శృంగారవనమునఁ బచా రొనరించుచుఁ బ్రొద్దుపుచ్చు చుండెను.

ఇట్లా వణిక్కుమారుఁడు కర్తవ్యము తోచక తికమక లాడుచుండ, కూటసాక్ష్య మిచ్చెనను నేరమునకు శిక్షగా రాజభటుఁ డొకమానవుని బల్లెమునఁ బొడిపించి చంపనుండు టను జూచెను. ఆ మనుజుని పడుచు పెండ్లము చంకబిడ్డతో విలపించుచుండెను. "అయ్యయ్యో! నా పెనిమిటి పోయిన నాకూనఁ గాపాడువా రెవ్వరు?" అని యాయంగన వాపోవు చుండెను. కోవలన్ మానసాకాశమున నొక భావము తళుకు క్కున మెఱసెను. కర్తవ్యమును గాంచుట కాతని కొక కిరణము జూపట్టెను. "నిర్భాగ్యుఁడగు నా మానవుని బదులు నన్నుఁ బట్టుకొని నీ యిచ్చవచ్చినట్లు చేయుమ"ని కోవలన్ వెంటనే రాజభటుని ముందు నిలిచెను.

రాజభటుఁ డందులకు విస్మయముతో "నీకుఁ బిచ్చి పట్టి నదా యేమి?" అని యడిగెను. శాంతితేజోబంధురవదనుఁ డును, అమూల్యాంబరవిలసితగాత్రుఁడు నగు కోవలన్‌ను రాజభటుఁడు గమనించి చూచి, ఆతఁడు కులీనుఁ డనియు, గౌరవనీయుఁ డనియు, స్వస్థచిత్తుఁ డనియు గ్రహించెను. వెంటనే యాతఁ డావైశ్యకులాలంకారునకు వందన మాచరించి "అయ్యా! నామాటలతో మిమ్మగౌరవించితిని; మన్నింపుడు. ఇంతవఱ కిట్టి త్యాగమును నేను గని వినియుండలేద"ని పలికెను.

"ఇందు విశేషము లేదు. నా త్యాగబుద్ధిని నీ వంగీక రింతువా?" యని కోవల నడిగెను.

"వల్ల కాదు. న్యాయస్థానములో రాజసమక్షమునఁ గల బొల్లిమాటలతో దొంగ సాక్ష్యమిచ్చుట తప్పు వేరు చేత

కాని మానవాధమునకు బదులు, రాజ్యమున కలంకార ప్రాయుఁడగు పౌరపుంగవుని తలఁ దునుముటయా ? చాల బాగుగ నున్నది ! ఆర్యా! తాము నన్నెట్టివాఁడని తలంచితిరో? పిచ్చివాఁడ ననుకొంటిరా ? ఓ మహాశయా ! నే నిరువదేండ్లు పలినవారికి మచ్చలేని కొలువుచేసి వారి మదికెక్కియున్నాను. మీ యౌదార్యము ప్రశంసనీయమే కాని, కార్యకారి మాత్రము గాదు. వీఁడు నా యధీనమునం దున్నాఁడ"ని రాజభటుఁడు కటికవానితో "ఓరీ ! వానిఁ బొడిచివేయుమ"ని యాజ్ఞ జేసెను. అదియే తడవుగా, కెవ్వుమను కేక విననయ్యెను. అంతలో నా కటికవాఁడు తనపనిఁ దీర్చుకొనెను.

అది గాంచి హతునిభార్య మూర్ఛిల్లెను. కోవల నామె కుపచారము లొనరించి తెలివిఁ గలిగించెను. అంత నాతఁడామెకు సుఖముగా బ్రతుకుమని నూఱు బంగారునాణెముల మూట నిచ్చెను. అంతియే గాదు; ఆకాశరామన్న పేరుతో నుఱి వేయినాణెములను గుప్తదానముగా నా యభాగిని కంపఁ దలంచి, కోవల నామె చిరునామా నడిగి తెలుసుకొనెను. దానకర్ణునిఁ దలపించు నా మహామహుని ధర్మగుణమున కామెలనాగ కన్నులు కాలువలుగట్ట బావురుమని యేడ్చుచు "ఆఁకలి దప్పులనుండి నా చంటిబిడ్డను గాపాడితిరి. మీ పుణ్యము మూర్తీభవించినట్లు మీకుఁ బుత్రరత్న మనుగ్రహింపఁ బడును గాక" అని సంతోషసంతాపములు ముప్పిరిగొనఁ బలికెను. రాజభటున కిదియంతయుఁ జిత్రముగా నుండెను.

"మహాశయా! ఇంతకును నాధర్మమును నెఱవేర్చి, నందులకు నాకు బహుమాన మేది?" అని యాతఁ డడిగెను.

"ఈనాటి కిఁక లేద"ని కోవల నవెను.

"ఆర్యా! నాకును జంటిబిడ్డ యున్నది. నేనును భాగ్యవంతుఁడఁ గాను."

"అయిన నిదిగో నీబిడ్డకు వీని నిమ్మ"ని కోవలఁ పది బంగారునాణెముల నిచ్చెను.

ఆరాజభటుని వదనము విస్మయానందముల కాలవాల మయ్యెను. "ఈలోకము నేను దలంచినంత దూష్యమైనది గాదు. కాని, ఒక్కవిషయము; సశరీరముగ స్వర్గమునకుఁబోవు పురుషోత్తములలో మీరు నొకరు. పుణ్యప్రదమగు మీపేరు లోకులకుఁ జిరస్మరణీయ మగుఁగాక" అని రాజసేవకుఁ డాతని దీవించెను.

మహేంద్రోత్సవము పెక్కువేడుకలతో మొదలిడెను. సంబరమును జూచి సంతోషింపవచ్చినప్రజలతో వీథులన్నియు నిండిపోయెను. మాధవి యభినయింపనుండు సభామందిరము కడ నిసుకవైచినను రాలనంతగా జనులు క్రిక్కిరిసి యుండిరి. నాట్యరంగము కనులఁబండువై యుండెను. ఆరంగమునకు రెండుద్వారము లున్నవి. అద్దములవంటి నున్నని కొయ్యపలకలతో విశాలమగు వేదిక యమర్పంబడి యుండెను. ప్రతిమలు కొన్ని రంగముపైఁ బూజకును, ఉత్సాహవర్ధనము కొఱకు నెలకొల్పఁబడి యుండెను. ఉన్నతములగు స్తంభముల

నీడ నాట్యస్థలముమీఁదఁ బడకుండునట్లుగా నమర్పఁబడి యుండు దీపకళికలు రంగమును బ్రకాశమాన మొనరించు చుండెను. ఆవేదికపైని చాందిని మనోహరముగఁ జిత్రింపఁబడి యుండెను.

కారికాళచోళరాజేంద్రుఁ డార్యావర్తమున నొకనర నాథు నోడించితెచ్చిన ధవళఛత్రప్రకాండరాజము జయంత రూపమున నుండు వేత్రముగా నాటిమాధవి నాట్యముకొఱకు నిర్ణయింపఁబడెను. ఆదండము స్వచ్ఛమగు జాంబూనదముతోఁ గప్పఁబడినది. దానిగణుపులయందు రత్నములు తాపియున్నవి. నాటియుదయ మద్దానిని మాధవి రాజనగరుకుఁ గొనిపోయి బంగారుపాత్రముతో గంగాతీర్థమున మంగళస్నానము చేయించి పవిత్ర మొనరించి పూలమాలలచే నలంకరించి పూజించెను. అంత నావేణుదండమును మాధవి విప్రులకం దీయ, వారద్దాని నాశీర్వదించి భద్రదంతావళముపైఁ బ్రతి ష్ఠించిరి. సముచితాలంకారసంశోభితమైయుండు నాగజరాజము ఫాలభాగమున స్వర్ణపట్టిక తళతళ లాడుచుండెను. ఆనాటి మహోత్సవమునం దామత్తేభము రథమును లాగవలసి యున్నది. మహారాజును ఆతని మంత్రివర్గపంచకమును, వివిధ సంగీతనిస్వనములు బోరుచెలంగ, జయదుందుభీనినాదములు దిక్కులుపిక్కటిల్ల, వారణముతోడి రథమునకుఁ బ్రదక్షిణించి, ఆవేణుదండమును గైకొని రథస్థులగు రాజస్థానగాయకున కును, కవీశ్వరునకు నందిచ్చిరి. అంత నగరమంతయు రథోత్స వము కరిరాజుతోడఁ జరిగినది. జనులంద ఱత్యుత్సాహమున గుంపులుగట్టి యుత్సవమునందుఁ బాల్గొనిరి. కడకు రథము

నృత్యసభామండపముకడ నాగినది. అంతతోనుత్సవముపూర్తి యైనది. అప్పుడు వేత్రము సర్ణితస్థలమునఁ బ్రతిష్ఠింపఁబడినది.

నానావిధములగు సంగీతవాద్యములతో గాయకులు సముచితాసనములం దుపవిష్టులై యుండిరి. చీనిచీనాంబరమును ధరించి, కనులకు మిఱుమిట్లుగొలుపు నగలఁబెట్టుకొని, దివ్యాంగనవోలె మాధవి శుభస్కారముగ దక్షిణపాదమును సభాస్థలి యందు మోపి, పూర్వాచారము ననుసరించి కుడివైపునఁగల స్తంభము ప్రక్కకుఁ బోయి నిలువఁబడెను. ఆమె వెంటవచ్చిన మఱియితరులును సనాతనసంప్రదాయము ప్రకారము వామ భాగమునఁ గల స్తంభముకడ నిలువఁబడిరి. అంత 'పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతాం' మొదలగు ప్రార్థనలు జరిగెను. అప్పుడు వాద్యములన్నియు మ్రోగినవి. వీణె,మురళి, మృదంగము, ఘటము—వీని నాదములు పరస్పరానుగుణ్యముగ మేళవించి శ్రవణోత్సవము జేయసాగెను. పవిత్రమగు నొకానొక కీర్తనయందలి చరణముల నాల్గింటిని బాడుచు తదుచితముగ మాధవి 'దేశి' నాట్యము చేసెను. పిమ్మట 'ఆర్య' నృత్య మొనరించెను.

అభినయమప్పుడు చకచకలాడు మాధవిశరీరము మెఱుపుఁదీగెను మదికిఁ దెచ్చుచుండెను. ఆమెనృత్యము శాస్త్ర సమ్మతమై, జగన్మోహనమై: కళా ప్రపూర్ణమై యుండెను. చోళ రాజేంద్రుఁ డమందానందుఁడై పూర్వాచారము ననుసరించి మాధవికి వేపాకుమాల వేసి, వేయిన్నెనిమిది బంగారునాణె ములు బహూకరించి, పరివారసమేతముగా నంతఃపురము నకుఁ బోయెను.

మాధవియు, చిత్రావతి వసంతమాల తన్ను వెంబడింప స్వగృహమునకుఁ బోయెను. ఇప్పు డావెలయాలు కులవృత్తి ననుసరించుట కెట్టి యాటంకము లేదు. కావున నాతో యవ్యాలి కూనిదాసి చెల్లమ్‌చేతి కొకపూలమాల నొసంగి "ఓసీ! నా సౌధము ముందు నిలిచి, మార్గమున వచ్చుచుఁ బోవుచుండు వణిక్కుమారులను, భూస్వాములను, లక్ష్మీపుత్రులను గూర్చి యీవిధమునఁ బ్రకటింపుము: 'వేయిన్నెనిమిది బంగారు రూకల నిచ్చి యీపుష్పహారమును విలుచుకొనుఁడు. ఈ కుసుమమాలికను గొనిన పురుషుఁడు మాధవికిఁ బ్రియుఁడగు యోగ్యత నందును.' అని చెప్పెను.

అందులకు వసంతమాల కండ్లు త్రిప్పుచు "ఈ మాల మునఁ గోవలన్ నీవలలోఁ బడుననుకొందువా?" అని మాధవి నడిగెను.

"నా కట్టియాశ లేకపోలేదు సుమా" అని మాధవి యనెను.

అది విని చిత్రావతి "చెల్లమ్ చాటించవలయునే గాని ఒక్కగంతులోఁ గోవలన్ మనయింటికి రాఁడా!" అని పలికెను.

వీథిలోనికిఁ బోయి చెల్లమ్ చాటించెను. నాటి మాధవి నాట్యమును కోవలన్ చేష్టలుడిగి శ్రద్ధమెయిఁ జూచెను. అభినయనమును బురస్కరించుకొని మాధవి యాతనిపైఁ బఱపిన వాలుచూపులచేతను, లేనగవులచేతను, కోవలున కాగణికపై

నొకప్పుడుండిన మోహము మొనలెత్తి వేయింత లధిక-
మయ్యెను. ప్రణయాకాశమునం దాయువకుఁడు పల్లటీలు
వేయసాగెను. పర్యవసాన మేమైన నగుఁగాక: మాధవికి విటుఁ
డుగా నుండవలయునని యాతఁ డెన్నఁడో నిశ్చయించుకొని
యేయుండెను. కాని నాతఁడు చెల్లమ్‌చాటింపును వినుటయే
తడవుగా నా మొకడకుఁ బరుగిడి పుష్పహారమును లాగుకొనెను.
అంత నాగూనిదాసి మొగమంతయుఁ గన్నులు జేసికొని
కృతార్థురాలైనందులకు ముదమందుచు, కోవలన్ను విలాస
భాసురమగు మాధవిశయ్యాగారమునకుఁ దోడ్కొని చనెను.

అప్పుడు మాధవి సామాన్యాలంకారముతోఁ బుష్ప
సంశోభితమగు మృదుతల్పమున నొరిగి పండుకొని యుండెను.
ఆచక్రస్తని కట్టుకొనియుండు నాచుపట్టుపుట్ట మామె యం
గసౌష్ఠవమును బ్రత్యక్షముగఁ గన్పడఁజేయుచు, నాకర్ష
ణీయగాఁ జేయుచుండెను. పుహార్ నకుఁ బెట్టనిభూషణమగు
కోవలన్—సుకుమార సుందరాకారుఁడును, రసికావతంసుఁ
డును నగు కోవలన్—తన ప్రేమభిక్ష నాకాంక్షించి వచ్చు
టను గాంచి, ఆవారనారీశిరోమణికి నేత్రోత్సవ మయ్యెను.
ఆమె లేచి యాతని నాహ్వానించి చిఱునగవునఁ గంఠమున
బుష్పహార ముంచెను. మోహమును బట్టఁజాలక యాతనిఁ
గౌఁగిటఁ గ్రుచ్చుకొనెను. అనురాగభాజనమగు నాపరిరంభణ
భాగ్యమున కాయువకుఁడు దివ్యానందపరవశుఁడై దేవేంద్ర
పదవి లభించినట్లు తృప్తినందెను. ఇఁక నిల్లెందుకు? వాకిలి

యెందులకు? తానే గతియనియుండిన భార్య యెందులకు? వారిజోలి మాని కలకాల మిఁకమీఁద మాధవివద్ద నుండవలయునని కోవలుఁడా నిర్ధారించుకొనెను. మఱునాటి యుదయమాతఁడు సొంతయింటికిఁ బోలేదు. ధాన్యపువర్తకులవీథిలో నాతని కొకయిల్లు కలదు. ఆతఁడాయింటియందు నివసింపసాగెను. నాటిసుత కోవలుఁనకు మాధవి తప్ప మఱి లోకమే లేదు. నిద్రలో, నడకలో, తినుచు, త్రాగుచు—సర్వకాల సర్వావస్థల నాతనికి మాధవిస్మరణ తప్ప మఱి వేరు లేదు. ఆతఁడు భార్యను, వ్యాపారమును, జననీజనకులను—అందఱను అన్నింటిని వదలి, కాలమంతయు మాధవితోఁ గడపుచుండెను.

# నాలుగవ ప్రకరణము

## మణిమేఖల జననము

కోవలన్ మాధవిజతకూడిన మూడుమాసములకంతయు నా వెలయాలు చూలాలయ్యెను. తమ ప్రేమవల్లరి పుష్పించి ఫలవంతముగా నున్నదని తలంచినపుడంతయు నా యువతీ యువకు లమందానంద సంభరితు లగుచుండిరి. కాని, చిత్రావతిమాత్ర మందులకు సంతోష మెట్టిదో యెఱుంగదు. 'ఈ యీడునకే యింతలో మాధవి బిడ్డతల్లి కావలసినంత యవసర మేమి వచ్చినది?' అని యామె యనుచుండెను.

మాధవి పరిచారిక యగు వసంతమాలతోఁ జిత్రావతి "కాన్పు తరువాత, మాధవి యంగలావణ్యము నిలిచియుండదు. తల్లిసోయగమునకుఁ గాన్పు గొడ్డలిపెట్టువంటిదిసుమా!" అనెను.

వసంతమాల:—నిజమే. మన మిపు డేమిచేయఁ గలము? ఆమె గర్భముతో నున్నది కదా! మన మామెను మిగుల శ్రద్ధతోఁ జూచుచుంటిమేని, ప్రసవానంతరము యథాప్రకారము మన మాధవి పోఁడిమిని గోల్పోవక యుత్సాహముతో నుండఁగలదు. ఇట్లు చేసినచో నిది యొకకష్టముగా మనకుఁ దోఁచదు.

చిత్రావతి:—అట్లే చేయుదము. మాధవి పుట్టినపిమ్మట నా యనుభవమునుబట్టి నేనిట్లనుచున్నాను. ముందువోతె

వెనుక కూడ నేనంత చక్కఁగా నాట్యమొనరింపఁ గలిగి యుంటినా ?

వసంత:—అట్లంటివే గాని, మాధవి పుట్టుటకును, పుట్టి నిన్ను సైతము నాట్యకళయందు మీఱు భాగ్యము నీకుఁ గలుగుటకుఁగాని కారణము నీ కాన్పే కదా ! కౌశికుఁ డను మాటలు నీకుఁ దెలియునా ? వినుము. "ఒక విధముగా నమరత్వమును మానవులమయ్యును మనము బడయుదుము. ఆ యమరత్వము సహజమైనది; శాస్త్రవిహిత మైనది; శోభావంత మైనది. నిరంతముగ జీవయాత్ర సాగునట్లు, ఒకతరమువారు రానుండుతరమువారికి తమ జీవజ్యోతి నందిచ్చుటయే అమరత్వ మగును. ఇది సత్యము. మిగిలిన భావములన్నియు విశ్వసనీయములు గావు; ఆచరణయోగ్యములు గావు." అని కౌశికుఁ డనుచుండును.

చిత్రా:—ఉండవచ్చుఁ గాక ! 'నిరుపమానమగు నా నాట్యకళానిర్మూలనమునకు నీవే కారణుఁడవ'ని నే నాతని నిందించితిని. అందుచే నాతఁ డిట్లనినాఁ డనుకొందును. ఆతఁడు యోచించి యోచించి యీ యభిప్రాయమును వెళ్లబెట్టి యుండును. ఏ గాలి కాచాప నెత్తుటలోఁ గౌశికుఁ డందె వేసిన చేయి. తనపనిని చక్కపెట్టుకొనుటకుఁ గాని, తన చెడునడవడి యొప్పియుండుటకుఁ గాని, ఆతఁ డొనరించు వాదనలు వింతగా నుండును. చూడు : అనుకొనుచుండగనే ఆతఁడును వచ్చుచున్నాఁడు. వేకటితో నుండుమాధవి యాహారవిహారములనుగూర్చి యాతని నడిగి తెలుసుకొందము. పాఁతకాలపు

మనిషి కదా! కావలసినంత తెలివి బూజుపట్టి యీ బాపని బుఱ్ఱయందుఁ బడియున్నది.

అంతలోఁ గౌశికుఁడు లోనికివచ్చెను. అతఁడు బ్రాహ్మణుఁడు; వయస్సు నలుబదియైదేండ్లుండును. మొగము విలక్షణమైనది. తలవెండ్రుకలు తెల్లఁబడియే యున్నవిగాని తనతెలివికిని పదవికిని నాతఁడు చేతనైనంతవఱకుఁ బ్రాఁకులాడుచున్నాఁడని మాత్ర మాతనివేషమును జూడ నర్థమగుచుండును. అప్పుడే నోటినిండఁ దాంబూలము వేసికొనె నని, కుంకుమ యెరుపుతో నుండు నాతని పెదవులు చాటుచుండెను.

వసంతమాల యాతని కెదురేగి "ఏమండోయ్! కౌశికులుగారూ! తములమును జిత్రావతి తెచ్చి యీయదా? ఏమంత మునిఁగినదని, అప్పుడే వేసికొంటిర?"ని హేళనగాఁ బలికెను.

కౌశికుఁ డందులకుఁ బెద్దగా నవ్వుచు "మరల నింకొక తాంబూలమున కెట్టి యభ్యంతరము లేదు. సరి; మాధవి కుశలమే కదా?" అని యడిగెను.

ఆమాటనందుకొని చిత్రావతి చేతులు త్రిప్పుచు "ఎంత కిరాతకుఁడే, వసంతమాలా, యీబ్రాహ్మణుఁడు! ఔనౌను! నే నేమేటఁబడిన నాతని కేక నెందుకు లెమ్ము! నాయోగక్షేమములతో నాతని కేకఁ బని యెందుకు లెమ్ము! స్త్రీలకు వయస్సు వచ్చినపిమ్మట, చీకివేసిన టెంకెను బారవేయునట్లు, పురుషులు దగ్గఱకుఁ గూడ రానీయరు సుమా! సరిగదా, మనమొగము గూడఁ జూడర"ని నిష్ఠురోక్తు లాడెను.

కౌశికుఁ డడ్డముగఁ దలఁ ద్రిప్పుచు "కాదు. కాదు. అట్లెన్నటి కనకుము నీవు నాయెట్టయెదుట నున్నావు. కాబట్టి నీ క్షేమము దెలిసియే యున్నది. కాని మన అమ్మాయి మాధవి నాయెదుట లేదు కనుక, ఆమె కుశల మడిగితి న"ని మాటలఁ దేలఁ గొట్టెను.

వసంతమాల హాస్యపూర్వకముగ నవ్వుచు "అబద్ధము కాడకుము. పైపైన మమ్ముఁ జూచినంతనే మేము లోలోన నెట్లు బాధపడుచున్నామో నీవెట్లు గ్రహింపఁ గలవు?" అని మేలమాడెను.

కౌశి:—జీర్ణించియుండు వ్యాధులన్నియు ముఖమునఁ గన్పడుచుండవా?

వసంత:—అట్లు కాదు. నీళ్ళలో మొసళ్ళవలె నక్కియుండు రోగములు కూడ నున్నవి.

కౌశి:—అట్టిరోగములు చిత్రావతికి లేవు. ఇరువదేండ్లుగా నాకుఁ జిత్రావతితోఁ బరిచయము అనుభవము కలదు. అంత మాత్రము నాకుఁ దెలియదా?

"ఎట్టులో యొకట్టుల నాతఁడు తప్పించుకొనునని నాకు ముందే తెలియును" అని చిత్రావతి కౌశికునివైపు తిరిగి "చూడండీ! ఇప్పుడు మీతో ముఖ్యమగువిషయమునుగూర్చి మాట్లాడవలసి యున్నది. మాధవి కాపురము చేయుచున్నదని మీకుఁ దెలియును గదా!" అనెను.

అందులకుఁ గౌశికుఁ డత్యుత్సాహమున "అనియే తలంచి తిని. పోయినమారు నేనా మెరూపమునందు మార్పును గమ

నించితిని. ఆమె చూలాలను సూచనలు నాకుఁ దోఁచినవ"ని పలికెను.

చిత్రా:—నీకూ నీయూహాలకు సరిపోయినది.

కౌశి:—నిజముగా మన మాధవి సంసారసౌఖ్య మనుభవించుచున్నదని నేను నిర్ధారించుకొంటిని. వేకటితో నుండు నప్పుడు శరీరమునఁ గలుగుమార్పులు నీకుఁ దెలియవా యేమి?

చిత్రా:—మీాకంటె మాకే బాగుగాఁ దెలియును. వినికిడివలని జ్ఞానముతో నేకాలమందో యెవరో వ్రాసిన తాటాకు గ్రంథము లిప్పుడు చెదలు పట్టినవానిఁ జదివి చెప్పు మీావంటి పండితమ్మన్యులవలెఁ గాక, మేము స్వానుభవముఁ గలిగియుండువారము సుమా!

కౌశి:—నిజమారయ, మాజ్ఞాన మంత చొకమైనది గాదు. రోగమును గుఱించి రోగికంటె వైద్యునకే కదా యెక్కువ తెలియును.

చిత్రా:—అయినఁ గడుపుతో నుండుట రోగమని నీవు హేళనఁ జేయుచున్నా వన్నమాట!

కౌశి:—కాదు కాదు. ఉదాహరణమున కట్లంటిని. అది రోగము కాదు; పైగా నది యారోగ్యసూచకము కూడ. చూలాలు చక్కఁగాఁ దన యారోగ్యమును గాపాడుకొనుచుండినచో, ఆహార పానీయములవలె, కాన్పు నైత మొక సామాన్యకార్యమై యపాయమనుమాట యుండదు.

చిత్రా:—అసలు సంగతి కిప్పుడు వచ్చితిమి. ఉత్సాహముగా నుండుటకును, నిరపాయముగాఁ బ్రసవించుటకును నామె యెట్లు నడచుకోవలెను?

కాశి:—కించిన్మాత్రమైన నామెకు మనోవ్యాకులము కలుగరాదు. ప్రతిదినము రెండులోటాలు పాలు, నాలుగు లోటాలు మంచినీళ్లు త్రాగుచుండవలెను.

వసంత:—అన్ని మంచినీళ్లెందుకు ?

కాశి:—ఆమెకు, ఆమె బిడ్డకు.

వసంత:—బిడ్డకా ? అదేమయ్యా ! రెండునెలలనుండి యే గదా............

అంతలోఁ గాశికుఁ డడ్డుతగిలి "ఔను. ఇప్పటికే బిడ్డ నా బొటనవ్రేలి ప్రమాణమున నుండును. అంగములన్నియు వ్రేళ్లుసహా మొలిచియుండును" అనెను.

"ఆలాగా ?" అని యతివ లిరువు రాశ్చర్యమొందిరి.

కాశి:—దాని విషయ మట్టిది. కనిపెంచు స్త్రీలకు మీకుఁ గూడఁ దెలియని సంగతులలో నిది యొకటి.

వసంత:—అయిన నంత చిన్నబిడ్డ యాహారము నెట్లు తినఁగలదు ?

కాశి:—భగవంతుఁ డద్దాని కట్టిశక్తి నిచ్చియున్నాఁడు. పుట్టినపిమ్మట బొడ్డుపేగును గోయుదురని మీ రెఱుంగుదురు కదా ! ఆనాళమే తల్లికిని బిడ్డకును గల సంబంధము. అది బిడ్డ సత్తువకు వలసినంత యాహారమును గాలిని యిచ్చి, మిగులగాఁ దల్లికి విడుచుచుండును.

" ఎంత చిత్రము !" అని వారు ముక్కుపై వ్రేలిడుకొనిరి.

కౌశి:—ఇంతకన్న మిన్నయగు చిత్రము వినుఁడు. ఆఱవనెల వచ్చువఱకుఁ గడుపులోనిపిండము కదలదు; మెద లదు. కాని పెరుఁగ మొదలిడిన క్షణమునుండి సక్రమముగ నాహారమును దినుచు, గాలిని బీల్చుచు, నీరు త్రాగుచుండును.

వసంత:—ఆఁడుబిడ్డయా లేక మగబిడ్డయా యని మనము ముందుగనే చెప్పఁగలమా ?

కౌశి:—ఆహా!...పుట్టినపిమ్మట నిరాఘాటముగఁ జెప్ప వచ్చును.

అందులకు వారు నవ్విరి.

వసంత:—కాని, జ్యోతిషులు కొందఱు ముందుగనే చెప్పుదురు. అదెట్లు సాధ్యము ?

కౌశి:—నూటికి నూఱుపా ళ్లూహించి పాచిక వేయు దురు. ఒకప్పు డొక జోస్యుఁడు రెండుచీట్లపై 'మగబిడ్డ' 'ఆఁడుబిడ్డ' అని వ్రాసి ఆరెంటిని ద్వారబంధముపై రెండు వైపుల నుంచి, మగబిడ్డ పుట్టినతరువాత 'మగబిడ్డ' చీటినిదీసి, తా నొకఘనుఁడు వోలె నటించుచు, ఆచీటి నచట మూగిన వారికిఁ జూపి వారిమెప్పు లందెను. మొదట నాతనియుక్తిని నేను గ్రహింపక, నేనావిద్యను నేర్చుకొన నెంచి వానినడుగగా 'రెండు చీట్లయుక్తి'ని నాకుఁ దెలియఁ జెప్పెను. అందొక యిబ్బంది యున్నది; లేకున్న నేనావిద్య నభ్యసించి యుండెడి వాఁడను. కాన్పగునంతవఱకు నోపికతో నుండక, వేకటితో నుండునపుడే చెప్పవలయునని చాలమంది కోరుచుందురు. నిజ మౌనా కాదా ?

వసంత:—ఇష్టమున్న బిడ్డను బుట్టింపనగునని నీవందువా ?

కౌశి:—ఆహా! అట్లు పుట్టించుటకు దైవమునకు మాత్రము సాధ్యము. మానవునిచేతఁ గాదు.

చిత్రా:—మాధవి కేబిడ్డ పుట్టునో నీవు చెప్పఁ గలవా?

కౌశి:—ఆఁడుబిడ్డ పుట్టును......ఏలయన మాధవి పటుతరస్వభావము గలది కనుక.

వసంత:—కాబట్టి, నీస్వభావముకంటెఁ జిత్రావతిస్వభావము పటుతరమైనదని నీవు సమ్మతింతు వన్నమాట!

కౌశి:—అందుకు సందియమేమి? నాస్వభావమే పటుతరమైయుండిన నేనిక్కడికి రాకయే యుండి రెండవపెండ్లి చేసికొని సంసారపక్షములో నుండియుందును గదా!

చిత్రా:—నన్నుఁ జాల గొప్పగా శ్లాఘుంచుచున్నావు!

కౌశి:—శ్లాఘనలఁ గాంక్షించువయస్సు మనకిరువురకుఁ జెల్లినది. నిజమును నిస్సంశయముగా మాట్లాడుట కెట్టి యభ్యంతరము లేదు.

చిత్రా:—సరి. మాధవికి విహితాహార మేదియో కొంచెము జెప్పుము.

కౌశి:—కావలసినన్ని కాయగూరలు, పండ్లు తినవలెను. మద్యమాంసముల వాసననైనఁ జూడరాదు.

చిత్రా:—ఇట్టి కఠినపథ్యము నే పూర్వము నాకును జెప్పియుంటివి.

కౌశి:—మఱి, నీకాన్పెంత సుళువుగానుండినదో, ఎంత చక్కనిచుక్కను గంటివో నీకే తెలియుఁ గదా?

చిత్రా:—కాని, నా యభినయకళమాత్రము రమణీయతను గాన్పువెనుకఁ గోల్పోయినది.

కౌశి:—అది నీభ్రమ. మాధవి నృత్యము చేయునాఁటి వఱకెవ్వరు నీనాట్యరామణీయకత తగ్గినదని గమనింపలేదు. కాబట్టి నీయాట మాధవియాటతోఁ దరతమభేదమొంది తగ్గినది.

చిత్రా:—మాధవి హితచర్య నింకను జెప్పుఁడు.

కౌశి:—అఱవమాసము పెట్టినపిదప నామె, నీతోఁ గూడ నిద్రింపవలెను. కోవల నామెతో సంప్రతించునట్లు మాత్ర ముండవలెను.

చిత్రా:—ఇది కొంచెము కష్టముమీఁది పని. కాని యెట్లో యొకట్లు సరిచేసెదను. అది యటుండనీ! ఈసలహా క్రొత్తది, దీని ననుసరింపుమని నాకు నీవప్పుడు చెప్పలేదు; జ్ఞాపక మున్నదా?

కౌశి:—నీమాట కర్థము లేదు. వైద్యులు రోగుల కిచ్చు చేదుమందును ముందుగాఁ దాము పుచ్చుకొనరు గనుక మందే మంచిది కాదందువా?

చిత్రా:—ఎంత జిత్తులమారివయ్యా!...సరి, నీమాట లైనవా?

"ఒక్క సూక్ష్మరహస్యము. చెవిలోఁ జెప్పవలెను" అని కౌశికుఁడు చిత్రావతి నావలకుఁ గొనిపోయి యావారనారి చెవిలో "ప్రసవానంతరము, తల్లి బిడ్డ సౌఖ్యముగా జీవ

మున్నంతకాలము బ్రదుకవలసి యున్నది కదా! కాఁబట్టి తగు నంతయాస్తిని వారికిఁ గోవల నిచ్చునట్లు చూడుము. ఇది మాత్రము మఱువకుము. తెలియునా? ఒక్క కానుపైనపిదప తల్లిపైఁ బురుషునకుండు మోహము మాయమగుటయు, మఱి నూతనకాంతల వెంటఁబడి పోవుటయు మనము చూచుసంగతులే కదా" అని చెప్పెను.

చిత్రా:—ఆలాగే. నిజములో నిప్పటికే నాందీప్రస్తావములు జరిగించియే యున్నాను. నాకాభయ మంతగా లేదు. నా కానుపుపిమ్మట నీవు నన్ను విడిచి వేఱొక వనితను గామించితివా? లేదు గదా! ఆలాగే కోవలుఁడు కూడ మాధవిని విడువఁడు. ఆ సందియము నీకు వలదు.

కౌశి:—విషయ మది కాదు. నేను కోవల నంత భాగ్యవంతుఁడఁ గాను; నాకొఱ కంగలార్చు కామిను లంతకుమున్నే లేరు.

చిత్రా:—ఓహో! నీకై నీవే నీప్రతిష్ఠను తగ్గించుకొనుచున్నావు!

కౌశి:—ఆత్మస్తుతి నాకు గిట్టదు.

అంత వా రిరువురు వసంతమాటలను గలుసుకొనిరి. వారి నామె గాంచి "తల్లిదండ్రులనుండి శిశువు కేది సంక్రమించును?" అని యడిగెను.

కౌశి:—తల్లివలన మైకాంతిని రుధిరమాంసములను, తండ్రివలన నెముకలు నరములు బడయును. మాధవి శరీరకాంతివలన నీకిది తెలిసియుండును!

వసంత:—కడుపుతో నుండునప్పు డేమేమి యో చిత్ర విచిత్రములగుఁ గోర్కె లుదయించుచుండుఁ గదా! వాని సంగతి యేమి?

కౌశి:—చిత్రములగు నభిలాషలు, చంచలములగు నభ్యాసములు గర్భిణులకుఁ గలుగుమాట వాస్తవమే. కొందఱు పచ్చిబియ్యము తిందురు; కొందఱికిఁ గసుగాయలు కావలయును. మఱికొందఱు తమభర్త లెల్లకాలము తమ దండ నుండ వాంఛింతురు. అసంతృప్తి తల్లికి బిడ్డకు చెడుపుఁ గలిగించును; కాఁబట్టి వీలైనంతవఱకు నట్టికోరికల నెఱవేర్చుట క్షేమంకరము.

అప్పు డచటికి మాధవి వచ్చి "ఏమి మాట్లాడు చున్నారు?" అని నిలువఁబడెను.

కౌశి:—నీవు వినుచుంటివని మాకుఁ దెలియదు.

మాధవి:—మాతల్లి నావెంటఁ దీసికొనిపోయి చెవి యం దూదినసంగతిఁ దప్ప, మిగిలినదంతయు ముక్కకు ముక్క వింటిని.

చిత్రా:—అయిన నా కార్యము సగము కలిసి వచ్చిన ట్లయినది.

మాధవి:—నీవన్నట్లు కడుపులోని కసుఁగందు అంగుష్ఠ మాత్రమై యుండియుఁ గదలకుండునా?

కౌశి:—అందుకు సందేహ మేమి?

మాధవి:—ఇది యొక వింత!

కౌశి:—మహామునీంద్రులకుఁ గూడ నిది యాశ్చర్యమై యుండినందున, మానవదేహమునం దంతర్హితుఁడై నిశ్చలుఁడై యుండు పరమాత్మస్వరూప మంగుష్ఠమాత్ర ప్రమాణమని వారు నిర్ణయించిరి.

చిత్రా:—పరబ్రహ్మ మంగుష్ఠమాత్రుఁడని నీవు పలుమారు పాడుచుందువు. ఆకీర్తనలో నీభావ మున్నది.

కౌశి:—మఱి నామాట యబద్ధము కాదు గదా!

అంత నాతఁడు తన యుపదేశమును బ్రత్యక్షర మవలంబించునట్లు మాధవిచే బాసచేయించి "అమ్మాయీ! మనబిడ్డల యోగక్షేమముకొఱకుఁ గొంత వయసువచ్చిన తరువాత మనము మన కోరికలను గ్రమక్రమముగాఁ దగ్గించుకొనుచుండవలెను సుమా!" అని బోధించి యవసరకార్యముపై వెడలిపోయెను.

నాటిరాత్రియే మాధవి తన కానాఁడు కౌశికుఁడు చెప్పిన విషయము లన్నింటిని గోవలనకు వినిపించెను. తన కడుపులోని నిసుఁగు బొటనవ్రేలంత యున్నదనియు, ఇప్పటికే వలయు నాహారమును, నీటిని, గాలిని బుచ్చుకొనుచున్నదనియును జెప్పెను. కోవలన్ కూడ నాసంగతుల నతిశ్రద్ధతో నాలకించెను. "ఇట్టిపుణ్యము కన్నకికి లేకపోయెఁ గదా... లేకున్న నేమి?...నేను జనకుడ నగుభాగ్యము నాకుఁ గలుగనున్నది" అని యా యువకుఁడు సంతోషాబ్ధి నీదులాడ సాగెను. కౌశికుని పలుకులను తూచా తప్పక యవలంబింపవలయునని యాతఁడు నిశ్చయించెను. అప్పటినుండి యాతఁడు

మాధవితో సంభాషించునపుడెల్ల నాగర్భమందలి చంటిబిడ్డను గూర్చి మాట్లాడుచుండెడివాఁడు.

ఆఱవమాసము వచ్చినది. గర్భములోని పసిఁగందు కదలసాగెను. "ఇటు తాకి చూడుము. ఈశిశువుగుండె యెంత సూక్ష్మముగా నాడుచున్నదో చూడుము"ని మాధవి లేనవ్వునఁ బలికెను. కోవలన్ మందహాస మొనరించుచు మాధవిగర్భమునఁ జేయిడి "ఇది మాయలోకము! ఇంత చిన్నబిడ్డ యేమి ? కదలుట యేమి?" అని యాశ్చర్యమునఁ బలికెను.

"అంగుష్ఠుని పల్లటీలను జూడుము" అని మాధవి కోవలన్‌కుఁ జూపుట కువ్విళ్లూరుచుండెడిది. ఆమోహితుఁడానిసువు యెగిరిపాటును గాంచి వ్యామోహపరవశుఁడై, మఱొకమా రెగిరినఁ బట్టుకొనునభిలాషతో రేయియంతయు జాగర మొనరించుచుండువాఁడు.

ఇట్లు నెలలు గడుచుకొలఁది కోవలన్ కానందమును, తత్తరపాటును హెచ్చు కాసాగెను. ఆతనికి క్షణమొక యుగముగాఁ దోఁచుచుండెను. మాధవిగర్భములో దినదినాభివృద్ధినందు తన కూనపై నాతఁడు కన్నిడియుండి, మనుష్యప్రపంచములోనికా నిసుఁ గెప్పుడెప్పుడు ప్రవేశించునా యని తహతహలాడ మొదలిడెను.

ఈలోపలఁ దన యావదాస్తిలో సగమునకుఁ బైగా మాధవికిని పుట్టనుండు బిడ్డకును జెందునట్లాతఁడు సంక్రమణ పత్రములను వ్రాసి సంతకము చేసెను. అంతతోఁ బోక, ఇంటిలో నుండువారి కందఱ కాతఁడు బహుమతులఁ బ్రతి దినము ధారాళముగ నొసంగుచుండెను. మాధవిసుఖప్రసూతి

కాతఁడు దివ్యక్షేత్రములయం దనేక పుణ్యకార్యములఁ గావించెను. మాధవి కష్టములేక కాన్పు చేయుఁగాక యని యసంఖ్యాకములగు దానములను బీదసాదులకుఁ జేసెను. తన శయ్యఁ జేరని కోవలన్‌తో దారుణమగు వ్రత మింతయేల యని యొక్కొక్కప్పుడు తనకై తానే మాధవి సూచించు నుపదేశము ననుసరించు చుంచెడివాఁడు. "అంతగా మించి పోవున దేమున్నది? నాకుఁ గామితము నీ యారోగ్యము, నీ గర్భస్థమగు శిశువుక్షేమముగాని, క్షణికమగు మరు సౌఖ్యము గాదు సుమా!" అని యాతఁ డనుచుండును.

కడకుఁ బ్రసవవేదనయు నారంభమైనది. అనుభవపరు లగు మంత్రసానులు వచ్చిరి. సాయమొనరింపవచ్చిన యిరుగు పొరుగు సుదతులతో నిల్లంతయు నిండిపోయెను. కోవలన్ ప్రసూతిగృహమున కావలఁ గూర్చుండి యేసమయమున కేది కావలయునో తెచ్చుటకు తెక్కలు గట్టుకొని యుండెను. కాన్పునొప్పులు రెండురోజులపాటు నిలిచియుండినది. కడకుఁ గాన్పయినది. బిడ్డ భూపతనమైనది. మెల్లగాఁ గీచుమని యేడ్చి నందునఁ బ్రాణమున్నదని తెలిసినది. నొప్పులు కన్పించిన పిదప కాన్పుకుఁ గాలవిలంబమగుటం జేసి, మాయసంచియందు బిడ్డ మలినమై యుండెను. అనుభవపరులగు మంత్రసానులును, ఇల్లాం డ్రును బిడ్డకు నీళ్లుపోసి బాగుగా నేడ్చునట్లొనరించిరి. అంత వారొక బంగారుచేటపై మెత్తని పట్టుబట్టను బఱచి దానిలో నానెత్తురుకందును బండబెట్టి తెచ్చి తండ్రికిఁ గాన్పించిరి. బిడ్డను గాంచి కోవలన్ పరమానందభరితుఁ డయ్యెను. ఆతనికి నవ

నిధు లబ్బినట్లు తోఁచెను. ఆబిడ్డ ముద్దులుమాటఁగట్టించు కన్నులపండువు చేయుచుండెను. అసలు మంత్రసానులకే యాహూన మురిపెములదొంతి యయ్యెను. దానిఁగనిన మాధవి కోవలలు తమభాగ్యమున కుబ్బిపోవుచుండిరి. తనూజాత జననోత్సవసందర్భమునఁ గోవలన్, ధాన్యమును, పంచదారను, అరఁటిపండ్లను, బంగారురూకలను, బ్రాహ్మణులకు బంధువులకు పేదలకు దానమొనరించెను. ఒకప్పు డాతనిబాంధవుఁ డొకఁడు నౌకాభంగముచే సముద్రమునం బడి కొట్టుకలాడుచుండఁగా, దయామయి యగు మణిమేఖలాదేవి వానిని గట్టుకుఁ జేర్చి కాపాడెను. అందుకుఁ గృతజ్ఞతఁ జూపనెంచి, తన యాఁడుబిడ్డకు 'మణిమేఖల' యని కోవలన్ నామకరణ మొనరింప నిశ్చయించెను. "వచ్చియురాని జీవములతో నీబిడ్డకూడ రెండు రోజులు తన్నుకలాడుచు మాయసంచియందు మునిఁగియుండినది గదా !" అని యాతఁ డనుకొనెను.

మఱి యాఱుదినములవఱకుఁ గోవలనుపట్ట పగ్గములు లేకుండెను. తాను, తనబిడ్డ, తనవేశ్య తప్ప మఱి యితర మాతనికి లేదు. ఆతని యానందము చెప్పఁ దరము కాదు. కాని యంతలో నేడవనాఁ డాతని సంతోషమున కంతరాయము గలిగెను. బిడ్డయొడ్డున నెఱ్ఱగాఁ గందిన ట్లొకమచ్చ పుట్టెను. బిడ్డ కేమికీడు కలుగునో యని యందఱు దిగులొందసాగిరి. తమబాలను గాపాడుమని మాధవీ కోవలలు మణిమేఖలాదేవికి మ్రొక్కిరి. రాత్రి చీఁకటిపడినతరువాత నాదేవి వారితో "మీరు బిడ్డకు నాపేరు బెట్టియున్నారు గదా! కాబట్టి మీతనయ యమలయై శుచియై పెరుగవలయు ననిన,

ఆమెను గన్నకికడకుఁ గొనిపొండు. ఆసాధ్వి మీబిడ్డను జేతుల నెత్తికొని లాలించినచో, మీబిడ్డ క్షేమముగా నుండును. ఏ యరిష్టములు గాని మీబిడ్డ నంటవు" అనుధ్వని వారికి విన నయ్యెను. ఇప్పుడు కోవలునకు పెద్దచిక్కు కలిగినది. ఆతనికిఁ గర్తవ్యము తోఁచలేదు. సవతిబిడ్డను గన్నకి లాలించునా? ఆతనికిఁ గన్నకి సౌశీల్యసౌభాగ్యాది యౌదార్యగుణములందు విశ్వాస మున్నది. కావున నాతఁ డామెకుఁ దనబిడ్డను బంపనగునా యని వార్త నంపెను.

ఈ వర్తమానమును గన్నకి చెలియగు విశాలాక్షియు, పరిచారిక యగు మరకతమును వినిరి. వా రందులకు బెట్టు చేయ నెంచిరి. కన్నకితో వారు "అమ్మా! నీవిందుల కీయకొనకుము. ఒకవేళ నంతకు వచ్చినచో, తరువాత కోవలుఁడు మాధవిజోలిమాలి నీకడనే యుండవలయునని బాస చేయించుకొని, మఱి సమ్మతింపుము" అని బోధించిరి.

కన్నకి యామాట లాలించి "ఛీఛీ! ఎంతమాట! ఒకానొక చంటిపాపను సంరక్షించుటకు గాను, నిబంధన లుంచునంత నీచురాల ననుకొంటిరా? నా ప్రాణేశ్వరుని బలవంతముగా నావశ మొనరించుకొనునంత హీనురాల నను కొంటిరా? అది వలనుపడదు. వెంటనే బిడ్డను నావద్దకుఁ గొని రమ్మనుఁడు. నా పతికిఁ బుట్టినది కాన, ఆబిడ్డ సగపాలు నాబిడ్డయే సుమా! అనినుఁగు నాకు ముదమిచ్చును. ఆక్షేపణ లేకున్న, నేనాబిడ్డను నిలుపుకొని నావిభుఁ డనుగ్రహించిన బహుమానరాజమని తలంచి సాఁకుకొందును" అని వారినిఁ జీవాట్లు పెట్టెను.

ఆమె యభిప్రాయము నెఱింగి మణిమేఖలను గోవల నామె కడకుఁ బంపెను. చంద్రబింబమును మించియుండు నాబిడ్డను జూచి కన్నకి సంతోషముఁ బట్టఁజాలక పోయెను. ప్రేమమీఱ నామె యాబిడ్డను జేతులలోనికిఁ దీసికొని రెండు బుగ్గలను ముద్దుపెట్టుకొనెను. పులుకు పులుకుమని జూచుచు నాబిడ్డ యామెచేతులయందు హాయిగ నుండెను.

విశాలాక్షి, మరకతము కన్నకిచుట్టు మూగి బిడ్డను జూచుచుండిరి. కన్నకి వారిఁ గాంచి "ఏమమ్మా! ఇది నా బిడ్డ కాదని మీ రనఁగలరా? ముఖలక్షణము లన్నియు నా కాంతునివి. తల్లిపోలిక కొంతకుఁ గొంతయైన లేదు" అని పలికెను.

అందులకు విశాలాక్షి "దీని జీవయాత్రను దైవమెట్లు నిర్ణయించి యున్నాఁడో గాని, రూపరేఖావిలాసము లస మానములై యున్న" వనెను.

కన్నకి యామాటకు "అది నాకుఁ దెలియును. ఈబిడ్డ విమలాత్మురాలై సుగుణపుంజమై యోగ్యత నూతగాఁ గొని పెద్దదై జగజ్జ్యోతిగాఁ బ్రసిద్ధికెక్కు"నని నొక్కి పలికెను.

ఆమె వాక్యమందలి దృఢభావమునకు, సత్యస్ఫురణకు వా రచ్చెరువొందిరి. కోవలుకడనుండి బిడ్డను దీసికొనివచ్చిన సేవకుఁడు మరల బిడ్డను గొనిపోయెను. "వీలుండినచో బిడ్డను ప్రతిదినము నాకడకుఁ దెచ్చుచుండుము. దానిని

జూచుచుండవలయుననని నాకోరిక" అని కన్నకి వానితోఁ జెప్పెను.

నాటిసుత మణిమేఖల కాంతినందసాగెను. కన్నకికడ నడచిన కథనంతటిని సేవకుఁడు మాధవికి చిత్రావతికిఁ బూస గ్రుచ్చినట్లు చెప్పెను. వారది వినియు నిఁకమీఁద బిడ్డను బంపరాదని తీర్మానించిరి. "ఆలాగు మనము చేసితిమేని, మన కిఁక బిడ్డ దక్కదు. భరతాభినయమునఁ బేర్గాంచియుండు మనవంశకీర్తిని మణిమేఖల నిలువఁబెట్టి తీరును. వయసు వచ్చిన పిదప మనబిడ్డ యువరాజకుమారుని ప్రేమ కాలవాలము కాఁగలదు; ఇది నిజము. అట్లుగాదని, మనము దీనిని కన్నకిని పొకనిచ్చితిమా, సర్వసాధారణముగా సంసారులయిండ్లలో నొకరికంటఁ బడక పుట్టి పూచి రాలిపోవు పుష్పరాజములవలె, పెరిగి మరుగైయుండున"ని చిత్రావతి చెప్పెను.

ఒకటి రెండుసార్లు కన్నకి మణిమేఖలకొఱకుఁ బంపెను. కాని వీలుకాదని వారు మొగమోటము లేక చెప్పిరి. కన్నకి మరలఁ జెప్పి పంపలేదు. "ఇంతకును మణిమేఖల నాబిడ్డ కాదు గదా! దానిని నా కిమ్మని యడుగ నా కధికార మెక్కడిది? ముచ్చటగా మూడేండ్లు కాపురము చేసితిఁ గాదా, దైవము నా కొక నలుసు నిచ్చియుండఁ గూడదా? నిర్మానుష్యమగు నుద్యానమునఁ బుష్పవతియగు లతాంతమురీతి, ఏకాంతవాస మొనరించు నాదుఃఖమయజీవితమునందు నన్నునునయింప నాకొక్క కూనయైన లేకుండుదుర్గతి నాకుఁ బట్టియున్నది!

ఆహా! మానవహృదయ మెంత దుర్బలము! ఆత్మశాంతికి నైతె మొరులమీఁదను, బాహ్యభోగ్యవస్తువులమీద నాధా రపడుచుండును గదా! జీవితము మాయ; విచిత్రము. నాపతికి మాధవిపైఁ గల యనురాగమును దూలనాడితిని; శపించితిని. కాని యీ నిర్భాగ్యసంఘటనమే, సమ్మోహనకరమగు పసిపాప పుట్టుటకును, నాహృదయవనధిని చంద్రోదయమందువోలెఁ గల్లోల మొనరించుటకును గారణమైనది. అయ్యో! నాబిడ్డ నాదైన నెంత బాగుండెడిది ...... ఔనౌను! దురదృష్ట మునఁ జేసియే కదా, నావంటి యనదలపై నాపదలపై నాపదలు పడి రూపఱఁ జేయుచుండును! మాధవి, నాభర్తనే కాదు, నాభర్త బిడ్డను గూడ నాకుఁ గాకుండఁ జేసినది...ఐన నేమాయె! ఆపట్టి చిరంజీవియై సౌఖ్యానందడోలికల నూఁగు చుండుఁ గాక! నిజప్రభాదీప్తులచే లోకమును భాసుర మొన రించుఁ గాక! ఇది సత్యము" అని కన్నకి పరిపరివిధముల భావించుచుండెను.

# ఐదవ ప్రకరణము



## అనాథ

నాటినుండి కన్నకి శోకసంద్రమున మునుకలు వేయుచుండెను ; నానాటికిఁ జేదఱికి మామెను బీడింప మొదలిడెను. తన జీవనాధారుఁడు, దేవదేవుఁడు, ప్రాణకాంతుఁడు, సర్వస్వము నైన కోవలఁ సంపూర్ణముగ మాధవిపైనను మణిమేఖలపైనను మనసు నిలిపి, కష్టకొక్క క్షణమైనఁ దన్నుఁ గూర్చి తలంచుట లేదు. మణిమేఖలను దనకడకుఁ దెచ్చి, కొనిపోయిన కొన్ని మాసములవఱ కాసతీమణి, ఆ బిడ్డనెపమునఁ గోవలఁ మరల నేమైన వార్తను బంపునేమో యని యభిలషించుచుండినది. కాని యామెను నిరాశయే యుఱిమి చూచినది. అందుకుబదులు పలుమారు సేవకులు కోవలఁ కడనుండి డబ్బుకొఱకు వచ్చుచుండిరి.

దారుణమగు విరహతాపమునఁ బాపము కన్నకి కఱగిపోవుచుండెను. దర్పణములవంటి నాలతాంగి కపోలములు తాపానలధూమముచేఁ గాంతిఁ బాసెను. ఆనందధామమై యుండిన నా తెఱవ మోముదమ్మి వన్నెవాసి యుండెను. ఆవాల్గంటి హంసయానము చెదరిపోయెను. పతిత్యక్తయగు నా సతీరత్నము మున్నువోలె నతిథియభ్యాగతులను. ఆదరించుటకుఁ గూడ నోపదయ్యెను. పుట్టింటి కామె పోయియుండెడిది కాని, మనస్సేమాత్ర మందుల కంగీకరింపలేదు. ఒకనాఁ

డామె విశాలాక్షితో "ప్రేమనిరాశలను అడకత్తెర మధ్య పోకవలె నాజీవితము చీలిపోవుచున్నద"ని విచారముతోఁ బలికెను.

విశాలాక్షి యందులకు "అమ్మా! నీవు దుఃఖభారమునఁ గ్రుంగిపోవుచున్నావు సుమా" అని హెచ్చరించెను.

కన్నకి యామాటల విని "చెలీ! నాచింతను దాచుటకు నేను బ్రయత్నించుచునే యున్నాను. పట్టు వదలియు వదలకముందే నాతాపము పై కుబుకుచుండును. ఇన్ని సేండ్లుగా నన్నుఁ బైకొని ముంచివేయుచుండిన వియోగవీచికలు శోకానలమున నావిరియై యుండునని సామాన్యముగఁ దలంచుచుందురు. కాని యది పొరపాటు! తోఁడుకొలఁది నీటిబుగ్గ యూరి చెలమ నిండురీతి, నావంత యంతలో నుబికి తొలఁకాఁడుచుండును. నాఖేదమును నీకుఁ దెలియనీయక దాఁచుటకు నావల్లఁ గాకున్నది. అటులుండ నాజీవితేశ్వరున కద్దాని నెఱింగింప నామన సీయకొనునా? సుశీలయగు లేమ పతిపై నలుకఁ బూనవచ్చునా? అంతకుముందే నా తలిదండ్రుల కీసంగతి నెఱింగింపఁ గలనైన సమ్మతింపను. అదియుఁ గాక ఒకరివంతతో మఱొకరిని గలంచనేల?" అని చెప్పెను.

ఆసాధ్వి కోవలనును దూషించుటకుఁ బెదవినైనఁ గదిపినది గాదు. కాని విశాలాక్షి యిప్పు డోర్వకించుక కోవలనును నిందింప సాహసించి "పాండిత్యము, కళానైపుణ్యము, భాగ్యము, భోగము, రూపసౌందర్యము-అన్నియు నుండియు, నిజబంధుమిత్రవర్గమును దన్నుఁటకు వలయు ప్రేమబంధురమగు నొక్కహృదయము లేనిచో నన్నియు వృధలే కదా! అవి

మనోజ్ఞములగు పులికోఅలు, పులిచర్మముభంగి నీయట్టి యమాయికురాండ్రకు మృత్యుప్రాయములు గదా !" అని యనుచుండఁగా, కన్నకి యడ్డుతగిలి "కట్టిపెట్టుము. ఇఁకఁ జాలును. నావిభుని దూషించుచు నొక్కపలుకైనఁ బలుకరాదు సుమా ! నేనిది వినను !" అని మందలించెను.

"కాని, తల్లీ ! నీకాతఁ డొనరించిన యన్యాయమునకు నీవు కృశించిపోవుచున్నావు గదా !"

"కాదు. విశాలాక్షీ ! కాదు. నే నభాగ్యురాలను. నే ననుభవింప నూహించుచుండిన దివ్యానందములన్నియు నాపురాకృతపాపఫలమునఁ బటాపంచలైనవి. కాన, నాపతిని నేను దూషించుటకుఁ గారణ మేమి ? అట్లని నా కాతనిపైఁ గల యనురాగ మణుమాత్రమైనఁ దగ్గలేదు. అందుకుఁ బ్రతిగా విశ్వసనీయునకు వడ్డీకిచ్చిన విత్తమువోలె, నాప్రేమ యంతకంత కభివృద్ధి యగుచున్నది సుమా ! నా మనోనాథుఁడు మాధవి పొందు చేయుచున్న నేమి ! అందుచే నాతనిఘనత కొంచెము కాలేదు. నీటఁ దేలుచుండియు, బురదఁ బడియుండియు, సరోజము సుందరముగనే యుండును గదా !"

"ఆతనికై నీవు బెంగఁ గొనియుండుట నాకుఁ దెలియదా ! నీమాటలే నిజమైన, ఆతనికై చింతింప నవసర మేమి ?"

"ఏలనా ? ధనమే ప్రధానమనియెంచు వెలయాలివలలోఁ బడి విశుద్ధప్రేమను వ్యర్థ మొనరించుచున్నాఁడు గదా యని. పవిత్రమగు నాతని యనురాగమును గాని, సుగుణజాలమును గాని, ఆ వారకాంత లెక్కపెట్టునా ? పీల్చి

పిప్పిచేసి యాతని నాబోగముచాన పాఱవేసి తీరును. ఇదియే నాకు శోకకారణము."

"మఱి, మాధవి యెంత ధనప్రవాహమును దనవైపు మళ్లించుకొనుచున్నదో చూచుచున్నావు గదా! ఇంత విత్తమును, ఇంతప్రేమను వేశ్యాంగన లనుభవించుచుండియు, విశుద్ధానురాగము గాని, కృతజ్ఞతాబుద్ధిగాని, సంబంధబాంధవ్యములు గాని వారిమానసములఁ గించిన్మాత్రమైనఁ జలింపఁ జేయ వెందుచేతనో గదా!"

"ఆకారణము తెలిసియే యున్నది. అయస్కాంత మినుమునే గాని, అంతకంటె విలువయగు వెండి బంగారుల నాకర్షించునా? అట్లే పడఁపుఁజెలి కూడఁ గేవలము ధనమునకు దాసురా లగును గాని, అంతకంటెఁ బ్రశస్తములగు ప్రేమ చేతఁగాని, సుగుణసంపద చేతఁ గాని కట్టువడదు."

"ఎంత సత్యమమ్మా! ఈసంగతి నీస్వామికి వ్రాసి పంపిన మంచిది గదా?"

"ఇందలి నిజమును గ్రహించుట కాయన సిద్ధముగా నుండినఁ గదా! వలయందుఁ జొచ్చిన గజేంద్రము పోయిగ నచట యెరగానుంచిన చెఱకును నమలుచుండువిధముగా, వారకాంతమాయలోఁబడి యాతఁ డానందమునఁ జొక్కియున్నాఁడు. ఒక్కమాట! పానము, ఉన్మాదము, విషజ్వరము—వీనివలె మోహము కడముట్టసాగికాని సన్నగిల్లదు."

"కాని, ఎంతకాల మయ్యది నిలిచియుండునో ఎవరు చెప్పఁగలరు?"

"లేక, కడముట్టఁ బోవునని మాత్ర మెవరు నిర్ధారింపఁగలరు? అంతయు నాభాగ్యముపై నాధారపడి యున్నది."

ఇంతసేపుగా వారిమాటల నూరక వినుచుండిన మరకతము ముందుకు వచ్చి "కొంతకాలమునకుఁ గాని యాపిచ్చి భ్రమ తుదముట్టదు. అమ్మా! ఈవంతున నిగిరిపోవుచుండినచో, నీభాగ్యసుధ యెంతయో కాలము నిలిచియుండదన్నినా భయము" అని హెచ్చరించెను.

కన్నకి:—ఏమైనఁ గానిమ్ము! ఎట్టి కష్టములకుఁ గాని గుఱిచేయక, దైవము నాప్రాణకాంతునిఁ గాపాడుచుండిన నాకదియే పదిలక్షలు! నావిభుఁడు సౌఖ్యముగ నుండుఁ గాక!

మరకతము:—మున్నువోలె నీవు దేవాలయములకుఁ గూడఁ బోవుట లేదు. ఇరుగుపొరుగు యిల్లాండ్రఁ గాని, నీచెలికత్తెలఁ గాని పూర్వమువలె నాహ్వానించుట లేదు. నీవు కడగండ్లఁ బడుచుండియు, ఆకడగండ్లకుఁ గారణుఁ డగు వానిని దీవించుచున్నావు గదా! నాకిది యర్థమగుట లేదు.

కన్నకి:—మరకతం! అర్థము చేసికొనుట చాల సులభము. కులకాంతకు ఒక్కసతీత్వము లేకున్న, మిగిలినవన్నియు సుగుణములయ్యును వ్యర్థములని యెఱుంగుము. అప్రతిమానపాతివ్రత్యముతో రాజిల్లురామ, మానవప్రపంచమునకు మకుటప్రాయము. పతిని దప్ప మఱి యితరదైవములఁ బూజించని పడఁతి కసాధ్య మేమి కలదు? మేఘములుగూడ నామె

యానతికి లొంగి చెప్పినచోట వర్తించును. ఆమెమహిమ యంత యమోఘము సుమా !

మర:—నీమాట నిజమైన, నీపతి నీకడ కంతలోఁ దిరిగివచ్చునట్లు నీవు చేయఁగూడదా ?

కన్నకి:—చేయఁగలనని యే యనుకొందును.

విశా:—పతిపునస్సమాగమమునకంటె నీకుఁ బ్రియమైనది మఱే మున్నది ?

కన్నకి:—చెలీ ! అందుకు సందేహ మేమి ? నిన్న రేయి కూడ నేను నా కాంతునికౌఁగిటఁ జిక్కి చొక్కియుంటిని. కాని యంతలో నా క్రూరకర్ముఁడు సూర్యుఁ డుదయించెను. నాకప్పుడు మెలఁకువ రాగా నంతయుఁ గలయని కనుఁగొంటిని. అయిన నేమి ? ఆకలయందుఁ గూడ నే నపరిమితానంద మొందితిని. వలచి వలపించుకొనకున్న, నిర్భాగ్యజీవియే కదా ! కాని యాశాకిరణము లేశమైన లేకున్న, జీవితము చీఁకటికోన యగును. కాఁబట్టి యేనాటికైన నొకనాటికి నాపతి నన్ననుగ్రహింపక పోఁడను నిబ్బరముతోఁ బ్రాణములఁ బిగఁబట్టి యున్నాను. ఆగణిక నిరాదరింప నాతఁడు హృదయావేదనతోఁ బశ్చాత్తప్తుఁడై తిరిగి నన్నుఁ జేరినపుడు, నేనాతని నాదరించి ముదము గూర్పవలయుఁ గదా ! ఈ సంకల్పముతో నాజీవయాత్రను గొనసాగించు చున్నాను.

మోహనాంగిని నాదుకాముకుఁ డతండు ;
ఓలలాడితి ప్రేమవెల్లువలయందు.

వానితోఁడిదె లోకంబు ; వాంఛితంబు ;
అతఁడు లేని జీవితమె శూన్యముగఁ దోఁచు,
కోరుకొనెదను నాతోడ కోమలముగ
మెలఁగి యానంద పఱతఁ గామించుకొఱకు.

విశా:—అమ్మా! నీకంత నమ్మకమున్నది కాఁబట్టి ఓపికతో నుండుము.

కన్నకి:—కాని, సఖి! నాదుఃఖకారణ మిది యొక్కటియే గాదు. నాతతి నాకు సంతానమును బ్రసాదింపఁ డయ్యెను. నావిభుని ప్రతిబింబమునైన నేను నేత్రానందముగఁ జూచుచుండినచో, నాజీవితాంధకారమున భాసురకిరణ మొక్కటియైన నుండెడిది. నాకొక పసిఁగందు కలుగునోము నోచుకోనైతిని. "సుగుణాలవాలుఁడగు సుతుని గన్నతల్లితో సమాను లెవ్వరు ? దేవలోకమున నాపుణ్యవతికి సమున్నత పదవి లభించున'ని మునిపుంగవు లనుచుందురు. సంసారము సౌఖ్యనిలయము. అనుఁగుఁగుఱ్ఱ యాసంసారమునకుఁ జంద్రబింబము వంటివాఁడు. నిజ మారయ ; సంతానసంపదయే సంపద గాని, మిగిలినవన్నియుఁ గావు. ఒకపట్టి మనకిచ్చిన పర మానందము పదివేలదానఫలములు నైత మీయవు. తమ బిడ్డలు ముఱికిచేసిన గంజినీళ్లు కూడ, తలిదండ్రులకు సుధా రసముకంటె రుచియై యుండును. బిడ్డలను దగ్గఱఁ దీసిన దేహమునకు దివ్యానందము కలుగును. వారితొక్కుపలుకులు విన మఱిమఱి సొంపు నింపుచుండును. 'మురళి మధురమైనది. వీణె యింపైనది' అని పలుకువారు, తమబిడ్డల ముద్దుపలుకు

కులకు మురియనివారని తెలియుము. కాని, చెలీ! నాప్రియుని ఛాయాచలనము నాకుఁ బొడఁగట్టినరీతి నాకు నాపట్టి కనఁబడియుఁ గనబడక పోయినది. ప్రస్తుతము నా కాంతుని పైని యనురాగమే నాకుఁ బ్రాణాధారమై యున్నది సుమా!

విశా:—ఆకృతఘ్ను నెంతగాఁ బ్రేమించియుఁ బ్రయోజనము లేకున్నది గదా?

కన్నకి:—అట్లన్నటి కనకుము. ప్రేమయే జీవితమునకు మూలాధారము. ప్రేమవినా మానవశరీరము, ఎముకల ప్రోగుచేతను మాంసఖండములచేతను నింపిన తోలుసంచి కాక మఱే మగును? అనురాగవిహీను లగుమానవులు స్వార్థపరులు. ప్రేమావతారులు తమయెముక లఱుగునంతవఱకు పరోపకార మొనరించుచునే యుందురు. ప్రేమకుఁ బ్రతిఫలము ప్రేమయే యనుకొనుము. ప్రేమించువారినిమాత్రమే ప్రేమించవలయు ననియు, లేక త్యాగమూర్తులను మాత్రము ప్రేమింపవలయుననియుఁ దలంపకుము. అటులైన, దివ్యమగు ప్రేమ అంగడివస్తువులై పోవును; సర్వసామాన్య మగును. ప్రేమాస్త్రమునఁ గ్రూరాసురుని జయింపవచ్చును. పిడుగడచిన టెంకాయచెట్టు మరలఁ జిగురించుట గాని పూయుట కాని యెఱుఁగనివిధముగా, నిజహృదయమునఁ బ్రేమజ్యోతి నార్పివైచిన మానవుఁడు శాంతిభద్రతలను, సంతోషసంపదలను గాంచనేరఁడు.

ఇట్లన్ని యోనెలలు గడచినవి డబ్బుకొఱకు కోవలన్ కడనుండి సేవకునివెంట సేవకుఁడు విరామములేక కన్నకివద్దకు వచ్చుచుండిరి. కోవలన్ సొంతయాస్తినంతటిని కన్నకి వారి

కిచ్చెను. అదియంతయు నైపోగా, పుట్టింటివారు తనకిచ్చిన వస్తుజాలమును గూడ నామానవతి యొసంగెను. కడకదియు క్షీణింపఁగా, నొకటొకటి తనయొంటిమీఁది వెలగల సొమ్ముల నమ్మి లభించినధనము నిచ్చెను. మణిమేఖల కిప్పటికి మూఁడేండ్లు నిండినవి. ఓమి వాడినఁ గాని భుక్తికి జరుగనిపరిస్థితు లామెకు దాపురించినవి. దానంజేసి పరిచారికలగు విశాలాక్షిని, మరకత మును నౌకరినుండి నిలుపవలసి వచ్చెను. ఆమెదురవస్థకు వా రెంతయో చింతించిరి. కన్నకియందు వారికిఁ బూజ్యభావము. అందుచేతను, కృతజ్ఞతాబుద్ధిచేతను, జీతము భత్యము లేక యామెసేవయందే నిలిచి యుండుటకు వా రీయకొనిరి. కాని యాసాధ్వి కావిధము నచ్చలేదు. "మిమ్ములను నేనేల బాధింప వలెను ?" అని కన్నకి యనెను.

వా రందులకు "మా కిదియొక బాధలోఁ జేరిక కాదు. నీసమక్షమున నుండుటకంటె మాకు వేరు సంతోషము లేదు. ఇంతకాలముగా నీసేవయందు మేము ధనము గడించితిమి. కాబట్టి కొంతకాల మెట్టి వేతనమును గాంక్షింపక నిన్ను సేవించుట మాధర్మము గదా!" అని బతిమాలిరి.

కాని కన్నకి వారిమనవులను జెవులఁ జొనుపక వారి నంపివైచెను. "పోనిమ్ము! ప్రతిదినము మేము వచ్చి నిన్నుఁ జూచి పోవుచుందుము. ఇందులకైన సమ్మతింతువా ?" అని వా రడిగిరి. అందుకుఁ గూడ నామె యంగీకరించలేదు.

"ఏకాంతముగా నుండవలయునని నా యభీష్టము. వాత్సల్యసంభరితములగు మీవిశుద్ధహృదయారవిందములు నా దుఃఖానలసంపర్కమునఁ గమలిపోవుట నా కిష్టము లేదు.

కాబట్టి, నాపతి నన్నుఁ జేపట్టినాఁడను శుభవార్తను మీరు వినువఱకు దయచేసి నాదిక్కు రాకయుండుఁడు" అని యామె గట్టిగాఁ జెప్పెను. కన్నీరు గార్చుచు వారు పోయిరి. నాఁడు మొదలు కన్నకియొంటరిగా నివసింపసాగెను. మాసిన చీరతప్ప మఱియొక బట్ట కట్టుట కామెకు లేదు. కంకణములు, అందియలు తప్ప మఱేసొమ్ము లామెకు లేవు. కలిగినంతవఱ కామె కలియో గంజియో త్రాగుచు నిజేశునిరాకను నిరీక్షించుచుఁ గాలమొకరీతిగాఁ గడపుచుండెను. అప్పుడప్పుడు తనవద్దకుఁ గోవలన్ కడనుండి వచ్చుసేవకుల కాతఁడు కోరిన నగలనో నాణ్యములనో నున్నంతవఱ కిచ్చిపంపుచునే యుండినది.

ఇట్లు పదేండ్లు గడచినవి. వియోగవ్యథాభారమునఁ జేసి యాసతీమణికిఁ బ్రతిసంవత్సర మొక యేన్నాళ్లశనిగాఁ దుస్సహమై కాన్పించుచుండినది. అప్పటికిని గోవలన్ తిరిగి చూచినవాఁడు కాఁడు. చిత్రావతి, దానిపరిచారికలు తనభర్త నగౌరవించుటయే గాక, నీచముగాఁ గూడఁ జూచుచున్నారని కన్నకి విని దుర్భరశోకాక్రాంత యయ్యెను. అంతకన్న నామె యేమి చేయఁగలదు? తన యవమానమునకుఁ గారకురాలు మాధవి యణుమాత్రమైనఁ గాదనియు, భోగభాగ్యప్రాప్తి యాతని కగుఁగాక యనియు, ఆపతివ్రత సదా దైవమును బ్రార్థించుచుండెడిది. ఎప్పటికైనఁ దనపతి తన్నాదరింపక పోఁడను విశ్వాసముతో, 'నా' యనువారు లేక యాసతీతిలకము దినములు గడుపుచుండినది. కాని యావిశ్వాసము నానాటికి సన్నగిల్లి, కట్టకడకు మఱుఁగై పోవుస్థితి కూడ నేర్పడెను.

# ఆఱవ ప్రకరణము

## చిత్రావతి టక్కులు.

మాధవిపై మరులు గొనిన కొన్నియేండ్ల వఱకుఁ గోవలన్ ధారాళముగాఁ గానుక లొసంగుచుండెడువాఁడు. మాధవి పరిచారికయగు చెల్లమ్ మూలముననఁగాని, లేక స్వయముగాఁ గాని మాధవికిఁ గోవల నొసంగు బహుమానవస్తు సమితి కావేరీప్రవాహమువలె నిరంతమై యుండెను. అరుదగు పట్టుపుట్టములకు లెక్కలేదు. ఆముత్యములకు మూల్యము లేదు. అవి మణులు గావు; అవి మాణిక్యములు గావు. పూలు, పండ్లు, పట్టెమంచములు, పఱుపుదిండ్లు—యిట్లు కోరిన వన్నియుఁ గోరినంతలో మాధవికిఁ జేరుచుండఁగా, పాపము సాధ్వీమణి కన్నకిమాత్రము జీర్ణచేలముతో, మాసినరవికతోఁ దననాథుని యోగక్షేమములకై వేయివేల్పులకు నతు లొనరించుచుండినది.

అట్లు పదేండ్లవెనుక కానుకలవాన వెలిసినది. అప్పటి నుండి కోవలన్ వట్టిచేతులతోఁ బోవునపుడంతయు మాధవి పడకటిల్లు మూయఁబడియుండుటయు, చిత్రావతియో చెల్లమో గదిముందు నిలిచి, మఱునాటి యభినయమునకు మాధవి తనకొక మంచి చీర కావలె ననుచున్నదని గాని, ఏదియో యొక నగను వాంఛించుచున్నదని గాని, కోవలన్‌తోఁ జెప్పుచుండుట పరిపాటియైనది. వెంటనే యాతఁడు ధాన్యపు

వర్తకుల వీథిలోని తనయింటికిఁ బోయి వలసినవస్తువులన్నింటిని గొని తీసికొని వచ్చి మాధవి కిచ్చుచు "కోరికను నిన్ననే తెలిపియుండఁ గూడదా?" అని యారోవెలఁదిని నిష్ఠుర మాడుచుండెడివాఁడు. అందుల కా యెలనాగ "ఏమని తెలుపుదును? నీపైని నాప్రేమ యప్రతిమానము. వ్యవహార ముతో ననురాగమును గలుపుట నా కిష్టములేదు" అని పలుక నాయువకుఁడు లేనవ్వు వెన్నెలలను వెదఁజల్లి యా వార కాంతబుగ్గను కొనగోర మీటెడువాఁడు. అప్పుడా చంద్రానన మోహాతిరేకమున నావిటుని బిగియారఁ గౌఁగిలించుకొని, వాని నధర మానినిచ్చి 'దేవా' యనియు, 'నాథా' యనియు నాతనిఁ బిలిచి, అంతలో "కాదు కాదు. నిన్నుఁ బెండ్లియాడిన కన్నకికిఁ దప్ప నిన్నారీతి సంబోధించుట కధికార మింకెవ్వరి కున్నది?" అని తనకుఁ దాను తెలివిఁ జెప్పి కొనును.

అందుకుఁ గోవలన్ "నాప్రేమనిధానమవు; నాహృద యాధిదేవతవు నీవే గాని, కన్నకి గాదు. కన్నకి నెన్నఁడో జూచినజ్ఞాపకము కూడఁ దగ్గుచున్నది" అని పలుకుచుండును.

ఇట్లంతకంత కాతనిసంపద యడుగంటసాగెను. కూడఁ బెట్టిన ధనమంతయుఁ గఱఁగిపోయినది. ఆగిరువ్వ యాతనికి ఋణమిచ్చువారుగాని, కడ కెద్దిగాని యాతని కప్పుగా విక్ర యించువారుగాని మచ్చున కొక్కఁడైనఁ గానరాఁ డయ్యెను. కాన మాధవి కెట్టిబహుమతుల నిచ్చుటకుఁ గాని యాతనికి గతిలేకపోయినది. మోమోట మించుకయైన లేక చిత్రావతి చెలమ్ తన్న వమానపఱచుటయుఁ, దిరస్కరించుటయుఁ

గోవలన్ గమనించి ఖిన్నుఁ డయ్యెను. మాధవి వదనముననైతము కొంతకుఁ గొంత విరసభావమున్న ట్లాతనికిఁ దోఁచెను.

చిల్లిగవ్వకుఁ గొరగాని కోవలన్‌ను వదలి ధనాఢ్యుఁడగు పురుషోత్తముని వలచి సుఖింపుమని కొంతకాలముగాఁ జిత్రావతి మాధవితో నొక్కి చెప్పుచుండెను. "మణిహారము రిక్తుని వదలి మఱియొకభోగికంఠము నలంకరించునట్లు, సుందరాంగియగు సాని దరిద్రుని బాసి భాగ్యవంతునిఁ జేపట్టఁజనున"ని చిత్రావతి నీతులాడెను.

మాధవి కామాటలు రుచింపవయ్యెను. "మన కాతఁడెంతయిచ్చెనో చూడుము. మన యీభాగ్యమంతయు నాయుద్ధారుఁ డొసంగినదియే కదా! ఆతనియాస్తి యట్లే కట్టు కదలక మనలఁ జేరినది. ఆతఁడు మనలఁ జేరఁదీయుటకుఁ బూర్వము మన కేమియుండినది? అదియటుండ నా కాతని పైని ప్రేమ మిక్కుటము. మణిమేఖలకును దండ్రిపైని ప్రేమ యధికము. కాన నే నాతనిఁ గలనైన విడువఁజాలన"ని ఖండితముగాఁ బలికెను.

చిత్రావతి యామాటల కీయకొనక "ఆతఁడు నీయెడల నిష్కపటముగా వర్తించుట లేదు. మిత్రులవద్దను, కడకుఁ కన్నకివద్దఁ గూడ నాతఁడు ధనరాసులు దాచియున్నాఁడని వింటిని. ఆతఁడు పైకగపడునంత యమాయకుఁడు కాఁడు. అన్నియు నటుండ, మణిమేఖలను మనకులవృత్తి నవలంబించుట కాతఁ డేమాత్రముగాని సమ్మతింపఁడు. కాఁబట్టి, మన మాతని నెంటివైచినఁ గాని, మన యభీష్టము నెఱవేఱదు. అట్లు మనము చేయనిచో, ఏమికలుగునో సుంత యోచింపుము.

చిత్రావతి వంశము, మాధవి యన్వయము—రెండును నిర్మూల మగును. రాజాస్థాన వేశ్యాకుటుంబ మంతరించున”ని బోధించెను.

మాధవి యందుల కీయకొనక “నేను కోవలను విడనాడి మనఁజాలను. వియోగభారమున నాగుండె ప్రీలి పోవున”ని వచించెను.

చిత్రావతి పట్టు వదలక “అమ్మాయీ! అట్లనకుము. కన్నకి కులాంగన గదా! ఆమెకూడ వియోగభరమున మరణింపలేదు. నీవిటుని వీడి యొక వారముదినము లుండఁ బ్రయత్నింపుము. ఆవెనుక నూపిరియున్నంతకాల మాతని విడిచియుండ నోపుదువ”ని బోధించెను.

మాధవి యామాటల నించుక చెవిపెట్టి వినెను. ఔను. ఈయుక్తిచే రెండుపక్షు లొక్కబాణమునఁ గూలును. ఆమె తల్లితో “సరియే. నీబోధ ననుసరించి నేనొక్కవార ముందును. అప్పుడు విఫలప్రయత్న నౌదు ననుకొనుము. అనంతరము గర్భదరిద్రుఁడు గదా యని కోవలను దఱుమక, కలకాల ముంచుకొనుట కీయకొందువు గదా?” అని ప్రశ్నించెను. ఇట్లు తల్లిపీడ వదలించుకొనుట కిది యుపాయమే గాక కోవలకుఁ దనపై నుండు మరులును బరీక్షించుటకుఁ గూడ వీలుండునని యాగణిక భావించెను. ఒకప్పు డాతఁడు నిద్రింపుచు,

తార సొగసుమీఱు తన్వి నాకుం గద్దు
వదలివేసి నిన్ను వలచినాఁడ,

ప్రణయసుఖము కాలపరిమితి నెఱుఁగదు
అట్టివేళ ప్రేమ మధుర మతివ.

అని కలవరించుటను విని ఆమె మనస్సు కలతఁ జెందినది. కాన నీసమయమున నాతనిఁ బరీక్షింప నెంచెను.

మాధవిమనసు మెత్తగిల్లినదని చిత్రావతి గ్రహించి "ఆహా! అందుల కభ్యంతరము లేదు. కాని, నీవు వేఱొక విటునిఁ జేపట్ట వలయున"ని చెప్పెను.

"అది మాత్రము నావలనఁ గాదు. కేవలము జంతువులు సైతమున్న చెలిమిని వదలి క్రొత్తచెలిమిఁ జేయుటకుఁ గొంత కాలయాపన మొనరించును గదా."

"భోగమువారికి మన కానీతినియమము లుండఁ జనునా?"

"అయిన మనము నీచాతినీచుల మనుట కీ నిదర్శన మొక్కటి చాలును."

"ఔను. తల్లికిఁ దగినకూఁతురే. మణిమేఖలకూడఁ జిలుకవలె నీపలుకులే పలుకుచుండును."

"ఇందు వింత యేమున్నది. నీవన్న ట్లాకాంత పుట్టినది నాగర్భమందే కదా!"

"ఒక్కమాటఁ జెప్పుము. నీవు కోవలనును గామించుటకుఁ బూర్వము, నీ కన్నెఱికమున కెవఁ డెక్కువకట్న మిచ్చునో వాని నుంచుకొనుటకు సంసిద్ధమై యుంటివి కదా?"

" అవును. కోవలన్‌కన్న నెక్కువ కట్నమిచ్చు విటుఁడు మఱి యుండఁడని నాకు ముందే తెలియును. ఒకవేళ యట్లుఁ గాదనుకొన్నను, సూర్యోదయమునకుఁ బూర్వము దీపముంచు కొనుట సమంజసము గాని, తరువాత యుంచుకొనుట తీరు గాదని తెలియుము. కోవలనుండఁగా నితరుల ప్రస్తావన నాకేల ? "

"సరి. ఇఁకఁ దర్కమెందుకు ? ఒక్కవారమే కదా గడువు. నూతనవిటునిఁ గామించుటకుఁ గూడఁ జాల విళంబ మున్నది. పైరు బెట్టుటకు ముందే పొలమును తీరుచేయుట యెప్పటికిని మంచిది. మహేంద్రోత్సవ మెల్లుండియే యారంభము కానున్నది కాబట్టి, ఉత్సవమైనదినమే కోవలన్‌ను గెంటివేయుము. "

" అదెట్లమ్మా ! ......అతఁడు దరిద్రుఁడు ; నిజమే ; కాదనను ! ఆతఁడు కొంతకుఁ గొంత ధనమును దాఁచియుంచె నను వదంతిని నీవు వినియున్నావంటివి ; అగుఁ. గాక ! నాప్రాణములైన విడువ నిచ్ఛగింతును గాని, ఆసుందరాంగుని బాసి నే మనఁజాలను. ఆధర్మాత్ముఁ డిచ్చిన కానుకలఁ గొల్లలుకొల్లలుగాఁ గొనియుండు నే నేమొగముతో నాతనిఁ బొమ్మనఁ గలను ? "

" అమ్మాయీ ! ఆతనిపీడ వదలించుకొనుట మిగుల సులభము. ఆతనిస్వభావము నాకుఁ దెలియక పోలేదు. ఆతఁడు డంబాచారి ; వంచకుఁడు. ' నేను సజ్జనుఁడను. నా యోగ్యతనుబట్టియే నన్ను మాధవి మోహించుచున్నది

గాని, నాభోగభాగ్యములను జూచి కాదని' యా మాయావి భ్రమించుచున్నాఁడు సుమా !"

"అది నిజముగాక మఱేమి ? ఆపురుషపుంగవుని సౌశీల్యమును జూచియే నే నాతనిఁ బ్రేమించితిని."

"యోగ్యత ! సౌశీల్యము ! ఏమి యోగ్యుఁడు ? సాధ్వియగు సతిని వదలుట యోగ్యతయేనా ? సర్వసంపన్నమగు వాణిజ్యమును మూటఁగట్టి నష్టేటఁ ద్రోయుట యోగ్యతయేనా ? జారుల కనువగు చిలిపిపను లాచరించుచు స్వశక్తిని ద్రుష్పుపట్టఁజేయుట యోగ్యతయేనా ?"

"కాని అమ్మా ! ఆతఁడు కన్నకిని విడనాఁడుటకుఁగాని, వ్యాపారమునకు హస్తోదకము లిచ్చుటకుఁ గాని కారణ మెవ్వరు ? నేనే కదా ?"

"ఆతఁడు రూకకైనఁ గొరగానివాఁడు సుమా అతఁడు భాగ్యవంతుఁడే యైన నీయట్టి శృంగారవతులు నూఱుగురైన నాతనికిఁ జాలియుండెడివారు కారు. మణికర్ణుఁడున్నాఁడు ; మధుసూదనుఁ డున్నాఁడు ; వీరిలో నొకనిఁ గామించి సుఖించుము. అమ్మాయీ ! నీవయస్సులో నేను వారిఁ జేపట్టనెంచియు నుపయోగములేక యూరకుంటిని. ఇటుక, మంటిపెళ్లను బగులఁగొట్టుఁ గాని, బొంతటాయినిఁ బగులఁ గొట్టఁగలదా ?"

మాధవి కెంతఁ జెప్పినను, ఆమాటలు నచ్చలేదు. ఆమె కోపముతో "సరి ! ఇదియు నొకందుకు మంచిది. నీ

కన్నకియెడఁ దనధర్మము నెఱపి, పితృప్రియమగు వ్యాపారసరళి నెఱుంగుటకు సందర్భ మొదవఁగలదు. కావున నేనిందులకు సంతోషపూర్వకముగా సమ్మతించుచున్నాను. మఱి చెప్పితిని గదా! ఏతంత్రమున నీకార్యమును సాధింపుమందువో చెప్పు మ”ని యడిగెను.

“ఆనాఁడు నీవు కోవలన్‌ను వెంటఁబెట్టుకొని పొమ్ము. అట్లు నీవు పోవుటకుముందుము ‘పేదవడిన సరసునకు సాని వీడ్కోలు’ పాటను మనచెల్లమ్ క్రిందివిధముగాఁ బాడును.

కదలుమిటఁ, జూపకుము నీమొగమ్ము, వేశ్య
వలపు లేఁడ ? నీవంటి నిర్భాగ్యులేఁడ ?
ఎఱుఁగవే, రోవెలందులయెదను స్వర్ణ
ధారచేఁగాని కొన నసాధ్యం బటంచు ?

అదియే తడవుగా నాతఁడు తలవంచుకొని తరలిపోవును. ఈవిటులనైజము నాకుఁ దెలియనిది కాదు. ఇట్టివా రెందరో మున్నిట్లే చేసి యున్నారు.”

“అమ్మా ! నీవు పొరపడుచున్నావు. ఈపరిభవమును గూడ నాతఁడు నన్నుగుఱించి భరించి తీరును.”

“కాదు కాదు. మానవుఁడు చేత ఱాయిఁ దీసి కొనఁగాఁ జూచి, దెబ్బఁ దప్పుగొనుటకై తోఁక ముడుచుకొని పరుఁగెత్తుకుక్కకంటె నీతఁడు వేగముగా నిన్ను వదలిపోవుఁ జూడుము ?

“అదియుఁ జూతము”

"ఆ సిగ్గుమాలినవాఁ డప్పటికిఁ గూడఁ బోకున్న, నిట్లు చేయుము. అతని నుదధితీరమునకు వాహ్యాళి తీసికొని పొమ్ము. అచట 'సంజవేళ రథమున నుంచి పోయి మరలఁ దిరిగిరాని ప్రియునిఁ గూర్చి వేఁగియసి పాడు వియోగకీర్త' నను బాడుము. కాని, ఒక్క విషయము మాత్రము నీవు మఱువఁ జనదు. నీనటన నిజమై, నీయావేదన రసవంతమై యుండునట్లు చూడుము. పరోక్షమున నుండు ప్రియునకై వేఁగియసి పొందువియోగ మతితీవ్రముగా నీయం దగపడవలయును సుమా!"

తన నటనాకౌశల్యమును జూపుటకుఁ దరుణ మబ్బినది కదా యని మాధవి యుబ్బిపోయి "ఆలాగే! అదెంతపని! అది మనకులమునకే వెన్నతోఁ బెట్టినవిద్య కదా! కాని నాసంగతియే వేరు. నిజములో నాకుఁ బరోక్షప్రియుఁడు లేఁడు; కాబట్టి నేను రసోద్రేకముగా నటించెదను. కోవలతోఁ బ్రణయకలహమును సాధించి సంతసించుట కింతకంటె సొంపైన లీల మఱొకటి లేదు. ఏడురోజులవియోగ మాతని ప్రాణములఁ దీయదు" అని నమ్మఁ బలికెను.

నాఁటితో నింద్రోత్సవ మంతము గానున్నది. పతంగ బింబము తూర్పుకొండపైఁ బొడచూపెను. నగరమంతయు జనసమూహముతో నిండిపోయెను. జనులంద అమూల్యవస్త్రాలంకారములతో, భూషణములతోఁ బ్రమోదవార్నిధి దోఁప్ప దోఁగుచుండిరి. ఆటలు, పాటలు, ఎగతాళిమాటలు—వీనితో వారికి సరిపోవుచుండెను. వేడుకలు, నాటకములు, ఉత్సవములు, గారడివిద్యలు—వీనిఁ జూచుచు వారు ప్రొద్దుబుచ్చు

చుండిరి. ఆనాఁడు కోవలన్ మాధవి కనువత్సరము బహుమతి చేయుచుండినదినము. కాని యీనాయే దండులకుఁ దనకడఁ జిల్లిగవ్వయైన లేకపోయెఁ గదా యను నిరుత్సాహముతోఁ గోవలన్ ప్రాతఃకాలమున నిదురమంచమునుండి లేచెను. లేకున్న నేమి ? మాధవిపై నాతని కుండుమోహము నిరవధికము; మాధవికిఁ దనపైని యనురాగ మనంతమని యాతని నమ్మకము. కాన సందియ మేల ?

నాఁటిసాయంకాలము జనులందఱు సముద్రతీరమునకుఁ బోయి వేడుకలు చేసికొందురు. వానిని మాధవికిఁ జూపనెంచి కోవల నా మెయింటికిఁ బోయెను.

ఇంటివాకిటనే చెల్ల మాతని కెదురై "నేఁడు మాధవికిని మణిమేఖలకును నీవు దెచ్చిన కానుక లేవి ?" అని యడిగెను. ఆమాటల కాతని మొగము చిన్నవోయినది. ఆతఁడా మెనెట్లో తప్పుకొని లోనికిఁ బోయెను. అచటఁ జిత్రావతి యాతని కడ్డు తగిలి "ఏమయ్యా ! నేఁడు పండుగదినము ; అందఱును గట్నము లిచ్చుసమయ మిది. కాని నీహాలకము వేరుగా నున్నది. నీవు రిక్తహస్తములతో వచ్చితివి. ఇట్లు నీవు మనరాజ్యమునందు ప్రసిద్ధమగు నుత్సవమునకు జగద్విఖ్యాతి నందియుండు సుందరాంగితోఁ జేతులు చేతులు కలుపుకొనిపోవుట కుత్సహించి వచ్చుట వింతగా నున్నది సుమా!" అని యించుక కర్కశస్వరమునఁ బలికెను. ఆతని చెవుల కా పలుకులు ములుకులయ్యెను. కాని యప్పటికిని చిత్రావతిపలుకులను లెక్కపెట్టక కోవలన్ నేరుగా మాధవికడకుఁ బోయెను. అప్పటికి కామిటారి యలంకరించుకొని యుండలేదు. కోవల

నాకలికిని డాసి " మోహనాంగీ ! నన్ను క్షమింపుము. ఇంతకు ముందువోలె నీసంవత్సరము కూడ నీకుఁ జీరను గొనిరాలేక పోయితి " ననెను. అందుల కాజ్ఞ చలింపలేదు. ఆతని దీనత్వమును జూచియుఁ జూడన ట్లాపొత్తుటాలు నటించి తాను సింగారించుకొని సిద్ధపడువఱకు ముంగిలియందు వేచియుండ నగునని యాతనితో ననెను. ఎవ్వరెవ్వరో బహూకరించిన చీరలు నగలుమాత్రము మాధవిగదియంతయుఁ జెల్లాచెదరుగఁ బడియుండెనే గాని, ఇంతకాలముగాఁ గోవల నావేశ్యతోఁ గామకేళి సల్పుచు నొసంగిన యాభరణచయముగాని, చీని చీనాంబరరాశిగాని యచట మచ్చున కొక్కటియైనఁ గానరాకుండెను. ఇదియే కాదు. 'నేను సింగారించుకొనుచున్నాను. ఆవలఁ బోయి కూర్చుండుమ'ని మాధవి కోవలకుతో నింతవఱకుఁ జెప్పియుండలేదు. ఆమె సొగసు చేసికొనునపుడు కూడ నాతఁ డామెకడ నుండెడివాఁడు. ఇవియన్నియుఁ జిత్రావతి పన్నాగములని యాతనికిఁ దెలియనే తెలియదు.

ముంగిలియందు కోవలకు వేచియుండెను ఆతనిమానసము వ్యాకులమై యుండెను. తన కవమానము జరిగినది ; శృంగభంగమైనది ; గౌరవము గంగపాలైనది ; జీవితము వృథయైనది ; తాను మనుపీనుఁ గైనాఁడు ; ఈభావము లాతని మానసాకాశమున మెఱయుచుండెను. పూర్వ మాతని నెదుర్కొనుచుండిన హృదయపూర్వకములగు నాహ్వానములు, పొఱలి పాఱి తన్ను ముంచెత్తుచుండిన ప్రేమవ్యాహినీతరంగములు, బిగికౌఁగిటఁ జిక్కి సొక్కి సోలుపా[illegible]ర

ణములగు మురిపెపుముద్దులు, అన్నియు మదికి వచ్చి యాతనిఁ గలంపసాగెను.

"ఔను. అనుభవముమీఁదఁ గవీశ్వరు లనినమాట లివి.
ఏనరునకు విత్తముగల
దానరుఁడు కులీనుఁ డధికుఁ డార్యుఁ డతండే
ధీనిధి ధన్యుఁడు నేర్పరి
నానాగుణగణము కాంచనంబున నిలుచున్.

నేను బుద్ధిహీనుఁడను. కాబట్టియే యీసత్యవాక్యము గ్రహింపఁ జాలనైతిన"ని యాతఁ డనుకొనెను.

ఇంతలో చెల్ల మాతనికడకు వచ్చి "ఏమయ్యా! నేఁడు పండుగ గదా? తగిన యుడుపులను నగలను ధరించుటకు మఱచితి వేమి? ఈ సామాన్యవేషముతో మాయజమానురాలితో నీవు సముద్రతీరమునకు వాహ్యాళి పోవుటకు వలనుపడ ద"నెను. కోవలన్ హృదయమును శూలముతోఁ బొడిచిన ట్లయ్యెను. కాని మాధవిపైని వ్యామోహముతో నాతఁ డాపరాభవమును మ్రింగివైచెను ఎలుగు రాలుపడ నాతఁడు "నా వేషమును మాధవి యంతగా లెక్కింపదు. నన్ను మీచెలి మోహించుట నాయోగ్యతను జూచికాని, నాయుడుపులను వేషమును జూచి కాద"ని పలికెను.

"ఇదియా కథ!" అని చెల్లమ్మ చేటంత మొగము చేసికొని గ్రుడ్లు చేతులు త్రిప్పుచు నవ్వెను. అం దంతరార్థము లేకపోలేదు. కోవలన్ కది తెలిసెను. ఆ వికృతాట్టహాస మాతని కోపానలమున కింధనప్రాయ మయ్యెను. పరాభవానలముచే నాతనిహృదయము దహించుకొని పోవుచుండెను.

కాని వెనువెంటనే సహానము నేనున్నా ననుచుండినది. పలువిధ ములగు భావపరంపరాతరంగములఁ బడి యాతఁడు క్రిందుమీా దగుచుండెను. అంతలోఁ జిత్రావతి యచటికి వచ్చి చెల్లమ్‌తో "పాపము! ఈతఁ డింతసేపు వేచియున్నాఁడు. విసుగెత్తుచుం డును ఏదియో యొకపాటఁ బాడి యీాతనిని సంతోషింపఁ జేయుమ"ని సూచించెను. అదియే తడవుగా చెల్లమ్ 'వేద వడిన సరసునికి సానిపాడు వీడ్కోలుపాట నిట్లు పాడెను.

కదలు మిటఁ, జూపకుము నీమొగమ్ము, వేశ్య
వలపు లేడ? నీవంటి నిర్భాగ్యు లేడ?
ఎఱుఁగవే, రోవెలందుల యెదను స్వర్ణ
ధారచేఁ గాని కొన నసాధ్యం బటంచు?

ఆ పాటలోనిమాటలు కోవలనా చెవులకు సూదిపోటుల వలె నుండెను. ఆతనిపైఁ బెద్దపిడుగు పడిన ట్లుండెను. ఆపరి భవభారమున నాతఁడు క్రుంగి పోసాగెను. చిత్రావతియు, చెల్లమ్ యీాసంగతిని గమనించిరి. మిటారియగు చెల్లమ్ ఆతనితో "ఏమయ్యా! 'విన్నావా? ఈ పాతపాట సుందర ముగ నున్నదా?" అని యడిగెను.

ఆతఁడు ప్రత్యుత్తర మిచ్చునంతలోఁ జిత్రావతి యడ్డు తగిలి "సుందరముగనే యున్నది. జ్ఞానబోధకముగఁ గూడ నున్నది. కాని ఉన్నదున్నట్లు చెప్పుటలో నించుక శ్రుతి మించిన ట్లున్నది." అని సూచించెను.

అంతలో మాధవి గదితలుపు తెఱచినది. ఆజాణ లిద్ద ఱది చూచి వెడలిపోయిరి.

# ఏడవ ప్రకరణము

## సముద్రతీరమున సూర్యాస్తమయము

'శృంగారరసమునఁ జికిలిచేయించిన కంతు మోహనసాయక' మట్లు మాధవి గదివెలువడి వచ్చెను. ఆకోమలి సుగంధతైలములతోఁ దలఁ దువ్వుకొని పట్టుకుచ్చులఁ బోలిన వినీలకుంతలములు నిజముగు పట్టువలె సుస్నిగ్ధకాంతులతో మృదువులగున ట్లొనరించెను. ఆముద్దుగుమ్మ కురులను సుందరముగ జడనల్లుకొని కస్తూరీపరిమళములను జిలుకరించుకొనెను. ఆమె ధరించినచీర, రవిక మనోజ్ఞములైనవి. దక్షిణదేశమున నయ్యవి యరుదైనవి. కంఠమున ముత్యాలసరులు, మణిహారములు, బంగారుగొలుసులు; ముక్కున వజ్రాలపుడక; కరములకుఁ గనకకంకణములు; భుజములకు శంఖప్రవాళములు, వ్రేళ్లకు వెలగల యుంగరములు, చెవులకు మరకతమాణిక్యములు పొదిగిన కమ్మలు, ముత్యములు చెక్కిన పైడియొడ్డాణము, బంగరు టందియలు మెట్టెలు—వీనిని ధరించుకొని యా వారనారీమణి జగన్మోహినివలె నుండెను. తా నిచ్చియుండిన నగ యొక్కటియైన మాధవియొంటిమీఁద లేకుండుటను గాంచి కోవలన్ వేసటపడెను. బుద్ధిపూర్వకముగా నా వెలయాలు తన కితరు లొసంగియుండిన యాభరణములను, చీరలను ధరించినది. దుర్భరావమానవేదనచే కోవలన్ తల వంచుకొనెను. మాధవి యాతనిఁ గాంచి "మహేంద్రోత్స

వము కడపటిరోజు ప్రతిసంవత్సరము సముద్రతీరమునకుఁ బోయి విహరించుట మనకాచారమై యున్నది గదా! అచటి యుద్యానవనమునం దొకచవికె నిదివఱకే యేర్పాటు చేసి యున్నాను. మన మచటికిఁ బోయి ఆటపాటలతోఁ జంద్రో దయమువఱకు వేడుకగఁ గాలము గడుపుదము. నేఁడు పూర్ణిమ యని నీకుఁ దెలియును గదా!" అని హెచ్చ రించెను.

కోవలన్ కాపాదమస్తకము విద్యుచ్ఛక్తిరీతి యానం దము క్షణములోఁ బ్రాకెను. ఆమాట లాతనికిఁ జెవుల సుధ జిలికిన ట్లయ్యెను. మాధవి తనయెడఁ బ్రసన్నయైనది. ఇంకేమి కావలయును.

ఆ వేశ్యామణిసూచన నాతఁ డంగీకరించెను. వసంత మాలతో మాధవి రథము నెక్కెను. ఆరథము సముద్రము వైపుఁ బోవుచుండ, కోవల నశ్వముపై దాని ననుగమించెను. వీధిపై నడ్డముగ నలంకరింపఁబడియుండు కమానులతో గోపు రములతో శోభిల్లు విపణిశ్రేణులను దాటుచు, పండ్లగెలలతో రమ్యముగనుండు కదళీకంబములతో నలరారు పెద్దపెద్ద యంగళ్లను జూచుచు వారు సముద్రతీరమును జేరిరి. అచ్చట లెక్కకు మిక్కిలియగు పాక లమర్పఁబడి యుండినవి. కావేరీ సాగరసంగమప్రదేశమున సోమకుండము సూర్యకుండము నున్నవి. ఆతీర్థములందు స్నానముచేయుటకు వచ్చినయాత్రికు లచట గుమికూడి యుండిరి. పవిత్రములగు నాకుండములందుఁ జేయు మజ్జనము, కాముకీ కాముకుల ననవరత మనోన్యస్య మొక్కదివమైన నెడబాయకుండఁ జేయు మహిమ కలదని

నమ్ముచుందురు. మాధవి తన్ను వదలకుండుఁ గాక యని కోవల నాకుండముల స్నానముచేయుట కువ్విళ్లూరుచుండెను. కాని మాధవి యందుల కీయకొనలేదు. "ఇంత సందడిలో స్నానముచేయుట సాధ్యము గాదని నీకుఁ దెలియదా?" యనెను. కోవలన్ కూడ తలయూచెను. పిదప నాటపాటలతోఁ గాలము గడుప నెంచి సముద్రతీరమునందలి ప్రమదావనమున కాతనిఁ గొంపోయెను.

ఇరువురును విలాసముగ నా కేళీగృహమునం దాసీను లైరి. మాధవి వీణియను గోవలన్ కందిచ్చి "ఒక్కపాటఁ బాడుమ"ని కోరెను. దాని నాతఁ డందుకొని కావేరీస్రవంతినిపై నొకకీర్తనఁ బాడెను. దాని యర్థమిది:

"ఓ కావేరీనదీమతల్లీ! నీకు స్వాగతము! మారాజ్యమునకు, మారాజునకు నీవు గర్వకారణమవు. మాపుడమిఱేఁ డుత్తరదిశకుఁ జని గంగాతరంగముల నోలలాడినప్పటికిని, కన్యాకుమారిఁ జేరి యుదధితో నెయ్య మొనరించినప్పటికిని, నీవు సతీమతల్లివి గనుక కినుకఁ దాల్చక యథారీతిగా స్వరాజ్యమును బ్రేమవీక్షణములతోఁ జూచుచుందువు సుమా! అలుఁగులఁ జొచ్చి పంటకాలువలఁ బాఱు జలములసడి నాలకించుచు, కృషికుల గ్రామగీతముల నాకర్ణించుచు 'వినూతన ప్రవాహోత్సవసందర్భమునఁ బ్రజల ప్రమోద వాక్యముల కానందించుచు, నీవు జీవితమును సాగించుచుందువు గదా!"

మాధవి కాపాట యానందసంధాయక మయ్యెను. అతఁడు కీర్తన నిలిపి, మాధవి నొకపాటఁ బాడుమనెను.

అదియే తడవుగా నా పడపుఁజెలి సాగరునిఁ గూర్చి యీరీతిఁ బాడెను :

"ఓ వాహినీపతీ! పులినదుర్గములఁ గట్టుచు నీతీరమున విహరించు పురపణ్యాంగనల మగు మామీఁద మరులు గొని కట్నములతో మమ్ము వెంబడించి వచ్చు విటుల హృదయ వైఖరి యెట్టిదో మాకెట్లు తెల్లము? ఆగ్రహావేశమున మేము మా కుసుమదామములయందలి పుష్పములను గిల్లి జలములఁ బాఱవేయ, మాచేష్టలు తమయెడల మే మగ పఱచు విలాసములని, మా కపరిచితు లయ్యును, వారు భావించి 'మాజాడ్యమునకుఁ దగినయౌషధము మీ యాశ్లేషము తప్ప మఱి లేద'ని పలవించుచు మావెన్నాఁడుదురు. 'మావ్యాధికిఁ గారణము మీరే; కాబట్టి మీరే మాన్పవలసి యున్నది. ఇది మీధర్మము' అని వారు వాదించుచుందురు. 'ఈతరఁగల ఫేనహాసము, తళతళలాడు నీ యిసుకతిన్నెలు, విశాలము నేకాంతమును నగు నీసముద్రతీరము, తనకు సరి యగు నీవదనమును కళాకౌశలమున నీటుచేయు నీచంద్ర బింబము, నీయలకలతోఁ జెరలాటమాడు నీ మలయానిల ములు—అందఱు, అన్నికుట్ర సాగించి మమ్ము మరుకాశ వేధించుచున్నవి. మీయురులలో మమ్ముఁ జిక్కించుకొని బాధించుచున్నారు. కాబట్టి మావ్యాధిని నిష్కళింపఁ జేయు మందును మీకడనే యుండుదానిని మాకు నిరాకరింపకుఁడు. నిర్దయతో మీ విలోకనసాయకముల మమ్ముఁ బొడిచి చంపుట

మాని, ఆశలాకలను మాశస్త్రచికిత్స కుపయోగింపరా ?' అని బతిమాలుచుందురు."

అంత నాబోటి కావేరీనదిని గూర్చి "ఓ కావేరీమాతా! నీకు స్వాగతము. భూపతివలె నీభర్త ధర్మాత్ముఁ డని నమ్మి, బిడ్డకుఁ 'గన్నతల్లివలె నీదేశమున కనంతజీవనప్రదవై దిగులు విచారము లేక నీవు సాగుచుందువు" అని కీర్తించెను. మఱల నాకాంత యొకమాఱు సాగరుని గూర్చి "ఓ జలాధిదేవతా! మాకడకు సరసులు ముత్యములఁ దెచ్చి మా ప్రవాళాధరములను బదులు తీసికొనుచుందురు. మమ్ముఁ జేపట్టి మాటఁ జెప్పి, కడకు వారు మమ్ము వంచించుచుందురు. ఇచ్చినట్లే యిచ్చి బంగరుటుంగరములను లాగుకొనుచుందురు. మధురసమును మాకు దిగఁ ద్రావించి, మధువుకంటె మధురతరమగు మాయ మాటలతో మాకు మత్తెక్కించి, మా మోహసామ్రాజ్యమును గొల్లఁగొట్టుకొనిపోయి వారు మఱలఁ దిరిగి మా మొగమైనఁ జూడరు. ఈ చోటనే మోహపారవశ్యమున నాజతఁ గూడి విహరించుచుండిన నాప్రియుఁడు నను వీడిపోయి మఱలి రాఁడయ్యెను. కాని, ఆతఁడు నన్ను మఱచినను, నే నాతని మఱువను. ఓ వృక్షమా! నేను నాకాంతుఁడు నీనీడయందే కదా నిలిచియుంటిమి ? నే నిప్పుడు విరహవేదనఁ గ్రాఁగుచున్నను, నీవు మాత్రము వికారమొందక యెప్పటివోలె నీ పత్రములతో మలయానిలకుమారునితో సయ్యాట లాడుచున్నావు! నీహృదయ మంత కఠోరమా ? ఓ సలిలచక్రవర్తీ!

నే నేమిచేయుదును ? నాశోకము నీకుఁ దెలియదు. ఓ తరం గములారా ! నా క్షేమకాంక్షులపగిది ! మీరు నటించుచూ, నాసరసుని తేరుచాలులను సైతము పూడ్చివైచి, న న్నాతఁడు మఱచునట్లు చేసితిరి. ఇదేమి న్యాయము ? ఓ హంసరాజమా ! నీప్రియునితో విహరించుచు నాజీవితేశ్వరుని కడకుఁ బోయి 'నీకిది తగద'ని మందలింపుము. ముంజేఁకటు లెల్లకడల నలము కొనుచున్నవి. దినమణి చరమగిరి చాటయ్యెను. ఇనబింబమును దిగమ్రింగి యింతదనుక చందమామను వెలిగ్రక్కని సాంధ్య రాగాసురుఁ డంతటఁ దమోమయమగు పరిపాలనను సాగింప మొదలిడినాఁడు. గుండెను నీఱుచేయు నీవెన్నెలసంజ కెంజాయ విరహిజన లోకమందున్నదా ? కడకు శకుంతములు గూడఁ గల రవమును జాలించినవి. వీచికలు ఘోషను నిలిపినవి. కాని నన్ను మఱచిపోయిన నాప్రియుని నేను మఱువను. ఆజన్మాం తము నన్ను విడనాఁడనని చేసినబాసను విస్మరించి, నన్నిట్టి దారుణసాంధ్యరాగమునందే నాప్రియుఁడు విడిచిపోయి నాఁడు. ఓ పవిత్రసాగరమూర్తి ! మాట తిరిగిన నాసరసుని మన్నింపుము. న న్నాతనికి జ్ఞప్తిపఱచి, త్వరలో నాకాతనిఁ గూర్పుమ"ని పాడెను.

ఈపాటను గోవలన్ వినెను. ఆతనిమది దిమ్మెక్కెను. భావములు పరిపరివిధములఁ బోసాగెను. "నాపాటయందు గూఢార్థము లేదు. కాని యీాజవ్వనిజాణ; జిత్తులమారి. హృద యాహ్లాదకరుఁడగు సరసు నెవ్వనిపైననో వలపునిలిపి యాతనిఁ

గూడుటకై, నాపీడ వదలించుకొనుటకు, యీమగువ యిట్లు పాడినది......ఆహా! ఇప్పుడంతయుఁ దెలిసినది. చిత్రావతి, చెల్లమ్, వసంతమాల—వీరే కాదు, నేటి నా దరిద్రావస్థను జూచి మాధవిసైతము నేననిన విసుగొందు చున్నది. మాధవి నాయెడఁ జూపుచుండిన యాదరణకుఁ గాలదోషము పట్టినది. ఆత్మగౌరవ మణుమాత్రమైన మిగిలియుండునపుడే, నే నిచటి నుండి జారిపోవుట సమంజసమ”ని నిర్ధారించుకొనెను. మాధవి భుజముపైఁ బెట్టియుండిన చేతిని మెల్లఁగా దించి “ఈదినము గడచినది. మనమిఁకఁ బోవుదమ”ని యాతఁ డని లేచి నిలిచెను. కాని మాధవి మాత్రము లేచి నిలుచుసూచనను గన్పఱుప లేదు. కోవలఁ డణుమాటాడక యాచోటువాసి చనెను. కోవలఁ కనుమఱుఁ గయ్యెను. ఇఁక మాధవి లేచినది. ఆ కోమలిహృదయాంబుధి సంతాపవీచికలతో ఘూర్ణిల్లుచుండెను. కాని యెట్లో యామె సఖీసమేతముగా విరహావేదనఁ దూలుచు నింటికిఁ బోయెను.

# ఎనిమిదవప్రకరణము



## దివ్యక్షమాపణ

భోగముదాని వలపునకు మోసపోయి పతివ్రతయగు సతీమణిఁ గాఱియవెట్టితిఁ గదా యని పశ్చాత్తాపమొందుచుఁ, గలఁగిన హృదయముతో జీవితముపైని జీకాకుతోఁ గోవలన్ ప్రమదావనమును వీడి పురములోనికిఁ బోయెను. మార్గమధ్యమునందలి శివాలయమున దివ్యజ్యోతులు వెలుఁగుచుండినవి. దేవాలయమునఁ బ్రశాంతి వ్యాపించియుండెను. అప్పుడే శివపూజ కూడ జరుగుచుండెను. కోవలన్ లోనికిఁ బోయి మహాదేవు నిటు స్తుతించెను.

దిక్కుమాలినయనదను దీనుఁడేను
దుఃఖభాగుఁడఁ, గన్నీరు దొరలుదేను,
మంత్ర మెఱుఁగను, ప్రార్థనాతంత్ర మెఱుఁగ,
కథ యెఱుంగ, సంబోధనా విధ మెఱుంగ;
అద వదలఁ బోయి యిటునటు యఱచిపఱచి
ప్రేమనిధి తల్లి కడకేగు బిడ్డభాతి
పరితపించుచు వచ్చితి భయము విడిచి
శరణ మిమ్మంటి నిపుడు శంకర! మహేశ!

తలఁపఁ బోకుమ నాత్మేశ ! జడుఁ డటంచు,
తలలో కార్చిచ్చు దరికొని, తలఁపు లుడుఁగ,
విధివశంబున నింద్రియ వివశుఁడై తి.
శరణు పరమాత్మ ! పరమేశ ! శరణు శరణు !

ఈ ప్రార్థనచే నాతని కొక పెద్దబరువు దించిన ట్లయ్యెను. ప్రేమబంధురములును, వాత్సల్యముద్రితములు నగు శీతల వీక్షణములతో నాదేవదేవుని విగ్రహము తన్నుఁ గాంచు చున్న ట్లాతఁడు భావించెను. వ్యాకులమై యుండిన యాతని మానసమున కపుడు ప్రబలశాంతి నెలకొనెను. దేవాలయ ప్రాంగణమున నెవఁడో యొకభట్రాజు తిరువళ్లువార్ విరచిత మగు కురళ్ నుండి కొన్ని పద్యరత్నములఁ బాడుచుండ వానిని విన నెంచి యాతఁ డచటఁ గూర్చుండెను. వానిభావము లివి:

భట్రాజు.

వెలయాలి కపటాలింగనము చీఁకటిగదిలో శవమును జేతులతోఁ గౌఁగిటఁ జేర్చుకొనుటవంటిది.

“ఆహా ! ఎంత నిజము !” అని కోవలన్ యున్నరని నిట్టూర్పు విడిచెను.

భట్రాజు.

కులాంగన మానమే ప్రాణమని దలంచును; తన్నుఁ జేపట్టిన పతియే దిక్కని నమ్మియుండును ; మాట తిరుగనిదని మహాఖ్యాతిని గడించును ; కాలయాపనఁ జేయక యామాన పతి కీర్తినందును.

"ఔను కన్నకి యిట్టిదే!" అని కోవలఁడు గొణిగెను.

భర్తృహరి

గోముఖవ్యాఘ్రములగు వేశ్యలతో, జూదపానములతో, భాగ్యలక్ష్మియనుగ్రహము తప్పిన మానవులే స్నేహము చేయుదురు.

"అట్టివారిలో నే నొకఁడను. నేను నిర్భాగ్యుఁడను గదా" అని కోవలఁడు తలంచెను.

భర్తృహరి

సొంతముగ సంపాదించుకొనినది నిస్సారమగు నీళ్లగంజియైనను సరియే, మధురాతిమధురమై యుండును.

"అకటా! నావ్యాపారమునకుఁ దిలాంజలి యిచ్చి పిత్రార్జితమగు సొత్తుపై నాధారపడి యుంటిని. నేనెంత మందమతిని!" అని కోవల ననుకొనెను.

భర్తృహరి

ప్రాణాంతకమగు బాణము సుందరమై సరళముగ నుండును. వీనులకు విందుచేయు వీణ వంగియుండును.

అది విని కోవలఁడు "నాకుఁ దెలిసినంతవఱకీసామ్యములు మాధవికిని కన్నకికిని జెల్లియున్నవి" అనుకొనెను.

భర్తృహరి

ప్రతిమానవుఁడు దరిద్రు నలక్ష్యముగాఁ జూచును. ధనికునిఁ బ్రతిమనుజుఁడు గౌరవించి తీరును.

" అట్టి గతియే నా కిప్పుడు పట్టియున్నది " అని కోవలన్ చింతిల్లెను.

భ ద్రా జు

ఎవ్వఁడును 'నిర్భాగ్యుఁ డ'ను దూషణకు గురికాఁడు. కర్తవ్యము నెఱింగియు, పురుషప్రయత్న మొనరింపకుండు నరుఁడే నిందనీయుఁడు.

' ఒకమారు ప్రయత్నింతునా ?' యని కోవలన్ నిర్ధారించుకొనెను. కాని యంతలోఁ ద్రోవ తెలియక నిరుత్సాహ పడెను.

భ ద్రా జు

గుణవతి యగు సతిఁ గల నరున కేమి కొదువ ? నిజ మారయ, గుణవిహీనయగు నాతినిగల నరున కేమి కలదు ?

దాని నాలకించి కోవలన్ " నాసతి సుశీల ; గుణవతి. కాన నాకుఁ గొదువలేదు." అనుకొని నిబ్బర మొందెను. " కన్నకి నన్ను మన్నించునా ?......నన్ను క్షమించుమని నే నాతరుణి నెట్లు యాచింతును ?" అని యాతని కంతలో సంశయము గలిగెను.

భ ద్రా జు

అడిగిన లేదను నుడువును గలనైన నెఱుంగని ధర్మాత్ములను యాచించినచో, వారి లోకపుణ్యమును యాచకుఁడు ప్రసాదించినవాఁ డగును.

ఆపద్యమును కోవలన్ వినెను. ధాన్యప్రవర్తకుల వీథి యందలి తనగృహమునకుఁ బోయి, గుడ్డలఁ దీసికొని పిదపఁ

దిరిగి కన్నకికడకుఁ బోవలయునని యాతఁడు నిశ్చయించు కొనెను.

ఆతఁ డిఁక లేచి కోవెల వీడి యింటికేగెను. అప్పు డచట వసంతమాల యాతనికొఱకు వేచియుండెను. మాధవికడనుండి యాచేటిక యాతని కొకలేఖను గొనివచ్చెను. ఆజాబు జేగుఱు లక్కతోడను, అగరుతోడను బూయఁబడి మల్లె, మొల్ల, చేమంతి, చంపక, మాధవి మున్నగు కుసుమములతోఁ గూర్పఁ బడినహారమున ముడువఁబడి యుండినది. ఆజా బిది.

'వసంతుఁడు యువకప్రభువు గనుక ప్రమాదపడుట సహజము. సంజవేళ చంద్రోదయమప్పు డాతఁడే కాముకీ కాముకులఁ గూర్చుచుండును. ఇంతకు నా సుధాకరుఁడు కూడఁ గళంకరహితుఁడు కాఁడు. కాన నజ్ఞానవశమున మోహితు లొకవేళఁ బ్రమాద మొనరించిన, నది యొక నేరమా ? ఇందుఁ జిత్ర మేమున్నది ? అది యొక నేరమని యెంచి యా కాముకు లను వియోగవ్యథతో నీరీతిగా శిక్షించుట పాడియా ? మోహితులు జతకూడి యుండునపుడు చంద్రకిరణము లతి శీతలములై యుండియు, ఒండొరుల బాసినపు డవియే వేడి యగు వాడి ములుకులై వారి నతితీవ్రముగ బాధించు చుండును. అంతకన్న వారికి మఱేమి శిక్ష కావలయును ?"

వసంతమాల చేతులతోఁ బట్టుకొనియుండఁ, గోవల నాజాబును జదివెను. ఆతఁ డాజాబు నర్థముచేసికొనుట కంతగాఁ బ్రయత్నింపలేదు. "నీచెలి మాయలాడి. నీచెలి కెని మిదివిధములగు నభినయము లతిచక్కగాఁ దెలియును. విరహ వేదనఁగ్రాగు వనితామణికన్న మిన్నగా, బాష్పవారి నిండ మిల

మిలలాడు నయనములనుండి వలపుచూపులఁ బ్రకటించు 'కన్ కూడువారి'; ఱాలను సైతము కరగించు సుధారసమును జిందు చిఱునగవుతో 'కన్వారి'; హంసతీవి, నెమిలినడక, చిలుకపలుకులు, వీనితో 'ఉల్వారి'; అట్టె తమి మీఱ నక్కన నొక్కకోవలయునని చూపఱ కుద్రేక మొదవంజేయునట్లు నడుమును వంచు 'పూరవారి': అరచాటై తొంగి చూచుచు గమనించువారి నానందోన్మత్తులఁ జేయు గబ్బిగుబ్బలతో, మెత్తనికురులతో 'కిలర్వారి'; తన ప్రియుఁడ నగు నేను చెంతనుండునపుడు కూడ విరహవేదన నతినైపుణ్యమునఁ బ్రకటించు 'తర్కివారి'; ఝుంకార మొనరించు భృంగములు వాలియుండు కుసుమదామమును ధరించి తనవేదనను బ్రేక్షకులకు నచ్చునట్లుచేయు 'కట్కివారి'; ఇచ్చవచ్చినట్లు విటుఁడు పోగా విటుని గామించి, ప్రేమపరవశయై మూర్ఛ జెందినపు డావిటులు వంతులు ప్రకార మూ వగలాడిని సేదఁ దీర్చి తనియింపఁ జేయు 'ఎడుత్తుకోల్‌వారి'—వీని నతిరమ్యముగా నటింపఁ గలదు. వసంతమాలా! తెలిసినదా? ఈయభినయములన్నియు మీచెలికి నైజములు; నటనమాత్రము గాదు. మీచెలి నెఱజాణ; మీచెలి జిత్తులమారి; మీచెలి వంచకురాలు. ఎట్లుచూచినను మాధవి భోగముపడుచే కదా!" అని కోవలన్ కడుపులోనిదెల్ల వెడలఁ గ్రక్కెను.

వసంతమాల మాధవికడకుఁ దిరిగి పోయి సవిస్తరముగ నంతయు నెఱింగించెను. మాధవి కలఁతపడలేదు. పైగా విలువ కూడ నీయలేదు. "వచ్చి పోయిన ప్రణయకలహములలో నిదియు నొకటి. ఈరేయి రాకున్న రేపుప్రొద్దుననైన నాతఁడు

రాకపోఁడు. మనము చూడకపోము.” అని మాధవి వసంత మాల నంపివైచెను. కాని యెంతగా సమాధానపడినను, ఆ వారకాంతమనస్సు నిలువలేదు. సువాసనల వెదఁజల్లు పూఁ బాన్పుపై నా మందయాన దుర్భరదుఃఖమునఁ బొరగిలఁబడి యేడువసాగెను. ఆమె కారాత్రి నిదుర యెట్టిదో తెలియదు. జంటఁబాసిన చక్రవాకివలె నామోహనాంగి చిన్నవోయి యుండెను.

నాఁటి సాయంకాలమే దేవాండి తనస్నేహితురాలగు కన్నకివద్దకుఁ బోయెను. పురికి బాహ్యప్రదేశమునఁ గల శష్ఠదేవాలయమునందు దేవాండి పూజరియై యుండెను. ఆమె చారిత్రము విచిత్రమైనది. కపిగోత్రసంజాతయగు మాలతి యను బ్రాహ్మణి యొకప్పు డుండెడిది. ఆమెకు బిడ్డ పుట్టి చచ్చినది. అంత మాలతి బిడ్డలపై మరులుతో సవతిబిడ్డను దనబిడ్డగాఁ బెంచుకొనుచుండినది. ఒకనాఁ డామె పాలిండ్ల బిడ్డ పాలు త్రాఁగుచుండఁగా, పొరపోయి వెక్కిళ్లుపుట్టి చనిపోయినది. మాలతికి తందఱ కలిగెను. సవతిబిడ్డయైనను ఎంతయో గారా బమునఁ దనబిడ్డయే యని పెంచుచుండియు, సవతిబిడ్డయని యీాసుతో సాకి చంపెననునేరమునకుఁ దాను గుఱియగాదు నని భయపడి, వెఱ్ఱెత్తినట్లు మాలతి యాశిశుశవము నెత్తుకొని, సూర్యచంద్రాలయములకు, కల్పతరువుచెంతకు, ఐరావతము కడకు, బలరామ, శివ, మురుగ, ఇంద్ర, శాతవాహన, జిన దేవాలయములకుఁ బోయి మృతబాలుని సజీవునిగాఁ జేసి తన్ను శోకవారాంబునిధి గట్టెక్కించి రక్షింప నాదేవతలఁ బ్రార్థించెను. కాని యెవ్వరును బలుకరైరి. అంత నాయభాగిని శష్ఠ

దేవాలయమునకుఁ బోయినది. అచట నామె కొక రమణి కన్పించి "తపోధనములేని నీయట్టి సామాన్యకు దేవుఁ డెవ్వఁడును వరమీయఁడు. కాబట్టి యీపీనుఁగును నాకిమ్ము" అని మృతకళేబరమును లాగుకొని మరుభూమియగు 'చక్రవాళకోట్టము'నకుఁ బోయెను. శోకార్తయగు మాలతి యామెను వెంబడించెను. అచట స్మశానవాసి యగు ఢాకినీపిశాచ మాశిశుశవమును బీకికొని మ్రింగివేసెను. దానిఁ గాంచి మాలతి గుండె పగులునట్లు, దిక్కులు పిక్కటిల్లునట్లు విలపించెను. ఆమె యాక్రందనములకు శస్తదేవునిహృదయము కరఁగెను. ఆదేవుఁ డామెకుఁ బొడఁగట్టి "ఓ కోమలీ! విచారింపకుము. ఇదిగో నీబిడ్డ సజీవుఁడై నాఁడు చూడుము" అని యనుగ్రహించి యంతర్ధానుఁడై, శిశురూపమును దాల్చెను. మాలతి యానందాంతరంగయై యానిసువు నెత్తుకొని తిరిగి తీసికొని పోయి యాబిడ్డ సొంతతల్లి కిచ్చెను. ఆతల్లి కాబిడ్డయం దెట్టి వ్యత్యాసము గన్పించలేదు. ఈ దివ్యశిశువు పెరిగి పెద్దదై దేవాండిని పెండ్లియాడెను. ఆతఁ డామెతోఁ గొంతకాలముండి, దేవరహస్యమును బయటవేసి, శస్తదేవాలయమందలి విగ్రహములోనికి విలీనుఁ డగుచు "ఈవిగ్రహమును శ్రద్ధాభక్తులతోఁ బూజించుచుండుము. అడిగినవారికి నీభర్త కాశీమున్నగు దివ్యక్షేత్రములకు యాత్ర పోయియున్నాఁడని చెప్పుచుండు మ"నెను.

దేవాండి యట్లే చేసినది. ఒకానొకసమయమున నామె కన్నకిఁ జూచుట తటస్థించెను. ఆమెమానస మప్పుడు కన్నకియందు లగ్నమయ్యెను. కన్నకిఁ గూర్చి దేవాండి మనస్సులో

"నేను దేవునిఁ బెండ్లియాడిన యతివను; కన్నకి మానవ్వు నుద్వాహ మొనరించుకొనిన దివ్యాంగన" అని యనుకొను చుండెడిది. కన్నకి పదు నగచాట్లు నాలకించి యామె వా పోయెను. ఇంద్రోత్సవము కడపటిరో జామె ప్రత్యేక ముగా శష్ఠదేవుని బూజించి; ఆరగింపఁజేసిన పదార్థములను గొని కన్నకికడకుఁ బోయి, "అమ్మా! నీపతి మరల నిన్నుఁ జేరుఁ గాక!" అని దీవించెను.

కన్నకి యాదీవన విని "సరి, నాకాతఁడు మరల దక్కుఁ డనుకో! అప్పు డేమి సంభవించునో నాకుఁ దెలియకున్నది. నా హృదయసారసము సంశయవీచికల నూగులాడుచున్నది. ఓ దేవాండీ! నాకొక పాడుకల వచ్చినది. నా ప్రియుఁడును నేనును చేతులుచేతులు కలుపుకొని యొక మహానగరమునకుఁ బోయితిమి. అచట నెవ్వరో నాపతిపై లేనిపోని నేరముల మోపిరి. అది తెలిసి నాకు వేయితేళ్లు కుట్టినటు లయ్యెను. అంత నేను ప్రభుసమక్షమునకుఁ బోయి నిర్దోషియగు నాప్రాణే శ్వరుని శిక్షించుట అన్యాయమని తెలియఁ జెప్పుకొంటిని. కాని యాతఁడు వినలేదు. దానికి ఫలముగా రాజు, రాజధాని ఘోరవిపదనలమునకు గురియయ్యెను. అంత నేను, నా విభుఁడు—నవ్వుదువేల?—ఎన్నఁ ఎన్నఁ డాశింపని బ్రహ్మానంద మొందితిమి" అని నుడివెను.

"అమ్మా! నీపతి నిన్నొక్కమారుగా విడిచిపెట్టలేదు. అతఁడు తప్పక నిన్నుఁ జేరును. పూర్వజన్మమున నీవొక మ్రొక్కు చెల్లింపమిం జేసి నీకీకష్టములు కలిగినవి. కావేరీనదీ ముఖద్వారమున నుండు సోమసూర్యకుండములందు నీవు

క్రుంగులిడుదువేని, ముక్కున నూర్పుండుదనుక నీవు నీప్రియు నెడబాయకుండుటయే గాక, పుణ్యము నార్జించి దివి కేగఁ గలవు. ఒకనాఁడు మన మాకుండములకుఁ బోయి స్నాన మొన రింతము" అని దేవాండి సూచించెను.

కన్నకి యంతయు విని "వల్లపడదు. అది ధర్మము కాదు. నాపతి వినా నాకు దేవుఁడు లేఁడు. కాబట్టి నాభర్తను గలియుభాగ్యముకొఱకు నేనెవరిని బ్రార్థింపఁ గలను! దైవమే యగుఁ గాక ; కాక పోవుఁ గాక, మఱొకరికి దాసోహమ్మనుట నా కిష్టము లేదు." అని ఖండితముగాఁ బలికెను.

దేవాండి వెళ్లిపోయినది.

కొన్నాళ్లిట్లే గడచినవి. సంతతము కన్నకి కోవలన్ పై ధ్యానముతో నుండినది. పతిసందర్శనోత్సుక్యమున నామె యాకసమునకు నిచ్చెనవైచి యెక్కుటయే తడవుగా, నాపాదు కల యడ్డుగా నిలిచి యాసాధ్విని క్రిందికిఁ ద్రోయుచుండెడిది. ఆమెకు గుండె దడపుట్టినది ; ఒళ్లంతయు ముచ్చెమటలు పోసి నది. ఆమె తనూవల్లరి సంతాపానిలమున వణకసాగినది. ఇ ట్లాయువిద యింటియందు క్లేశఖిన్నయై కూర్చుండియుండ వాకిలితలుపు తట్టినశబ్ద మయ్యెను. వెంటనే యామె లేచి పోయి తలుపు తెఱచెను. ఎదుటఁ గోవలన్ నిలువఁబడి యున్నాఁడు. ఆతఁడు రూపొందిన శోకరసాధిదేవతవలె నున్నాఁడు. కన్నకి యాతనిఁ గాంచి యట్లే నిట్టనిలువున మొదలు తఱిగిన కదళీకంబమురీతి యాతని చరణముల వ్రాలి యశ్రుజలముల వాని నభిషేకించెను. పూర్వమందలి రమణీయ రూపమున కిది ఛాయయో యనఁ గృశించిన శరీరముతోఁ,

జిరిగి మాసినచీరతో దీనాతిదీనరై నుసిగప్పిన నిప్పువలెనుండు కన్నకిం గాంచి కోవలఁ గుండె ప్రీలినది. ఆతని నేత్రగోళముల నీరు నిండి కపోలములం గారుచుండినవి. ఆమె నాతఁడు చేరం దీసికొని బ్రోమ్మున కదుముకొని "మసి పూసి మారేడుకాయం జేసి కన్నుల దుమ్ముకొట్టు గణికాంగనపొత్తు జేసితిని. నాపిత్రార్జితమగు నాస్తిని, నీకుం గలసొత్తును బోఁగొట్టుకొంటిని. కడకుఁ బరిభవమే నాకు ఫలితమైనది" అని పలికెను.

జొటజొట నీరుగారుకన్నుల నాకలికి తుడుచుకొనుచు, వాతెఱపై మందహాస రోచు లుదయింప విభునిఁ గాంచి "దుఃఖింపకుఁడు. నాకాలియందియ లమూల్యమైనవి. వానిఁ దీసికొని విక్రయింపుఁడు. మరల మీకు లక్ష్మీకటాక్షము కలిగి సంఘగౌరవము చేకూరును" అని యనునయాలాపము లాడెను.

ఆమానవతి యౌదార్యము నెఱింగి కోవలఁ సిగ్గు పడెను. ఆనాతి భుజస్కంధముపై మోము వాల్చి యాతఁడు చంటిబిడ్డవలె వెక్కి వెక్కి యేడవసాగెను. గద్గదికతో నా వణిక్కుమారుఁడు "ప్రేయసీ! నాభావ మది కాదు. నా కట్టి కోరిక లేదు. నేనా వారనారిని, నా యనుచిత జీవితపథము నొక్కమారుగా విడిచి బాగుపడనెంచి యున్నాను. నీవే నాకు గతి; నీవు తప్ప మఱి యన్యము నాకు లేదు. కన్నకీ! క్షమాగుణమున నీవు భూదేవివి, నీడనిచ్చి శ్రమ నపనయింపఁ జేసియుఁ దన్నునఱుకు నరునియెడ నౌదార్యమును జూపు పాదపరాజమువంటిదానవు నీవు" అనెను.

అట్లా దంపతు లెంత యో కాల మన్యోన్యాలింగనముచఁ జిక్కి పరవశులై యుండిరి. ఉరము లదరి కలియ వెక్కివెక్కి యేడ్చుచుండిరి. పశ్చాత్తాపవహ్ని కోవలకాను బునీతు నొన రించినది. భర్తృసందర్శనమునఁ గన్నకి యానందము చెప్ప నలవి కాకుండెను.

కోవలన్ తెలివొంది "తలుపు తీసియున్నది. పూయు మందువా ?" అనెను.

హృదయాకాశమునందలి సంతోషకాంతులు మంద హాసమున వెలువడుచున్నవో యన, కన్నకి లేనవ్వుఁ బ్రక టించుచు, నాతనిపలుకుల కామోదముఁ జూపక "వలదు. జీవితేశ్వరా! ఈవిశాలవిశ్వమంతయు మన పునస్సమాగమ మహోత్సవమును జూచి యానందింపవలసి యున్నది. మనమిఁక మన జీవతంతువులను జాఱవిడిచినచోటినుండి బీజారుటకు మొదలిడుదము" అనెను.

కోవలన్:—ఇచటఁ గాదు. ఈపురమున నాకుఁ బరాభవమైనది; అగౌరవమునకుఁ బాలైతిని. చిల్లగవ్వకుఁ గూడ గొఱమాలి పెద్దమ్మకోఱలకుఁ జిక్కి పరితపించితిని. కాన సీనగరమున నిఁక నొకక్షణమైన నిలువఁజాలను. నన్నుఁ గాని, నాకైన పరిభవముగాని మధురయం దెవ్వరికినిఁ దెలియదు. కావున నేనాపట్టణమునకుఁ బోయి తిరిగి వ్యాపార మొనరించి ధనాధికుఁడనై మరలి వచ్చెదను. కాని, వర్తకమునకుఁ బెట్టుబడి యెట్లో తెలియకున్నది. కాలక్రమమున నెట్టులో యొకట్టుల మూలధనమును చెల్లింపఁగలను.

కన్నకి:—అందుల కింత చింత యేల? నాకాలికి రెండు అందె లున్నవి. ఇవి యమూల్యము లైనవి. వీనిని విక్రయించినచో, మీకు పెద్దమొత్తము లభించును.

కోవలన్:—ఇప్పటికైన నీకు మిగిలియుండు నగల నమ్ముట నా కిష్టము లేదు. నాకాళ్లపై నేను నిలువవలయు నని నాకోరిక.

కన్నకి:—ఇదియా సంగతి! నాకడకు మీరు వచ్చుటయు, నన్ను మన్నించుటయు యోచించి చూడ, మీకుఁ గాదని సొమ్ములను నిలువచేసికొని యుంటినని నన్ను దెప్పుటకని యిపుడు తెలిసినది.

ఆమెకన్నులనుండి బాష్పధార చెక్కిళ్లపైఁ జాఱెను.

కోవలన్ మానసము వ్యాకుల మయ్యెను. ఆమెయెడఁ దాను మహాపరాధ మొనరించిన ట్లాతఁడు భావించెను. చేలాంచలమున నాతఁ డాకోమలి కన్నుల నద్దుచు "కన్నకీ! నా కన్నకీ! ఏడువకుము. నీయిష్టమువచ్చినట్లే చేయుదును" అని కపోలములను ముద్దులతోఁ దుడిచి "తెలియును గదా! నేను మధురకుఁ బోవలయును. నీసెలవు కావలసి యున్నది. ఏడాదిలోఁగాఁ దిరిగివత్తును" అని చెప్పెను.

ఆమాటల కామె యడ్డముగాఁ దలనూపుచు "ఇఁక మీఁద మిమ్ము బాసి నేనొకక్షణమైన నుండఁజాలను. నేనును మీవెంట వత్తును" అనెను.

"ప్రాణకాంతా! నీకు నడచుట కలవాటు లేదు. చాల దూరము పోవలసియున్నది సుమా! మార్గమధ్యమున గుట్టలు నడుమున్నవి. ఘోరమృగముల కునికిపట్టగు నరణ్యములు, అడవిమనుష్యుల కావాసమగు వనములు, ముండ్లపొదలు నిండిన కాననములు దారి కడ్డుతగులు చుండును" అని కోవలన్ నచ్చం జెప్పెను.

కాని యాకాంత వినలేదు. "రానుండు కష్టములను, అపాయములను నాకుం జెప్పం బనిలేదు. ఏమైనం గానిండు. నేను మీతో రాక తప్పదు" అని యాకాంత ఖండితముగాం బలికెను.

"అయిన మన మీరాత్రియే చంద్రాస్తమయమై ప్రొద్దు పొడువకముందే, ఎవ్వరికంటం బడకుండునట్లు, బయలుదేరుదము" అని కోవలన్ జెప్పెను.

# తొమ్మిదవప్రకరణము

## దక్షిణమునకుఁ బ్రయాణము

రాత్రి నాల్గవఝాము జరుగుచున్నది. అంధకార మెల్ల కడల నలముకొని యుండెను. అప్పుడు కోవలన్ కన్నకీలు బయటిద్వారమును దాటిపోయిరి. ఆవాకిలి చాల యెత్తయినది. దాని గడియను దీయ మరల దానియంతట నదియే పడుచుండును. ఆకవాటముచుట్టు మేషము, చమరము, హంస—వీని బొమ్మలు చెక్కఁబడి యున్నవి. మార్గమధ్యమునం గల శివ కేశవాలయములకు వారు ప్రదక్షిణించి, బుద్ధ విహారసప్తకముమీఁదుగాఁ బోయి, శాఖాపంచకసంశోభితమును, మహోన్నతము నగు బోధివృక్షము చెంతకేగి కేల్మోడ్చి హృదయపూర్వకముగఁ బ్రార్థించిరి. అంత నాదంపతు లశోకపాదపసంశోభితమగు జైనదేవాలయమునకుఁ బోయి ప్రశాంతమానసమున ధ్యానించిరి. వారంత సింహద్వారమునుండి చనిరి. అఖాతమగు నగడ్త దానిఁ జుట్టియున్నది. దానిని మఱియొకకుడ్యమావరించి యున్నది. దానిఁ జుట్టి యొకసరోవర మలరారుచుండును. ఆ సరస్తీరమున ఫలపుష్పసంవాసితమగు నుద్యానవనములును, రాజోద్యానమును గలవు.

వారల్లే విశాలమగు మార్గమును దాటిపోయిరి. ఆ మార్గమున కిరువైపులఁ దరువులు శ్రేణిగా నిలిచి విపుల ఛాయలను బ్రసరించుచుండెను. ఆదారి తిన్నగా కావేరీ

స్నానఘట్టమునకుఁ బోవుచుండెను. పశ్చిమాభిముఖులై వా రట్లు కావేరీకూలముననే చని నవ్యకుసుమాభిరామమగు నారామమును జేరిరి. అచట జైనయోగిని యగు కావుండి నివసించు చుండెను. పాపము, సుకుమారి యగు కన్నకి యెన్నడు నడచినది కానందున నలసిపోయెను. "మధుర యెంత దూరము ?" అని యామె భర్త నడిగెను.

"ఎంతయో దూరము లేదు. రమారమి యిరువదికోసు లుండవచ్చును" అని యాతఁడు చెప్పెను.

వా రిరువురును తపస్విని కడకుఁ బోయి నమస్కరించిరి. కావుండి వారలఁ గన్నార్పక చూచి "మీరు కులీనులుగా నున్నారు. దూరప్రయాణముల కలవాటున్న వారుగాఁ గన్పట్టుట లేదు. అట్టియెడ నింతకష్టముతో మీరు తిరుగుటకుఁ గారణ మేమి ?" అని ప్రశ్నించెను.

అందులకుఁ గోవలన్ "ఏదియో యొక బ్రతుకుఁ దెరువునకై మధురకుఁ బోనెంచి యున్నాము" అని విన్నవించెను.

కావుండి:—దారి పొడుగుననుండు సూదిమొనలవంటి రాళ్ల కీకోమలి మృదుపదములు తాళఁ గలవా ? కాని, నే నెంతచెప్పి యేమి ప్రయోజన ముండును ? నీవుగాని, నీపత్ని యీమె గాని నా యుపదేశముల నాలకింపరని నాకుఁ దెలియును. ఇప్పటికే మీరు పయనము సాగించుచున్నారు గదా ! నేను గూడ 'అరివన్' (హయగ్రీవుఁడు) దేవునర్చించి, మహానుభావులగు జైనమునీశ్వరుల ధర్మబోధామృతమును గ్రోలి, అధర్మమునుండి దప్పుకొనుటకు మధురానగరరాజమునకుఁ

బోవలయునని కుతూహల మొందుచున్నాను. మనమందఱ మొకటిగాఁ బోదము.

కోవలన్:—అంతకంటె సంతోష మేమి కలదు ? ఈ మగువ దిగులు కూడ నాకుఁ దీరును.

కావుండి వారలఁ గాంచి "ఏమార్గమునఁ బోవుదమని నిర్ణయించుట మనకుఁ గొంచెము కష్టము. చుఱచుఱలాడు మండుటెండ కీకోమలాంగి తాళఁజాలదేమో యని, అడవి గుండా, పనసతోపులద్వారా, అల్లము పసుపు పొలముల మీఁదుగా, చల్లని కాలిబాటలఁ బైనమొనరింత మనిన, వన్య మృగములఁ బట్టునిమిత్తము వేఁటగాండ్రు పన్నియుండువల లను గుంటలను మనము తప్పుకొని మిక్కిలి మెలఁకువతోఁ బోవలసి యుండును. చెట్లక్రిందఁ బోవునపుడు సామాన్య ముగఁ బనసపండ్లు మనతలపైఁ బడుచుండును. ఈయపాయము లకు జంకి మనము పొలములగుండా పల్లపు భూముల మీఁదుగాఁ బోవచ్చుననిన, దారిపొడుగునఁ బొరాడుచుండు నీళ్లపాములను, పీతలను, జూచి యీబిత్తరి భయపడును. మనము కూడ నచ్చటచ్చట బురుగులను మఱియితర కీటకము లను నలగఁద్రొక్కి యూపిరి తీయుదుము. అట్లని, వేఱుదారి లేదు. ఈకష్టములను దప్పుకొనుటకై మనము ముందుజాగ్రత పడుట మంచిది" అని చెప్పి భిక్షాపాత్రను, కళపాలను, నెమిలి పింఛమును దీసికొని, జైనఋషిపంచకవర్గములగు అర్హంతులను, సిద్ధులను, ఆచార్యులను, ఉపాధ్యాయులను, సాధువులను బ్రార్థించి, కోవలన్ కన్నకిలతోఁ బ్రయాణ మయ్యెను,

వారు కావేరీకూలముననే పోసాగిరి పొలముసాగుకు రైతులు, పంటకాలువలనుండి నేరుగాను, మోటబావుల తోడను, ఏతాముతోడను, తాటాకుబుట్టలతోడను,—ఇట్లు పలువిధములుగా నీరుపెట్టుటను వారు గాంచిరి. జీవనదియగు కావేరీజలములు నిలువగ్గాఁ కారికాళరాజేంద్రుఁడు నిర్మించిన అనకట్ట తూములనుండి పంటకాలువలలో నంతటఁ బాఱు చుండ సాగగు వరిపొలములను, అరఁటి చెఱకుతోఁటలను వారు చూపుపాఱువఱకుఁ గాంచుచు సాగుచుండిరి. గుంపులు కట్టియుండు నీటిపక్షులు, కొంగలు, బాతులు, లకుముకులు, కాకులు, ఎండ్రలు, చేఁపలు, నీళ్లపాములు, పురిడిపిట్టలు, చిలు కలు—ఇవి యా బాటసారుల కంతటఁ గాననగుచుండినవి. సాగుకాని చేలయందలి యడుసులోఁ బొర్లాడి, బురదనిండిన యొంటితో నిప్పుకణికలవంటి కండ్లతోఁ దిరుగు దున్నపోతులు, దురద దీర్చుకొనుటకు వీపులను పొలములందలి వడ్లకుప్పలకు రుద్దుచుండెను. కండరములు మెలితిరిగిన చేతులతో బలిష్ఠులై యుండు కూలీలును, రైతులును సేద్యము చేయుచుండుటను వారు గాంచిరి. అచటచటఁ బొలములలోఁ గలుపుదీయు పడు చులు బూతుమాటలతో నెగతాళి చేసికొనుచు మట్టిముద్దల నొండొరులను రువ్వుకొనుచుఁ బకపక నవ్వుచుండిరి. కృషీ వలులు నిశ్చింతతో హాయిగఁ బాటలఁ బాడుచు మళ్లు దున్ను చుండిరి. కొన్నిచోట్ల వడ్లునురుచుచుఁ గొందఱు గ్రామ్యగీత ములఁ బాడుచుండిరి.

కావుండి తనయనుచరుల కీకృషీకులఁ జూపుచు "ఇచ్చ వచ్చిన స్లైచ్ఛలెచ్చట సంచరించినను, కడకు మనుజులు కూటి

కొఱకు అరకపట్టక విధిలేదు. ఎవరేమన్నను, కృషియే ముఖ్యమైన పరిశ్రమ. 'కృషితో నాస్తి దుర్భిక్షమ్'అన వింటిరి గదా! సంఘయంత్రమునకు రైతులు కీలకమువంటివారు; వారు లేకున్న సంఘచక్రము తిరుగక యాగిపోవును. వారే స్వేచ్ఛాజీవులు; మిగిలినవారంద ఱొకరిపై నొక రాధారపడి యుందురు. కూటికొఱ కొకరిని యాచించుట కవసరము లేనివారు రైతులే సరిగదా, యాచకుల నొక్కక్షణములో వారు పరితృప్తులఁ జేయఁగలరు. చేతులుకట్టుకొని కాఁపులు కూర్చుండినచో, ఆశలుడిగిన అయ్యలు గూడ అగచాట్లు పడవలసి వచ్చును. అట్లయ్యును, మనకందఱకుఁ గూడు పెట్టి కాపాడు కర్షకునికాయము, కష్టములకు శ్రమలకుమాత్రము పట్టుకొమ్మయై యున్నది"అని చెప్పెను. వివేకచోదితములగు నామాటల నతిశ్రద్ధతోఁ గోవలఁగా కన్నకీలు వినుచుండిరి.

అంత వా రున్నతములును, సుందరములు నగు గృహములతో శోభిల్లు గ్రామములు దాటిపోయిరి. ఆగ్రామములందు వైదికులు నివసించుచుండిరి. వారి నిత్యాగ్నిహోత్రములనుండి ధూమము లేచి యింటికప్పులపై మబ్బుకట్టి హిమాచ్ఛాదితములగు పర్వతములఁ దలపించుచుండెను.

"హోమాగ్ని గుండములనుండి పైకెగిసి, అట్టె మేఘాకృతినందు పొగను జూడఁగా నీబ్రాహ్మణులు క్రతువులొనరించి వర్షములఁ గురిపించుటలో నాశ్చర్యమేమున్నది?" అని కావుండి యనెను.

వా రట్లు కాలు సాగించుచుఁ గళకళలాడు పురాతన గ్రామములను, కేవలము కృషీవలులకు మాత్రము నిలయము

లగువానిని గాంచుచుండిరి. అచటఁ బొయ్యిలమీఁదఁ జెఱకు రసము క్రాఁగుచుండుటచే గనగనమని మంటలు మండుచుం డెను. వడ్లకుప్ప లంతటఁ జిన్నగుట్టలవలెఁ గానఁగుచుండెను.

దినమున కొక కోసెడుకంటె నెక్కువగా వారు పయన మొనరింపలేదు. ఎన్నియో నాళ్లిట్లు పోయి వారు శ్రీరంగము చేరిరి. అచట నగరము కావేరీనదిని మెఱుఁగు చేయుచుండెను. వారికడకొక జైనముని వచ్చెను. కావుండి తన సహచరులతో నాయతిగ్రామణి పదముల కెఱఁగి "మా పాపము లన్నియు తొలఁగించుము గాక!" అనెను. ఆజైనముని వారిగమ్యస్థానము నడిగి తెలిసికొనెను. మధురయందుఁ గోవలన్ కన్నకిలకుఁ బట్టు నుండుగతి త్రికాలవేది యగు నా మహాత్మునకుఁ దెలిసియు, సకలబంధములను ద్రెంచి యరిషడ్వర్గమును జయించిన యోగి పుంగవుఁ డగుటం జేసియు, ద్వంద్వాతీతుఁడగు మహాజ్ఞాని యగుటం జేసియు, వారి నాతఁ డేమాత్రము నిరుత్సాహ పఱుపలేదు. కడకుఁ బయనమును విరమింపుఁడను సూచననైనఁ జేయలేదు. ఆమహాత్ముఁడు కావుండితో "ఓ తపస్వినీ! కర్మశాస నములు నిర్దయాత్మకములు. ఒకరిబోధలవలనఁ గాని; ప్రయ త్నములవలనఁ గాని కర్మఫలములగు కష్టసుఖానుభవములు తప్పనే తప్పవు. చల్లినగింజలవోలె నవి మొనలెత్తి చిగురించు చుండును. వేపవిత్తునుండి వేపచెట్టు మొలచునట్లు దుశ్చేష్టలు దుష్ఫలములకు మూలము లగును; అశోకబీజమున నశోక వృక్షము మొలచునట్లు సత్కార్యములు సత్ఫలములకుఁ గార ణము లగును. పోడుగాలియందలి సెమ్మెదీపమువలె జీవిత

మంతలో నాఱిపోవును. కాబట్టి బ్రహ్మజ్ఞానమును సేకరించి, సత్ఫలముల సముపార్జించి, దేహపంజరమునుండి తప్పించుకొనుటకుఁ బ్రయత్నింపుము" అని బోధించెను.

అందులకుఁ గావుండి "అరివర్గ దేవున కొక్కనికిఁ దప్ప నే నెవ్వరికి నమస్కరింపను. మఱి సత్యప్రవక్త కొక్కనికిఁ దప్ప భక్తితో నేను వేఱొకనికిఁ జేమోడ్చను. పూలనడుచు దేవుని సుకుమారచరణకుసుమములఁ దప్ప నాశిర మితరపుష్పములను భరింపఁ జాలదు" అని విన్నవించెను. ఆయతీశ్వరుం డది విని "జననమరణకారణమగు నీబంధము వదలుఁ గాక" అని దీవించి వెడలిపోయెను.

కావుండి తనయనుచరు లిరువురతో నొకపడవపైఁ గావేరీ నదిని దాటి దక్షిణకూలమును జేరి రమణీయారామపరివృతమగు సుందర దేవాలయమును గాంచెను. పరిమళముల గుబాళించు పుష్పములమధ్య రతీకాములరీతి కన్నకీకోవలన్ లించుక సేపు విహరించిరి. అప్పుడే కలుసుకొనిన యభిసారికను లాగుకొని యచటఁ గాలము గడుపవచ్చిన వ్యభిచారి యొకఁడు వారల నచటఁ గాంచి "వారు రతీమన్మథులా?" అని కావుండిని హేళనపూర్వకముగా నడిగెను.

అందుకుఁ గావుండి "వారు దేవతలు కారు. నాబిడ్డలు. నీ కాజోలి యేల? నీదారిఁ బొమ్ము" అని మందలించెను. కామాంధులగు నాస్త్రీ పురుషులహృదయముల కాపరుషోక్తులు కత్తికోఁత లయ్యెను. ఆకాముకులు మదాతిరేకమునఁ గావుండిఁ జూచి "ఓ తాపసురాలా! తమ రెఱుంగని ధర్మశాస్త్రములు

లేవుగదా ! ఒక్కనికే పుట్టినబిడ్డలు దంపతులగుట మీ రెచట నైనఁ గంటిరా ? వింటిరా?" అని వికావిక నవ్విరి. కన్నకి యా తులువకూఁతలకుఁ జెవులు మూసికొనెను. కావుండి కుపితయై "అధములగు మీరిద్దఱు ముసలినక్కలై పరిసరకంటకారణ్యములఁ దిరుగుచుందురు గాక!" అని శపించెను. అదియే తడవుగా నా జారుఁడును ఆతని యుంపుడుకత్తెయు మఱుగైరి. వెంటనే రెండు వృద్ధజంబుకము లడవియందుఁ గూఁతలు పెట్టుచుండుటఁ గననయ్యెను.

ఈ చిత్రమంతటిని కోవలఞ్ కన్నకిలు గాంచుచుండిరి. వారివిస్మయము చెప్పఁ దరము గాకుండెను. "ఓ మహానుభావురాలా ! అజ్ఞానము వారిప్రమాదమునకుఁ గారణము గాన వారిని మన్నించి యుండఁ గూఁడదా ? వారికి శాపవిముక్తి కలుగు టెపుడు?" అని వా రామె నడిగిరి. 'ఉరేయూర్ కోట గోడ కావలఁగల యడవితలయందు పండ్రెండుమాసముల పిదప వారికి శాపమోక్ష మగును" అని కావుండి యనుగ్రహించెను.

వారు ముప్వురు 'ఉరేయూర్'కు పోయిరి. దానికి 'వారణము' అనియుఁ బేరు కలదు.

"సనాతనమగు నీ పట్టణమునకు 'వారణము' అను పే రేల వచ్చెనో మీకుఁ దెలియునా?" అని కావుండి వారల నడిగెను.

"తెలియదు. దయచేసి సెలవిమ్ము" అని కోవలఞ్ కన్నకిలామె నడిగిరి.

"శోకోపహతయగు నొకపక్షి తనదుఃఖమునకుఁ గారణమగు గజము నొకదాని నిచటఁ జంపినది" అని కావుండి చెప్పెను.

"ఆశ్చర్యము! ఆకథను మాకుఁ జెప్పుము" అని కోవలఁ కన్నకిలు ప్రార్థించిరి.

కావుండి చెప్పసాగెను. "పూర్వ మిదియొక యడవి. అచట నొక పెద్దచెట్టుపైఁ బిచ్చుక జంట నివసించుచుండెను. ఆడపిచ్చుక యప్పుడే గ్రుడ్లు పెట్టినది. మఱునాఁ డొకయేనుఁగు మట్టమధ్యాహ్నసమయమున నాదారిఁ బోవుచు మిడియెండ వేడిమికిఁదాళఁజాలక యాచెట్టునీడకు వచ్చి నిలిచెను. ఆవారణ మంతతో నిలిచియుండక, కావలయునని పోకిరితనమునకు గాను పిచ్చుకదంపతులు వలదని యెంత బతిమాలుచున్నను వెడచెవిఁ బెట్టి, పిచ్చుకలు గూడుకట్టియుండుకొమ్మను తొండముతోఁ బట్టుకొని చెట్టునుండి విఱిచివైచెను. పిచ్చికగ్రుడ్లన్నియుఁ గ్రిందఁబడి ముక్కలుముక్క లయ్యెను. కానియెట్లో పక్షులు మాత్రము తప్పించుకొనఁ గలిగినవి. పాపము, గ్రుడ్లు పోయినందులకుఁ దల్లిపక్షి దుఃఖము దురంతమై యుండెను. పెన్నిధిఁ గోల్పోయిన ట్లాపిచ్చుక మిథునము పరితపించుచుండెను. అవి తమమిత్రులగు వడ్రంగిపిట్ట, తేనెటీఁగ, మండూకముకడకుఁ బోయి తమశోకకారణమును జెప్పి సాయ మపేక్షించెను. ఐదుగురు కలిసి యోచించిరి. కఠినాత్ములై గ్రుడ్ల నట్లు నాశ మొనరించిన వారణమునకు మరణముఁ గలి

గించుట కొకపన్నాగమును బన్నిరి. భృంగము మత్తేభము కన్నులపై ఝుంకార మొనరించుచు నెగురసాగెను. తేనెటీఁగ తనకంటిని బొడుచునని భయపడి దంతి కన్నులు మూసి కొనెను. సమయ మచ్చినది కదా యని వడ్రంగిపిట్ట కరికంటి నొకదానిని జితుకఁ బొడిచెను. వేదన నోర్వఁజాలక వేదండము రెండవకంటిని మూసికొని వెఱ్ఱెత్తినట్లు కాలికొలఁది పరుగిడ సాగెను. అప్పుడా రెండవకంటిని గూడ వడ్రంగిపిట్ట పొడిచి లొట్టచేసెను. ఆ గ్రుడ్డియేనుఁగు బాధను భరింపఁజాలక కండ్లఁ గడుగుకొని మంటను బాపుకొనుటకై నీటమునుఁగ నాతుర మున దిక్కుతెన్ను తెలియక పరుగెత్త మొదలిడెను. ఆ దారి చాలయెత్తయిన కొండచఱియ; క్రింద లోతెఱుంగరాని లోయ పాతాళమునంటున ట్లుండెను. ఆలోయలో మండూకము చేరి యఱువసాగెను. కప్ప యఱచుచున్నది గనుక తప్పక యచట జలముండునని యాగజ మంతలోఁ దలంచి యాప్రక్కకుఁ బరుగెత్తెను. వెంటనే యది కొండచఱియనుండి క్రిందికి దొర్లి లోతగు లోయలోఁ బడి నుగ్గునుగ్గయ్యెను. పోకిరి దంతావళమువలనఁ గీడొందిన పతంగ మీప్రదేశమందే యా వారణమును జంపి పగఁ దీర్చుకొనినందున దీనికి 'వారణము' అనుపేరు కలిగినది. శిబివంశీయుఁడగు చోళరాజేంద్రుఁ డీస్థల పురాణమును విని 'బలహీనులకు బలవంతులవలని బాధను దప్పింపఁ దాను సంసిద్ధుఁడని ప్రకటించునిమిత్త మీప్రదేశ మును దనరాజధానిగాఁ జేసికొనెను.

ఈ కథను కోవల నతిశ్రద్ధతో నాలకించెను. ఆతఁడు కావుండికి దుఃఖమయమగు తనచారిత్రము నెఱింగించెను. అది విని కావుండి

"సౌఖ్యభూయిష్ఠమౌ చిత్తసైకతంబు
చిమ్మఁబడె పెద్ద సుడిగాలి బిట్టుదాకి:
కాన, నింద్రియహాయములఁ గట్టిపెట్టు
నీవు జీవితయరదంబు నిలుచుకొఱకు"

అని బోధించెను.

కోవలన్:—మోక్షప్రాప్తికి ముఖ్యసాధన మెద్ది ?

కావుండి:—అమలహృదయము. ఇది లేకున్న, నన్నియు వృథలు. అదియున్న మఱేమియు వలదు. ఏలయన గుణము లన్నియు దాన నిలిచియుండును.

కోవలన్:—విమలజ్ఞానాధిష్ఠానదేవత యగు వాణి ననఁగా 'అరివన్‌దేవుని' గాని, వేఱుదైవములఁ గాని ప్రార్థించిన నుపయోగ మేమైన నుండునా ?

కావుండి:—అందుకు సందియమా ?

అనవరతము సత్యజ్ఞాన ధనముకొఱకు
నిండుమనమున నిల్పి వాణిని భజింపు,
మఖిల దుర్వ్యథామోచన మంది, మబ్బు
విడచిన సుధాకరునివలె వెలుఁగఁ గలవు.

కోవలన్:—అధర్మమును ధర్మ మణఁచునా?

కావుండి:—తప్పక. ఇది విను.

చండకిరణుఁడు మేఘుని చదిపివేయు
చంద్రుఁ డలతిగ గ్రహణంబు సైచివేయు
పడతి తనగర్భవేదనఁ బాఱఁజిమ్ము;
అట్టులే, మంచి చెడ్డపై నధిగమించు;
కడకు మంచియే చెడ్డపైఁ గాలుచూపు
జలజమిత్రుండు జలదంబు సైఁచునట్లు,
తన్నుఁ బట్టిన గ్రహణంబుఁ దప్పునట్లు,
ఆర్భటులు శుష్కములును నిరర్థకములు,
నిలువనేరవు ధర్మంబె నిలుచుఁ దుదిని;
కాన, దుఃఖింపవలదు నిష్కారణంబ!

# పదియవ ప్రకరణము

## మధురఁ జేరిరి.

అశోకవృక్షముక్రిందఁ గావుండి కూర్చొని జైనపద్ధతి ప్రకారము పూజ చేసెను. అంత నాయోగిని 'సక్రమజీవిత ము'పై నుపన్యసించెను. అనాఁ డచట గడపి యామె కోవలన్ కన్నకిలతో మఱునాఁ డరుణోదయములోపల మధురకుఁ బయనమయ్యెను. ప్రొద్దు పొడుచునప్పటికంతయు వా రొక మండపమును జేరి విశ్రమించిరి. ఆమండప మొక యెలఁదోఁట యం దున్నది. దానిచెంగట నొకకొలను గలదు. వా రచట నొకవిప్రుని గలిసికొని పాండ్యరాజ్యమును గూర్చి ప్రశ్నించిరి. పాండ్యభూపాలుఁ డగు 'నేడంచెలియన్' ప్రభు నాతఁడు ప్రస్తుతించి "ఆర్యవిజేత యని యామహారాజు కీర్తిఁ గాంచెను. నింబపుష్పపత్రశోభిత మగు హారమును ధరించి యా ధరాధీశుఁడు నిజమీనకేతనమున కాసేతుహిమాచల మెనలేని ప్రతిష్ఠను గలిగించెను. అగస్త్యమహర్షి యంతటి వాఁ డారాజేంద్రుని యమాత్యుఁడు. ఆ మునీశ్వరునివా వాస మగస్త్యకూటము. యశోవిశాలమగు నాత్మవంశవృక్ష మున కా భూకాంతుఁడు సత్ఫలమనుటయం దతిశయోక్తి లేదు. ఇంద్రదత్త మగుహార మారాజ కంఠీరవునికంఠమున వఱలుచుండును. సూర్యవంశమున కాతఁడు భూషణప్రాయుఁడు. ఆనృపుని న్యాయపాలనావిధాన మతికఠిన మైనది. దానంజేసి

శాసనము నుల్లంఘించినవారు దేశత్యాగు లైరి. ఆతని రాజ్యము సర్వసంపన్నము; పాడిపంట లచట సదా తోలకాడు చుండును” అని నుడివెను.

కోవలన్:—స్వామీ! మీ జన్మస్థాన మెద్ది? ఏపనిపై మీ రిచటికి వచ్చితిరి?

బ్రాహ్మణుఁడు:—నాజన్మస్థానము ‘కూడమలై’ పర్వత ప్రాంతము. ‘మంకడు’ నా స్వగ్రామము. తిరుపతి, రామేశ్వరము, కన్యాకుమారి, మధుర మున్నగు దివ్యక్షేత్రములకు నేను యాత్ర పోయి, కావేరీ విపులవీచికలఁ బొడగినట్లుండు శ్రీరంగమునందుఁ గోవెలలో వేయిపడగల చిలువపాన్పుపైఁ బవళించియుండు గంభీర విష్ణువిగ్రహమును దర్శించి యిటకు వచ్చితిని.

అంతఁ గోవల నాపాఱు నడిగి మధురకుఁ బోవుమార్గములన్నింటిఁ దెలిసికొనెను. “పొలములు, అడవులు, ఎడారులు వీనిగుండా తిరుమలకుండ్రము ప్రక్కనఁ బోవుబాటయే సులభమైనది. తిరుమలకుండ్రమునందుఁ జూడఁ జిత్రమైన గుహయున్నది. శరవణము, భవకారిణి, ఇష్టసిద్ధి యను మూడు తీర్థములు కూడ నచటఁ గలవు. శరవణస్నానము విజ్ఞానమును, భవకారిణీమజ్జనము పూర్వజన్మజ్ఞానమును, ఇష్టసిద్ధి యవగాహన మైహిక వాంఛాసిద్ధిని యనుగ్రహించును. మార్గమధ్యమున వనదేవతలు నీ మిత్రవేషమున నిన్ను డాసి మోసగింతురేమో మెలకువగ నుండుము. తిరుమలకుండ్రమునకుఁ బోయి శ్రీమన్నారాయణుని బూజింపుము. నేను గూడ మఱి కొన్ని దివ్యక్షేత్రములకుఁ బోయి త్రివిక్రమస్వామి పాదరా

జీవములను, పరమేశ్వరుని చరణసరోజములను బూజింప నెంచి యున్నాను. నీవు కూడ సర్వకాల సర్వావస్థల హారిహారులను విస్మరింపకుండుటకై 'ఓం నమశ్శివాయ' 'ఓం నమో నారాయణాయ' అని యా దేవదేవులను స్మరించుచుండుము" అని యా ద్విజోత్తముఁడు కోవలనున కుపదేశించెను.

కావుండి యది విని "నీవు చెప్పినగుహాకుఁ బోవుటకుఁ గాని, సరోవరములఁ గ్రుంకులిడుటకుఁ గాని, మంత్రముల స్మరించుటకుఁ గాని మా కిష్టము లేదు. అహింసారతులై సత్య వ్రతముతో జీవితమును సాగించు మానవుల కసాధ్య మేమి కలదు ? నీవు నీదైవచరణములఁ గొలుచుచు నీదారిఁ బొమ్ము; మేము మాదారిఁ బోవుదుము" అనెను.

బ్రాహ్మణుఁ డందులకు "మీయిష్ట మెట్లో యట్లు చేయుఁడు. కేవలము మనుజుఁ డవలంబించు సత్యమునకుఁ గాని, అహింసకుఁ గాని కలుగుఫలమునకుఁ బరిమితి యున్నది. జగదీశ్వరుని పరిపూర్ణకటాక్షమునఁ దప్ప, తలవ్రాలు తప్పి కొనుట కెవ్వరికిని దరము గాదు" అని బదులిడెను.

కావుండియు నామె యనుచరులును మరలఁ బ్రయాణము మొదలిడిరి. మట్టమధ్యాహ్న మగునప్పటికిఁ గావుండి కన్నకిలకుఁ బథశ్రమచే దప్పి కలిగినది. వారు దారిప్రక్క చెట్టుక్రింద విశ్రమించిరి. కోవలన్ తనదప్పి తీర్చుకొని వారికి నీరుదెచ్చుటకు దాపునఁ గల సరస్సునకుఁ బోయెను.

అచట వనదేవత వసంతమాలరూపమును దాల్చి యొంటరిగ నుండు నాతని డాసి పాదములఁ బడి "మాధవి

శోకానలసంతప్తయై యున్నది. నే నామెపై నీతోఁ గొండెము లు చెప్పి నీ వామెను విడనాడున ట్లొనరించితి నని న న్నామె దుమ్మెత్తి తూర్పారఁ బట్టుచున్నది. ఆమె వ్యాకుల మానసమున 'పడుపువృత్తి యధమాధమ మైనది. ఆచారపరు లును, జ్ఞానవంతులును వారకాంతను ఘోరవ్యాధినివోలె నస హ్యించుకొందురు. వెలయాలిని గూర్చిన పరమాణువంత యబద్ధమును పర్వతమంత నిత్యసత్యమని నమ్ముచుందురు' అని వాపోవుచున్నది. ఆ గణికాంగన నన్ను గెంటివేయ నే నిక్క డకు వచ్చితిని" అని దీనాతిదీనరై కంటికిఁ గడవెడఁగా నేడ్చెను. అప్పు డాతనికి విప్రుఁడు చేసిన హెచ్చరిక జ్ఞప్తికి రాగా శక్తిస్తవ మొనరించెను. అదియె తడవుగా వనదేవత నిజరూపము దాల్చి తనయపరాధమును గావుమని కోవలన్‌ను ప్రార్థించి, కావుండి కన్నకిల కీయుదంతము నెఱింగింప వలదని బతిమాలి వెడలిపోయెను.

కోవలన్ నీరు త్రాగి తామరాకుదొప్పయందు జలము నింపుకొని కావుండి కన్నకిలకడకుఁ బోయెను. అప్పు డెండ వేడిమి మిక్కుటమై యుంటంజేసి పయనము సాగించుటకు వారికిఁ గష్టముగా నుండెను. కాన విశ్రాంతికొఱకు వారు దాపునఁ గల తోపులోనికిఁ బోయిరి. దానియం దార్యకుమారీ దేవి కోవెల యున్నది. ఆభయంకర కాళికాశక్తిని 'మరవు' లను దొంగలు తమ కులదేవతగాఁ గొలుచుచుండిరి. చోరులు ముందుగా నాశక్తిని బూజించి పిదపఁ గఠోరములగు దోపిడు లకుఁ బోవుచుండెడివారు. మన పాంథులు మువ్వు రాశక్తి మందిరమునకుఁ బోయి కొంతసేపు విశ్రమించిరి.

చీఁకటిపడినపిమ్మట నచట నొకనాట్యము జరిగినది. అది వొంగలమతమునకు సంబంధించినది. ఒకబాలిక కాళీశక్తికిఁ బ్రతినిధిగా నిలిచినది. కొల్లలయందుఁ దప్పని సరిగా నాతస్కరులకు విజయము లభించునిమిత్తము ప్రతిసంవత్సర మాగాఢె మందలి మతగురువుల తెగనుండి మనుజుఁ డొకఁడు తన కంఠము నా మహాశక్తియెదుట సమర్పించు నాచార ముండెను. ఆబాలిక మతాచార్యశాఖకుఁ జెందినది. ఆమె పులి చర్మమును ధరించి, కొమ్ములుతిరిగిన జింకపై నెక్కియుండెను. చేవకొయ్యతోఁ జేసిన ధనస్సు నా బాలిక దాల్చియుండినది. ఆమె శిరోజములు జడలు గట్టి ముడివేయఁబడి యుండెను. ఆముడిపై వరాహదంతము, వెండి చంద్రవంక నగలై తనరారుచుండినవి. ఆశక్తి మంగళసూత్రము పులికోఱల హారము. అచట భక్తులనడుమ నాబాలిక భీకరకాళీమూర్తితో నిలిచి చూపఱకు వెఱపు గొలుపుచుండెను. 'శాలిని' యను నర్తకి శక్తి పూనినట్లు నృత్యముచేయుచు నావేశవాక్యము లాడుచుండెను. వివిధములగు నైవేద్యములఁ జేకూని సంసిద్ధముగ మరవ స్త్రీపురుషులు గుమిగూడి యుండిరి. శాలిని క్రోధావేశమున "మీకుఁ జుట్టుపట్లఁ గల పట్టణములలోని మూకలన్నియును దినదినాభివృద్ధి నందుచుండ మీ నివాసములు బావురు మనుచున్నవి. ఓ మరవులారా! శాసనములకుఁ జిక్కియుండు నీచనగరవాసులభంగి మరవులు సాధువులై శాంతజీవనులై యున్నారు. దారిదోపిడులమాటను వారు తలపెట్టుటయే లేదు. ఆహా! ఎంత శోచనీయము. ధనుర్విద్యాప్రవీణులచే విలసిల్లు నీవిఖ్యాతజాతికి పిఱికితెగయగు కూలీల

గూడెముగ మూరు నీచదశ పట్టినది! ఇటు వినుఁడు! రుచ్యములగు మాంసఖండముల మెసవుచు, నుఱుగులు దేఱు దివ్యమధువును గ్రోలుచు నిశ్చింతతో మీరు నివసింప నెంతురేని, మీ యిష్టదైవమునకు మ్రొక్కు చెల్లింపుఁడు. లేకున్న మీ కోదండములకు నా ప్రభావము విజయమును బ్రసాదింపదు. మీకొల్లలు కొనసాగవు" అని యఱచెను.

శాలిని పలుకుల నాలించుటయే తడవుగాఁ బదిపండ్రెండు గురు మరవులు ముందుకురికి కటారులతో నుదురులఁ బొడుచుకొని జొటజొటఁ గారు నెత్తుటినెత్తురు నాశక్తికి సమర్పించిరి. అది గాంచి శాలిని "ఓ భక్తులారా! గాఢమగు మీభక్తి మీదైవమునకు ముదము నించినది. ఒకమాస మనంతరము మీరుచేయు దోపిడి విజయప్రద మగును. పాండ్యరాజగు 'నీడంచెలియన్' దారుణహాస్తము వెనుకకు దగ్గఁగలదు. అప్పుడు మీరు పట్టినదెల్ల బంగార మగుచుండును" అని చెప్పెను.

మనపాంథులు ముప్వురీదృశ్యము నత్యాశ్చర్యమునఁ జూచుచు మౌనముద్రాంకితులై యుండిరి. ఒకింత భయార్తి రేకమునఁ గూడఁ గన్నకి మేనించుక కంపించెను. శాలిని యా చోరులకుఁ గన్నకిని జూపుచు "నవలాప్రపంచమున కీ యంగనామణి భూషణప్రాయము, ఈమానవతిఁ జూడుఁడు. ద్రవిడావనికంతయు నీతన్వి పూజనీయ కానున్నది" అని పలికెను.

ఆమాటలకుఁ గన్నకి వదనమునఁ బ్రశ్నాసూచకముగ మందహాసము దోఁచెను. "ఈమాటకంటె వ్యర్థమైనది మఱే మున్నది?" అని కన్నకి భర్తతో రహస్యముగా ననెను.

దొంగలు మత్తెక్కినట్లు త్రాగిరి. ఒళ్లు తెలియక తందనా లాడి పాడిరి. మేకలను కోళ్లను కోసిరి. కాళికాశక్తిని, శివుని, నల్లనయ్యను బూజించి మరపగూడెమున కభ్యుదయ మొసఁగఁ బ్రార్థించిరి. ఇట్లు కడకా తాండవము కడముట్టినది.

నాట్యము ముగియునప్పటికి నడిరేయి దాటినది. కోవలన్ కావుండిని జూచి "ఎండవేళ మనము పయనమొనరించినఁ గోమలియగు కన్నకి వాడి వత్తలగుచున్నది. కనుక రాత్రి వేళ మనము పోవుట సౌఖ్యకరము. పాండ్యుని ధర్మపరిపాలనమున మార్గము నిరపాయముగ నున్నది. దారిదోపిళ్ల కేదొంగకు గాని గుండె లుండవు. ఈదేశమందలి రాజశాసనము నిష్పక్ష పాత మైనది; కఠోర మైనది. కడకుఁ గ్రూరమృగములు గూడ నియమబద్ధములై యున్నవి. ఎలుఁగుబంటు చీమలపుట్టను బీల్చదు; పులి లేడితో నెయ్యమున నుండును. తిండిపోతగు మకరము కూడ నోరాచియుండును" అని వచించెను. ఆ యోగిని యందులకు సమ్మతించెను.

కోవలన్ కన్నకివద్దకుఁ బోయి "ప్రేయసీ! మన మిఁక మీఁద రాత్రులఁ బయన మొనరింతము. మనదారిని బులి దాటుఁ గాక! గుడ్లగూబ కూయుఁ గాక! ఎలుఁగు రొద చేయుఁ గాక! అయిన నేమి? మన కావంతయేని భీతియుం డదు" అని చెప్పెను. అందుల కామె యియ్యకొనెను. కోవల నామెచేతిని దనభుజములపై వైచికొని నడువసాగెను.

మఱునాటి యుదయమునకంతయు వా రొకగ్రామముఁ జేరిరి. అది విప్రులకు నిలయము. ఆ బ్రాహ్మణులు వైదికజీవిత మునకు స్వస్తిఁ జెప్పి సంగీతాభినయకళ లవలంబించి యుండిరి.

కోవలన్ తనసతిని కావుండిని సభాపతియింట డించి కాల్య కృత్యములఁ దీర్చుకొనుటకుఁ బోయెను. ఏకాంతముగా నుండి నందున నాతనికి గతజీవితానుభవములన్నియు మదికి వచ్చెను. కోవలన్ను వెమకుకొనుటకు మాధవి పంపఁగా వచ్చినకౌశికుఁ డాతని మార్గమధ్యమునఁ గలుసుకొని సంతోషముఁ బట్టఁ జాలక పోయెను. అతఁడు కోవలన్కు "ఆహా! నేడు సుదినము. కడకు నేను నిన్నుఁ గనుఁగొనఁ గలిగినాఁడను సుమా! నీ తలిదండ్రులు పుత్రవియోగభారమునఁ గ్రుంగి యున్నారు. నీ బంధువులందఱు దుఃఖాంబుధి మునిఁగియున్నారు. నీతండ్రి పంపిన మనుజులు నిన్ను వెదకుచుఁ బలుదిశలకుఁ బోయియున్నారు. రాముఁడు పోయిన అయోధ్యవలె నీవు విడిచిన పుహార్ పాడువారి యున్నది. వసంతమాల తెచ్చినవార్త విని మాధవి మూర్ఛిల్లినది. ఆకాంత సేదఁ దీర్చుకొనుటకు నేను పోయితిని. అప్పు డామె తెలివొంది నన్నుఁ గాంచి 'నేను నీచరణము లంటుదును. ఈ వియోగవ్యథాగ్ని నన్ను దహింపకుండునట్లు చేయుము' అని వేఁడుకొనినది. ఆ జవ్వని యొక జాబు వ్రాసి నాకిచ్చి 'ముద్రాబంధమగు నీ తాళపత్రలేఖను దయచేసి నా నయనచకోరచంద్రునకుఁ జేర్పుము' అని బతిమాలినది. అది సుత నేను దక్షిణదేశమంతయుఁ దిరిగి తిరిగి తుదకు నిన్నిటఁ గాంచుభాగ్య మందితిని. నీసుత మణిమేఖల కూడ నీకై కలవరించుచున్నది. 'బాబూ! తిరిగి రమ్ము. నాకు నీవు కావలయును. నీవు నాకు దైవసముఁడవు. నేరముచేసినది నాతల్లి; కావున నీవు నన్ను విడచుట నీకుఁ బాడిగాదు. బాబూ! నాతల్లికూడ నిన్నుఁ దప్పుఁ దలఁచలేదు. ఆమె హృద

యము నిష్కళంకము. కాఁబట్టి, మరలి రమ్ము! నీవు, నేను, నా జనని, నాతల్లి కన్నకి—అందఱ యొక్క కుటుంబముగాఁ గాపుర ముందము రమ్ము' అని తన మనవిగా నీకు వినిపింప వలయునని నేను వచ్చినంతదూర మాబాలిక ప్రార్థించినది." అని యొఱఁగించెను.

ఆమాటలకుఁ గోవలన్ మనస్సు మెత్తగిల్లెను. నేత్రములు బాష్పనిరుద్ధము లయ్యెను. "నా తనూజాత కుశలమే కదా?" అని యాతఁ డడిగెను.

"ఆహా! కుశలమే. కాని గుండె మాత్రము పగిలియున్నది. మాధవియు దిక్కుమాలి పలవించుచున్నది. పతివియోగమునకు మాధవివలెఁ బరితపించు సతినిగాని, తండ్రిపోవ మణిమేఖలరీతి గుండె ప్రీలి విలపించు తనూజనుగాని నేనింతవఱ కెక్కడను జూడలేదు. ఇదిగో మాధవి నీకుఁ పంపినలేఖ" అని కౌశికుఁ డద్దాని నాతని కొసంగెను.

కోవల నాకమ్మను గాంచెను. మాధవిపైని మరులుచే నాతనికి మరల గుబులుపుట్టెను. మాధవియే స్వయముగ వచ్చి తనయెదుట నిలిచిన ట్లాతనికిఁ దోఁచెను. పూర్వ మోహాలీల లన్నియు నాతని దృష్టిపథమునఁ బొడఁగట్టినవి. దడదడలాడు గుండె నాతఁడు చేతితో నదిమి పట్టుకొని యా తాళపత్రమును విప్పి యందు వ్రాసియుండిన జాబు నిట్లు చదువసాగెను.

జీవితేశ్వరా!

మీపాదరాజీవముల కివియే ప్రణామములు. కేవలము మీహృదయ మెట్టిదో పరీక్షింప నెంచితిఁ గాని వేఱుగాదు.

హాస్యముచేయుతలంపున నే నొనర్చిన తెలివితక్కువ ప్రసంగము నన్యథా భావింపక నన్ను మన్నింపుఁడు. అయ్యో! నాకటువచనములు నాకు, మీ జననీజనకులకు, మీ జన్మభూమికి, మిమ్ముఁ గాకుండఁ జేసినవి. పతివ్రతయగు మీసతీమణితోఁ గొండ యనక గుట్ట యనక పరిభ్రమించు శ్రమను మీకుఁ గలిగించినవి. ఇందులకు న న్నందఱు దూషించుచున్నారు. తిరిగి రమ్ము! మాకడకు వచ్చి మమ్ము దీవింపుము.

మీ దాసి,

మాధవి.

జాబు చదువుట యైనది. "ఔను! నిజమారయ మాధవి నిరపరాధిని" అని కోవలను తలంచి కౌశికునితో "అయ్యా! నీవుపోయి మాజననీజనకుల కీతాళపత్రలేఖ నిమ్ము! ఇది చూచినచో, మాధవియందుఁ దప్పు లేదని వారు గ్రహింపఁ గలరు అదియుఁ గాక, నా క్షేమోదంతమును నాప్రేయసి కన్నకికుశలవార్తను వారెఱింగి భయము తీరి కుదుటఁ బడుదురు. నే నిప్పుడు చిల్లిగవ్వకుఁ గూడఁ గొఱమాలి యున్నాను. కాఁబట్టి పుహార్ నకు వచ్చుట కిచ్చగింపను. మధురయందు నేను మణిగ్వారుఁడనని కీర్తి వహించి తిరిగివత్తును. పోయి, మాధవికి మణిమేఖలకు నీసంగతిఁ జెప్పుము. మానమే ప్రాణముగా నడుచుకోవలయునని మణిమేఖలకు నాయభిలాషగా నెఱిఁగింపుము" అని నుడివెను.

కౌశికుఁడు కావేరీపట్టణమునకుఁ బైనమై పోయెను. కావుండీ కన్నకిలకడకుఁ గోవలను తిరిగిపోయెను. అపు డచటి

విప్రులు సంగీతసమేతముగా దుర్గాశక్తి ప్రళయతాండవముఁ జేయుచుండిరి. కోవలన్ కూడ వారిఁ జేరి యొకవీణియను గైకొని మేళవించి శక్తిపరముగాఁ గొన్ని కృతులు పాడెను. ఆతని గానవిద్యాకౌశల్య మచటి సంగీతశాస్త్రజ్ఞుల నత్యాశ్చర్య నిమగ్నులఁ జేసెను.

వారు మువ్వురు మరల మధురమార్గముఁ బట్టిరి. అల్లంత దూరముననే పురమున్నది. మీనాక్షీసుందరేశ్వరుల కోవెల యందును, రాజనగరునందును మ్రోఁగు భేరీనినాదము లురుములవలె వినవచ్చుచుండెను వేదాధ్యయనము, విద్యాలయములందలి బోధనావాచకములు కూడ వారిచెవులఁ బడుచుండినవి. గజఘీంకారములు, హయహేషలు, రథనేమిస్వనములు, పదాతులపాదఘట్టనములు—అన్నియుఁ గలిసి వాతావరణమునఁ బ్రతిశబ్దించుచుండెను. అప్పుడప్పుడే మెలఁకువనందు నా మహానగరమునందలి శబ్దము క్రమక్రమముగ సముద్రఘోషవలె విరివి కాసాగెను. జలజలఁ బాఱు తేటనీటిఛాయలతో, ఏటిగట్టుతోఁటలతో వైఘునది కన్నులుబండువు చేయుచుండెను. కోవల నద్దానిఁ గాంచి "ఇది పుష్పప్రవాహము గాని జలప్రవాహము గాదు" అని యబ్బురమందెను.

ఆ యేటిరేవులయందుఁ బడవలు క్రిక్కిఱిసి యుండెను. ఏనుఁగు, సింహము, గుఱ్ఱము మొదలగు జంతువులరూపములా పడవలయందుఁ జిత్రింపఁబడి యుండినవి. అవి జనసమ్మర్దములై యుండుటం జేసి మన బాటసారులు మువ్వురును జనులంతగాలేని పడవలయం దెక్కి యేఱు దాటి సుగంధబంధురమగు నుద్యానవనమును జేరిరి. నగరాధిదేవతకును, దూరస్థ

దేవాలయములకును వారచటినుండియే నమస్కరించిరి. అంత వృక్షశ్రేణిని, కందకమును దాటి వారు తపోవనములు కేదారముల మీదుగాఁ బోయిరి. అరఁటితోఁటలు, టెంకాయ తోపులు, పోకవనములు, వేణువినిర్మితము లగు చలిపందిళ్లు, కాసారములు, లీలోద్యానములు—వీనితో నిండి నేత్రోత్సవ మొనరించు శాఖానగరమును జొచ్చి పోయిరి. ఆప్రదేశము నుండియే వారు మీనాక్షీసుందరేశ్వరదేవాలయోన్నత గోపురశిఖరములను, గరుడధ్వజవిరాజితమగు విష్ణుదేవాగారమును, హలచిహ్నవిభ్రాజిత మగు బలరామస్వామి దేవళమును, మయూరకేతన సంశోభిత మగు సుబ్రహ్మణ్యస్వామి కోవెలను గాంచిరి.

కోవలన్ మధురాపురిలోనికిఁ బోయి నివాసయోగ్య మగు గృహము నేర్పఱచుకొని వచ్చునసుక, కన్నకినిఁ జూచు చుండుమని కావుండిని సమ్మతింపఁ జేసెను. యవనభటసంరక్షిత మగు దుర్గద్వారమును దాటి లోనఁ బోయి కోవలన్ పుర వీథులయందు సంచరింప సాగెను. అట్లాతఁడు మధ్యాహ్న మంతయు నగరసంచారమందే గడపెను. సాయంకాలమైనది. విలాసవతులగు వారకాంతలు విభవోదారులగు విటులను వెంటఁబెట్టుకొని పురశృంగారవనములకు వాహ్యాళి పోవు చుండుట నాతఁడు చూచెను. నగరమంతయు దీపకాంతులు నిండెను. పరిమళచందనపుష్పహారముల నలంకరించుకొని పౌర కాంతలు తమప్రియులతో సౌధాగ్రముల విహరించుచుం

మట నాతఁడు గాంచెను. అమూల్యము లగుముత్యములు, ప్రవాళములు, సువాసనాద్రవ్యములు, దంతము, బంగారు, వెండి, వజ్రములు మున్నగు నితరవస్తువులయందు జరుగు వ్యాపారమునకుఁ దీఱుబడి లేకుండినది. కమసాలులకు, బట్టల వర్తకులకు వేలువేలు వీథులున్నవి.

కోవలన్ తిరిగి వచ్చి నగరసౌభాగ్యమును కావుండి కన్నకిల కెఱిఁగించెను. ఆసమయమున నచట 'తలైచంగన' గ్రామవాసి యగు 'మదలన్' అను విప్రుఁ డొకఁడు కన్యాకుమారి తిరుగు ప్రయాణమునఁ గోవలన్‌ను గలుసుకొనెను. ఆబ్రాహ్మణుఁ డాతనితో "నీయశమువలన ని న్నింతకుముందే యెఱిఁగియున్నాను. నీకూఁతురికి మణిమేఖలాదేవి పేరిడియుం డుట నాకుఁ దెలియును. నీ వానాఁడు మత్తేభము బాఱినుండి ముసలి గూనిబాపని నెట్లు కాపాడినదియు, దంతముల నడుమఁ గూర్చుండి దానిమదము నెట్లణంచినదియు నాకు బాగుగా జ్ఞాపకమున్నది. ఇంతే కాదు. దూర మాలోచింపక ముంగిసను జంపిన బ్రాహ్మణిని విడనాడిన బ్రాహ్మణుఁడు వ్రాసియుంచిన సంస్కృతశ్లోకమును నీవు పఠించి యాతనిఁ దిరిగి రప్పించి సమాధాన పఱచి, ఆ బ్రాహ్మణదంపతుల నెనలేని యీవితో నీవు సంతోషపెట్టిన సంగతిఁ గూడ నేను మఱువలేదు. మఱి యొకటి. కూటసాక్షి నొకని నురితీయ నుండఁగా, హృదయ విదారకములగు వాని పత్ని పరిదేవనముల నాలకించి వానికి మారు నీప్రాణములొడ్డిన దృశ్యము నాహృదయవీథి నిలిచియే

యున్నది. నీత్యాగ మనుపమానము! నీ మానవసేవ నిష్కళంకము! కాని, ఓ గోపాలా! పరోపకారశీలుఁడవగు నీకును బురాకృతపాపదోషమునఁ బాడుకర్మ పట్టియున్నది గదా!" అని చెప్పెను.

అ మాటలకుఁ గోవలన్ "నాకు నదియే భయముగా నున్నది. నాకొక పాడుకల వచ్చినది. రాజభటుఁ డగు నీచ కులజుఁ డొకఁడు నన్ను దున్నపోతుపై నెక్కించి కన్నకిని ఘోరబాధలఁ బెట్టినాఁడు. పిదప నేనును నా కన్నకియు సకల బంధములఁ ద్రెంచుకొంటిమి. మాకపుడు త్రిగుణాతీతులగు పురుషోత్తములకు లభించు పదవి కలిగినది" అనెను.

ఆదంపతులకుఁ గావుండియు మదలన్ "ఈ శాఖానగరము కేవలము బైరాగులకు యోగులకు మాత్రము వాస యోగ్యముగా నున్నది. కావున మీరీ చోటువాసి పొండు. పురమునకుఁ బోయి యచటఁ గాపుర ముండుఁడు" అని బోధించిరి. అపు డచటికొక ముసలిగొల్లది కావుండి శిష్యురాలు వచ్చినది. ఆమెపేరు మదారి. కోవలన్ కన్నకిలను గావుండి మదారి వశ మొనరించెను.

వారలను మదారి తనయింటికిఁ దీసికొని పోయి హాయిగ స్నానము చేయించి, 'ఆయి' యను తనకొమార్తెను బిలిచి కన్నకికిఁ బరిచర్య చేయ నియమించెను. మదారి యిచ్చిన క్రొత్తపాత్రలఁ దీసికొని కన్నకి వేఱుగా నన్నము వండినది.

కోవలన్ భుజించి కన్నకి యిచ్చిన తాంబూలము నమలుచు నామెతో "ప్రేయసీ! నాహృదయ మెందులకో నిరాశాపూరితమై యున్నది. వేశ్యాలోలుఁడై జారులసాంగత్యమున జీవితమును వ్యర్థమొనరించిన మానవాధముఁ డెన్నఁడైన సుఖించునా? వృద్ధులగు నా మాతాపితరులయెడఁ బుత్రధర్మమును నెఱపనైతిని. వయస్సునం దెంత చిన్నదానవో, బుద్ధియందు సౌశీల్యమునం దంత పెద్దదానవగు నీకు సైతము కీడొనరించితిని. పుహార్ వదలి యిచటికి రావలదని నేనెంత బోధించినను పట్టుఁబట్టి నావెంట వచ్చితివి. వింటినుండి వచ్చిన యమ్మువలె నేరుగా వెలయాలియింటినుండి నీయింటికి వచ్చిన నన్ను విశ్వసించి స్వాగతమిచ్చిన నీసాహసము, ఔదార్యము, సౌశీల్యము ప్రశంసనీయము గదా!" అని పలికెను.

అందుకుఁ గన్నకి సస్మితవదనముతో "నాథా! మీ రొకవేళ ఋజువర్తనమును వీడిన వీడుదురు గాక! నేను మాత్రము ధర్మమార్గమును బాయకుండుటం జేసి నాకర్తవ్యము నెఱింగియే యుండఁ గంటిని. మీహృదయసరళి నిజముగాఁ బరివర్తన మొందినదని తెలిసియే నేను మిమ్ము వెంబడించి వచ్చితిని" అని బదులు చెప్పెను.

"జననీజనకులను, బంధువులను, సేవకులను, సకల సౌఖ్యములను నీవు వదలి, కేవలము క్షమ, మానము, బాధాసహనము, సతీత్వము వీని ప్రాపున నన్నానందడోలికల నూగులాడించుచున్నావు. నీ వపరంజివి; జగజ్జ్యోతివి. పతివ్రతా

శిరోమణివి. ఓ సతీరత్నమా ! ఓ సుగుణమణీ ! నిన్నుబట్టి నా జన్మ ధన్యమైనది ; నేను సుఖింపఁ గంటిని. నీ వన్నట్లు నీపాదముల నలంకరించియుండు నూపుర మొకదానిఁ గైకొని పురములోనికిఁ బోయి విక్రయించి వచ్చినడబ్బుతో వ్యాపార మారంభింతును. నేను మరలివచ్చువఱ కిచ్చటనే యుండుము" అని కోవల నాతరుణి కాలియందె నొకదానిఁ దీసికొనెను. అంత నాయువకుఁ డా సతీతిలకమును దగ్గఱకు లాగుకొని యురమున కదుముకొని చుఱుకుముద్దులు తమిమీఱఁ బెట్టుకొనెను. కాని యెందులకో యాతని కన్నులనుండి యప్రయత్నముగా నీరు గాఱసాగెను. వాని నాతఁ డతిప్రయత్నమున నాపుకొని మధురానగరమునకుఁ బోయెను.

# పదునొకండవ ప్రకరణము

## ఘోరాపరాధము

ఆఁబోతొకటి కోవలన్ కెదురుగా వచ్చెను. అది దుశ్శకునమని యాతం డెఱుంగఁడు. కాన నాతఁడు నేరుగా విపణివీథికిఁ బోయెను. అచటఁ గమసాలులు కొందఱు కొంత దూరమునఁ దన్ననుసరింప ముందు ఠీవితో నడచివచ్చు కమసాల పెద్ద నాతఁడు గాంచెను. ఆ కమ్మటీఁడు అంగీ తొడుగుకొని చేతులఁ బటకారులఁ బట్టుకొని యుండెను. ఆస్థానస్వర్ణకారుఁ డాతఁడే యైయుండునని యూహించి కోవల నాతని డాసి "ఆర్యా! రాణులు ధరించుటకు యోగ్యమగు నరుదైన యందెకు వెలఁ గట్టఁగలవా?" అని యడిగెను.

అగసాలె యామాట విని "మణిమయకిరీటాది రాజభూషణముల నప్రతిమానముగాఁ జేయుసామర్థ్యము నాకుఁ గలదనుటయే నీకుఁ దగినప్రత్యుత్తరము" అని డాబుగాఁ బలికెను.

కోవలన్ మూట విప్పి నూపురమును దీసి యాతని కిచ్చెను. ఆకమసాలవాఁ డద్దానిఁ గాంచెను. ఆతఁడు తనకన్నులను దానే నమ్మఁజాల కుండెను. విస్మయముతో నాతఁ డా యందియను బరీక్షింపసాగెను. ఆనందాతిరేకమున నాతనిగుండె దడదడ లాడుచుండెను. ఒకవారము క్రిందట రాణి యాతని చేతికి దన నగలపెట్టె నిచ్చి, దానియందలి యుంగర మొక

దానికి జతగా వేఱొకయుంగరమును జేయ నాకమసాలవాని కాజ్ఞాపించి యుండినది. అదును చూచి యాకస్మాత్తుగ నందలి యమూల్యమగు మంజీరమును దస్కరించి, తరువాత దాని నొక యవనవర్తకునకు విక్రయించెను. ఆ వర్తకుఁడు మఱు నాఁడే సముద్రయానము పోయెను. అంత రెండుమూడు రోజులు పిదప నుంగరము లేకుండుటను రాణి కనిపెట్టి యూరునాడొక్కటిగ గల్లంతుచేసెను. రాజు కమసాలవానిఁ బిలువనంపి ప్రశ్నించెను. అందుల కాతఁ డదరు బెదరు లేక "మహాప్రభూ! నాకేమియుఁ దెలియదు. నే నొకనేరము నెఱుంగను. ఎవఁడో వంచకుఁ డందియను దస్కరించినటు లున్నది. ఏదియో దూరదేశమునుండి రాయబారి నని దేవర వారి సందర్శనార్థ మనుమిషతో వచ్చి మానవుఁ డొకఁడు యువరాజకుమారుని వజ్రహారమును దొంగిలించి మిమ్ము మోసగించిన సంగతి మీకుఁ దెలిసియే యున్నది గదా! ఇదియు నట్టిదియే యైయుండునని నా యభిప్రాయము" అని విన్నవించెను.

నీడంచెలియన్ రాజేంద్రుఁ డాతని మనవిని సాంతముగ నాకర్ణించి తల పంకించుచు "ఔను. అపూర్వమగు నట్టి సంఘట నము జీవితకాలమున నొక్కమారు సంభవించిన సంభ వించును. అప్పటికిఁ గూడ వస్తువు మాయమై కాకపూర్వమే, చోరుఁ డెవఁడైనదియు మన మెఱింగితిమి. ఎవ్వరినో సందే హించుట కవసరము లేకపోయినది. కాని యిప్పటిమాట వేరు. నగలపెట్టెను నీచేతి కిచ్చినపుడు నీవందలి యుంగరమును గాఁజేసియుందువని పరిస్థితులు చెప్పకయే చెప్పుచున్నవి.

ఇట్లయ్యెను, నేను తొందరపడి నీనేరము నెంచఁబోను. నీ కొకవారము గడువిచ్చుచున్నాను. ఈలోపల నీవు దొంగను, సొమ్మును గనిపట్టవలయును. అంతవఱకు నీపైని నాయనుమాన మొరులకుఁ దెలియకుండుఁ గాక. అట్లు నీవొక వారమురోజు లలో దొంగతోడ నగను దేలేకపోయితివేని యీ నేరము నామీఁకీ తీయుటకు నగరాధిపతి కాజ్ఞాపింపఁ బడును. మఱి నీకుఁ దెలియును గదా! నువ్వులనుండి నూనెఁ దీయునంత సుళువుగా నాతఁ డిందలి నిజమును బయటవేసి తీరును" అని తీవ్రముగ ముదలచేసెను. ఈ కఠోరవాక్యములకుఁ గమసాల పెద్ద కలవరపడెను. అప్పటినుండియుఁ దన్నా కష్టాబ్ధినుండి గట్టు కెక్కింపు మని యాతఁడు కులదేవతను బ్రార్థింపనిక్షణము లేదు. తనకుఁ గలుగనుండు దుర్భరావమానము నుండియు, ఘోరశిక్ష నుండియు, ఉరికంబము నుండియుఁ గాపాడి రక్షింప నాతఁ డనుదినము • వేయివేల్పులకు మ్రొక్కుచుండెను. ఆ ప్రార్థనలన్నియు ఫలించినవో యన, ముక్కుమొగ మెఱుంగని మానవుఁ డొకఁ డేదేశమునుండియో తనకడ కొకయంది యను—పరిమాణమునందు, బరువునందు, పనితనమునందు, రూపమునందు—దొంగిలిడినదానితో నేమాత్రము గాని దీసి పోనిదానిని—తా నొక్కఁడు తప్ప అంతఃపురమున మఱెవ్వ రించుకయైన రెంటికిఁ గలభేదమును గనిపట్టుటకు వీలులేని దానిని—గొనివచ్చుటను గాంచి నప్పు డాతని హృదయా బ్ధియం దానందవీచిక లొక్కసారిగా నంబరము నంటెను.

కర్కోటకుఁడగు నా కమ్మటీని మానసమునం దిట్టి యూహాలు పుట్టెను. "మహారాజుగా రీయందెను విలుచు

కొందు రసుమిషతో నీతని నాయింటియందు నిలిపి, నేను రాజుగారికడకుఁ బోయి 'దేవరవారిభటుల నంపినయెడల, తోడపుతో దొంగను మాయింటఁ బట్టియిత్తున' ని మనవి చేయుదును. అంతఁ బ్రభువు సేవకులం బిలిచి 'సొమ్ముతోఁ జోరుఁడు దొరకినయెడల, తత్క్షణము వానితల నచటనే తెగ నఱుకుఁడు, అపరాధు లందఱ కిది గుణపాఠమై యుండఁగల ద'ని యాజ్ఞాపించి వారలఁ దప్పక నావెంటఁ బంపును. నాకు మూడనుండు కీడునుండి నేనిట్లు తప్పించుకోఁ గలను" అని యాతఁడు తలంచి కోవలన్ వైపు తిరిగి "అయ్యా! ఈయం దియ వెలకందనిది. ఇట్టి భూషణరాజమును గొనుట కొక్క మహారాణి తప్ప మఱియితరులు శక్తులు గారు. నేను బోయి రాజుగారితోఁ జెప్పి వచ్చెదను. అంతదనుక నాబీదయింటి నలంకరించి యుండుము" అని చెప్పి, అందియను భద్రముగా బట్టయందుఁ జుట్టి కోవలన్ చేతి కిచ్చెను.. అతఁడు తనవెంట వచ్చుచుండిన కమసాలవారి కేవో మాటలు చెప్పి వారిని వెలుబఱచి, కోవలన్‌ను దీసికొని యింటికిఁ బోయి యావరణ మునం దొకమంచముపైఁ గూర్చుండఁబెట్టి, ఉబ్బి తబ్బిబ్బు లగుచు రాజమందిరమున కొక్కయుంగలోఁ బోయి చేరెను. ఇచటఁ గోవలన్ కూడఁ దనమంజీరముపై మనసుపడిన మానవుఁ డగపడినందులకును, త్వరలో నద్దానిని ధారాళమైన క్రయ మునకుఁ గొనువానిఁ గనుఁగొన నున్నందులకును సంతోషాం బుధి మునుకలు వేయుచుఁ గూర్చుండి యుండెను.

రాజాంతఃపురమున నాఁ డొక విశేషము జరిగినది. తన పై ముందువోలె రాజు ప్రేమాభిమానములఁ జూపుట లే

దనియు, అపహృతమగు మంజీరము నింతవఱకు గనిపట్టకుండు టయే యందులకు నిదర్శనమనియు మహారాణి మహారాజును దూరుట తటస్థించినది. వారముదినములుగా భోగముమేళ మున మునిఁగి యమందానంద మనుభవించుచుండు తనకాం తుఁడు, వారయువతుల వలపుచూపులకు గుఱియై వారి మోహవాగురులఁ బడినందునఁ దనయందు నిరాదరణతో నున్నాఁడేమో యని రాణి సంశయించి యానాఁడు ప్రణయ కలహము రేపినది. మహాప్రభు వా మొగది వీడి వచ్చుచుండఁగా స్వర్ణకారుఁ డరుదెంచి ప్రణమిల్లి "దేవరా! న్యాయము చిత్తగింపుడు. అందియతోడ దొంగను జిక్కించుకొంటిని. ఆ చోరాధముని ధైర్యము వింటిరా? వాఁడు నాకడకే వచ్చి యా నూపురమును సగమువెలకు నాకే విక్రయింపఁ బూని నాఁడు. వెంటనే వానిఁ బట్టుకొంటిని. వాఁ డిప్పుడు దొంగ సొత్తుతో నాయింట నున్నాఁడు. మహాప్రభూ! నగను దీసి కొని, వానికిఁ దగినశాస్తిఁ జేయుటకు దయచేసి భటులను బంపుడు" అని ప్రార్థించెను.

ఎప్పుడెప్పుడు మంజీరమును దీసికొందునా, ఎప్పుడెప్పుడా దొంగను దగురీతి శిక్షించి రాణిమది కెక్కుదునా యని తహతహలాడు నీడంచెలియర్థ రాజేంద్రుఁ డప్రమత్తుఁడై యుండెను. న్యాయవిచారణ చేయకయే శిక్షింపరాదను సనా తనధర్మశాసనము నాతఁ డప్పటి కప్పుడే విస్మరించెను. క్రోధో ద్రేకమున నా పుడమితేఁడు నగరరక్షకభటులను ముప్వురఁ బిలిచి "ఈ కమసాలపెద్ద ననుగమింపుఁడు. చోరునివద్ద మీా రాణిగారి యందియను మీారు గాంచితిరేని, వాని నక్కడే చంపి

జేసి మంజీరము నిటకుఁ గొనిరండు. దొంగలకందఱ కీశిక్ష గుణపాఠముగ నుండుఁ గాక!........మఱి మీకు నూపురము గుర్తున్నది కదా! రాణినగ యైనదియుఁ గానిదియు మీరు మిక్కిలి సులభముగాఁ దెలియఁ గలరనుకొందును" అని యాజ్ఞాపించెను.

ఆ కమసాల పెద్ద రాజభటులను వెంటఁబెట్టుకొని పోవుచు "నాకోరిక యీడేరినది. ధన్యుఁడన"ని తలంచెను. వారి నాతఁడట్లు తనగృహమునకుఁ గొనిపోయి యచటనుండు కోవలన్‌తో "రాజాజ్ఞపై వీరు నీకడనుండు మంజీరమును జూడ వచ్చిరి" అని యొఱఁగించెను. తోడనే కోవల నందియను విప్పి వారికిఁ జూపెను. వా రద్దానిం గాంచి రాణిగారినగయే యని వెనుక ముందాడక గుర్తుపట్టిరి. కాని యింత జరుగుచున్నను కోవల నేమాత్రముగాని తందరపోకుండుటను రాజభటులు గమనించి కమసాలవానిచెవిలో "వీడు దొంగవలెఁ గాన్పించుట లేదేమి?" అని యడిగిరి.

అందుల కాతఁడు రహస్యముగా "మీరు మూఢులరు! తస్కరుల నైకము మీకేమి తెలియును? మనరాణిగారి మంజీరము వీనికడనుండుటను మీరు గాంచి కూడ నీతని చూపులు నీటుగా. నిష్కపటముగా నున్నవని మీరు భ్రమించి వాగుచున్నారు. వీఁ డారాత్రి గుసుపమును గాని, కన్నపుఁ జువ్వనుగాని యుపయోగించు నవసరములేకయే నగను దొంగిలిడినట్లు, ఇప్పుడు కూడ మీపై మచ్చుచల్లిన ట్లున్నాఁడు.

రాయబారి వేషమున వచ్చి రాత్రి రాత్రియే మన యువరాజ కుమారుని వజ్రహారమును తస్కరించుకొని పోయిన చోరుఁడు మీకు జ్ఞప్తియున్నాఁ డనుకొందును. వానివద్ద దొంగలక్షణము లేమైన నుండినవా? మీరు 'చోరకళ' యను గ్రంథమును జదువవలయును. భద్రము! వీఁడు మనలను సందేహించి మంత్రములు పలికి మాయమగుటకుముందే మీరు కర్తవ్యము నెఱవేర్చుకొనుఁడు. రాజాజ్ఞ నిరంకుశ. మని మీకుఁ దెలియును గదా!" అని తీవ్రముగ హెచ్చరించెను. అదియే తడవుగా వారియందు సాహసుఁడగు యువకసేవకుఁ డొకఁడు "నీమాట నిజము" అని యొఱనుండి తరవారి నూడఁబెఱికి కోవలఁకకంఠముపై విసరెను. ఆదెబ్బకు సరాసరి యాతనిమెడ నఱుకుఁడు వడెను. ఆ గాయమునఁ జేసి, పాపము! కోవలఁ కుట్టుసుఱుతో నెత్తురునఁ దొప్పదోఁగుచుఁ బడిపోయెను.

రాజభటు లందియఁ దీసికొని కమసాలపెద్దతో రాజ సమక్షమునకుఁ బోయిరి. ప్రభువుకూడ నామంజీరము తనరాణి పోఁగొట్టుకొనినదియే యని తలంచి, కమసాలపెద్దను భటులను దగురీతి బహూకరించెను. ఆ ధరణీశుఁ డొక్కపరుగున ప్రేయసికడకుఁ బోయి "కలికీ! చిలుకలకొలికీ! ఇదిగో నీమంజీరము. నేనింతశ్రద్ధ వహించుచుండఁగా, నీవు మాత్రము నేనుదాసీనుఁడనై యుంటినని దూరుచున్నావు గదా!" అని ప్రణయోక్తు లాడెను.

అందియను గాంచి కొప్పెరుందేవిహృదయ ముప్పొంగినది. దానిఁ బడయుటకు నిజేశుఁ డొనరించిన తీవ్రప్రయత్నముల కామె యానందోత్ఫుల్లలోచన యయ్యెను. ఆక్షణము నుండియే యామెకు జీవితేశ్వరునిపైని కోపము సన్నగిల్లెను. అంత రాజు రాణితోఁ గొంతసేపు సుఖంబుండి వెడలిపోయెను. అది సంజవేళయైనను రాణికి నిద్రవచ్చుచుండుటం జేసి, యామె పోయి పండుకొనెను.

# పంద్రెండవ ప్రకరణము

---

## శోకపరవశురాలు

ఎంతసేపటికిని గోవలక్ తిరిగి రాకుండుటచే నిచటఁ గన్నకి కలవరపడసాగెను. కారణ మగపడకుండియు నామె కీడును శంకించుచుండెను. "పగలు సైతము నాకు వణఁకు పుట్టుచున్నది. నాయెడఁద దుఃఖాతిరేకమున నిలుకడఁ గాంచుట లేదు. నాపతి యింతదనుకఁ దిరిగి రాఁడయ్యెను. ఆతఁ డింత జాగుచేయుటకుఁ గారణము తెలియకున్నది. అయ్యో! ఎంత ప్రయత్నించినను నామది కుదుటఁబడుట లేదు" అని కన్నకి ఆయిచెంత వాపోయెను. ఆయి పోయి మదారి కీసంగతి వినిపించెను. మదారి యాలకించి "అమ్మాయీ! నాకును గొన్ని యుత్పాతము లగపడుచున్నందున నేదియో యాపద రానున్నదని సంశయించుచునే యున్నాను. ఆఁబోతులకన్నుల నీరు గారుచున్నవి. రేపుదయము రాజనగరుకుఁ దీసికొని పోవలసిన నేతికొలకు నేను వెన్నను గాయఁబోగా నెంత ప్రయత్నించినను కఱుగలేదు. గోవులన్నియు గుంపు గూడి భయముతో నంబారవము లొనరించుచున్నవి. పశువుల మెడలందలి మువ్వలు నిష్కారణముగ నూడి పడుచున్నవి.

అయ్యో! ఏదియో యొక ఘోరవిపత్తు సంభవింప నున్నది. బలరామ కృష్ణుల కనుగ్రహాము కలుగునట్లు 'కురవ' నాట్య మొనరించి మన మీయాపదఁ గడచి గట్టెక్కుదము" అని సూచించెను.

అంతఁ బడుచులు పెక్కురు కూడిరి. బలరామ, శ్రీకృష్ణ, గోపికాపరములగు కీర్తనలఁ బాడుచు వారు 'కురవ' నృత్యము చేసిరి. ఇంద్రహారవిరాజితుఁడగు పాండ్యరాజేంద్రుఁడు నీడంచెలియన్‌పైని పాటలను; హేమచక్రసంశోభితుఁ డగు చోళప్రభువు కారికాళునిపైని కీర్తనలను; సముద్రము నుత్తరించి జలధివలయితద్వీపవాసులగు కదంబుల రూపుమాపిన చేరనృపాలుఁడు శెంగుత్తువన్‌పైని జావళీలను గూడ వారు పాడుచు నర్తించిరి.

అభినయ మైనపిదప నాట్యకర్తెలందఱు వైఘునది కేగి స్నానము చేసిరి. పుష్పములను, ధూపద్రవ్యములను, గంధములను, హారములను గైకొని యర్చనకొఱకు మదారి 'నెడుమల్' దేవాలయమునకుఁ బోయెను. అచట రాణిగారియందెను దొంగిలించె నను నేరమునకు కోవలన్‌ను నఱికివైచిరని పురినుండి వచ్చినవా రెవ్వరో యనుకొనుచుండఁగా మదారి చెవులఁ బడెను.

తోడనే యామె వాయువేగమున నింటికిఁ బరుగెత్తి నోట మాటరాక బావురుమని యేడ్చుచుఁ గన్నకియెదుట నిలి

చెను. "అయ్యో! నా తల్లీ!" అని మాత్ర మామె యెట్లో యనఁ గలిగినది; ఆవెనుకఁ బలుకలేక పోయినది. కన్నకి యామెఁ గాంచి నిబ్బరముగా "అమ్మా! చెప్పుము. అంతయుఁ జెప్పుము. నామనస్సు కీడును శంకించుచునే యున్నది. నాప్రియుఁడు కుశలముగ నున్నాఁడో లేఁడో యనుభయమున నేను పగలు సైతము గడగడలాడుచునే యున్నాను. నీవు నాకుఁ జెప్పక దాఁచువార్త యెంత దారుణమో కదా యనుభీతితోనే నిప్పటికే మూర్ఛమునుఁగనున్నాను. కాఁబట్టి తత్క్షణము జెప్పుము" అని తీవర పెట్టెను.

మదారి దుఃఖము నాపుకోఁజాలక వెక్కి వెక్కి యేడ్చుచు "రాజనగరునుండి రాణిగారి యందియను తస్కరించె నను నేరమును మోపి నీభర్తను రాజభటులు నఱికివైచినారు" అని చెప్పెను.

ఆమాటలకుఁ గన్నకి తోఁకఁ ద్రొక్కిన నాగమువలె బుస్సుమని లేచెను. "ఎంత ఘోరము? ఎంత యన్యాయము?" అని యా సాధ్వీమణి గర్జించెను. కాని యంతలో నామెను దురంతదుఃఖము పైకొనెను. ఆనాతి దుఃఖారావములు విను వారిహృదయములను నీరుచేయుచుండెను. "అయ్యో! జీవితేశ్వరా! నీ వెచటఁ బడియున్నావు? అయ్యో! నావిధి నేమందును?" అని యేడ్చి యేడ్చి యామె సొమ్మసిల్లి క్రిందఁ బడెను.

అంతలోఁ దెలివి వచ్చెను. భర్తృమరణ మా మానవతికిఁ బిచ్చి యెత్తించినది. ఆమె కెక్కడలేని సాహస మబ్బినది. "ఈప్రభు వొనరించిన ప్రమాదముచే నేను నా ప్రాణకాంతునిఁ గోల్పోయినంతమాత్రమున, వితంతువు లందఱవలె విపదగ్నికుండమునఁ గ్రాగి మ్రగ్గి మాడవలసినదేనా ? వివేకరహితుఁడవగు నో ధర్మదేవతా ! నీవే ధరాధిపుని న్యాయమార్గమును దప్పనిచ్చుటయు, నేను ముండమోసి దిక్కుమాలి లెక్కలేని పుణ్యక్షేత్రములఁ ద్రిమ్మరుచుండుటయునా ? ఆహాహా ! ఎంత న్యాయము ! ఏమి ధర్మము! ...నాకాంతుఁడు తస్కరుఁడా ? ఓసూర్యనారాయణమూర్తీ ! నీవు కర్మసాక్షివి ! సప్తసాగరపరివేష్టితమగు నీవిశాలవిశ్వతలమున నీకుఁ దెలియక జరుగుకార్యము లేదు గదా ? ఉన్నదున్నట్లు చెప్పుము. నిజముగా నా జీవితేశుఁడు దొంగయేనా ?" అని ప్రశ్నించెను.

ఆశ్చర్య మాశ్చర్యము !!! అందుకు బదులుగా నాకాశవాణి "కాదు కాదు. నీపతి దొంగ కాఁడు. అన్యాయముగా నాతనిని శిక్షించినందులకు ఫలితముగా నీనగరము దగ్ధము కాఁగలదు" అని పలికెను.

అప్పటికే గోపాంగనలు పెక్కు రామెఁ జుట్టుకొని యామె యాక్రందనములకుఁ గంటఁ దడిపెట్టుకొనుచుండిరి. కన్నకి తనకాలియందియను రెండవదానిఁ దీసికొని చేతఁ బట్టుకొని వారిఁ గాంచి "ఓ మానవతులారా ! అధర్మరాజపాలిత

మగు ఘోరనగరమున మీరు వసించుచున్నారు. ఇటు వినుఁడు.- నాభర్త తస్కరుఁడు గాఁడు. నా జీవితేశునికడ నుండిన నూపురమును వెలకుఁ గొన నిచ్ఛగింపక, రా జాతని ప్రాణములఁ దీసి దానిని గైవస మొనరించుకొనినాఁడు. నేనే పతివ్రత నైతినేని, మృతుఁడైన నాభర్తచే మాట్లాడించెదను. చూడుఁడు" అని దృఢముగాఁ బలికెను.

అంత నాసాధ్వి గోపికలను వెంటఁబెట్టుకొని పురిలోనికిఁ బోయినది. మధురానివాసు లామెచుట్టు చేరి "మన నృపాలుని న్యాయదండము కుంటువడినది. చంద్రప్రతిమానమగు ఛత్రముతో శోభితుఁడై, తోమరముచే విరాజితుఁడై యుండు 'తెన్నవన్' చక్రవర్తి కీర్తికౌముది వన్నెవాసినది. దేవీసన్నిభయగు నీ మానినీరత్నము నిర్వచనీయమగు వేదనతో నెట్లు బాధపడుచున్నదో చూడుఁడు" అని వారిలో వా రనుకొనుచుండిరి. వా రామెను కోవలఁ డ్చచ్చి పడియుండుచోటికిఁ బిలుచుకొని పోయిరి. ఆమె యాతనిఁ గాంచినది; కాని కోవల నామె నెట్లు చూడఁగలఁడు ? అప్పుడే సూర్యుఁ డస్తమించెను; మంజీఁకటు లలముకొనుచుండెను. ఆమె పరిదేవనముతోఁ బురమంతయు మారు మ్రోఁగుచుండినది. నాటియుదయమే కన్నకి పతిగాఢాలింగనము నంది కుసుమమాలికను బతిచే కంఠమున వేయించికొనినది; ఆ కన్నకియే యానాటి సంజవేళ జీవితేశ్వరుఁడు రుధిరప్రవాహమునఁ బడియుండఁ జూడవలసి వచ్చినది. ఆకాంత యాతనిపైఁ బడి కౌఁగిలించుకొనినది. దేహ

మాపాదమస్తకము రెండుచేతుల నిమిరినది; కన్నీట స్నానము చేయించినది. "అయ్యయ్యో! సుకుమారమగు నీశరీర మిట్లు ధూళియం దసురసంజవేళం బొర్లాడవలసి వచ్చినది గదా! జీవితేశ్వరా! నేను నీ యర్ధాంగిని! హృదయేశ్వరిని! నాతో నొకమారు పలుకవా? ఈ మహానగరమునందు సజ్జనులు లేరా? ఇట్టి యధర్మమును బ్రతిఘటించుటకీ మహాపట్టణమున మానవతులు లేరా? నిరపరాధుల నుత్తరించుట కాయత్తమైయుండు నీ రాజాధముని చేతి తీక్ష్ణకరవాలము నడ్డుకొనుటకీనగరమున దేవుడే లేడా? ఓ మనోనాథా! నాతో నొక మాటాడుము. ఒక్కమాట చాలును" అని కన్నకి హోరున నేడ్చెను; ఎంతయో బతిమాలెను.

కోవలన్‌కు తెలివి వచ్చినది; కండ్లు తెఱచెను. మంద స్వరమున నాతఁడు "అయ్యో! నాప్రేయసి వదనసుధాకర మండలమునకుఁ గాంతి తప్పినది" అనెను.

తోడనే యాతన్వంగి యాతని చరణములఁ బట్టుకొని వెక్కివెక్కి యేడ్వసాగెను. కుట్టూపిరితో నాతఁ డెగరొప్పుచు "కాంతా! ఇక్కడనే యుండుము. ఇక్కడనే—యుం—డు—ము" అని పలికెను. ఆతని ప్రాణవాయువు లంతలో నంత రిక్షమున కెగిసిపోయెను. ఆతని పరిశుద్ధాత్మ దేవతానీకము వెంటరాగా దివి కెగిరిపోయినది.

శోకోపహతయగు కన్నకి కిదియంతయు నొకభ్రమగా నుండెను. "ఇది నిజమా? లేక మాయయా? నే నెచటికిఁ బోవు

దును ? నిజము నెచటఁ గనుఁగొందును ? కాని ముందుగా భయంకరమగు నా క్రోధాగ్ని కాహుతి కావలయును. క్రూరాత్ముఁడగు రాజప్షున్యుని నెమకి, నేతిబీరకాయవంటి యాతని ప్రభుత్వమును బట్టబయ లొనరింపవలసి యున్నది. అప్పుడు నాహృదయేశ్వరుని శవ మీ యధర్మపురితోఁ బాటుగా దహింపఁ బడుఁ గాక అని యా పతివ్రతాశిరోమణి నిర్ధారించుకొనెను. ఆమె కంతలోఁ దాను దేవాండికి వినిపించిన పాడుకల జ్ఞప్తికి వచ్చినది. ఆమె తనూవల్లి కంపింప మొదలిడెను "ఈ పాడుకల లెంత చక్కఁగా నిజము లగుచున్నవి!" అని యామె యొక్క విషపునవ్వు నవ్వెను.

ఇఁక నామె లేచి ప్రభుని వెదకుచు రాజనగరునకుఁ బోయెను.

# పదమూడవ ప్రకరణము



## ఘోరశాస్తి

నీడంచెలియన్‌రాణి కోప్పెరుందేవి కానాటిసంజవేళ నిద్రలో ఘోరస్వప్నములు వచ్చెను. తోడనే యామె రాజు చెంతకుఁ బోయి "మహాప్రభూ! మీ రాజదండమును, ఛత్రమును క్రిందఁ బడినట్లు నేను కలఁ గంటిని. ఉపద్రవకరమగు నధర్మ మెద్దియో జరిగినదనునట్లు రాజద్వారముకడనుండు న్యాయఘంట యెడతెఱిపిలేక మ్రోఁగుచునే యున్నది. ఇంద్ర ధనస్సు రాత్రి యగపడినది; పగలు తోఁకచుక్క కన్పించినది. రాజేంద్రా! నామానసము ఘోరవిపత్తును శంకించుచున్నది. మహామహుఁడగు మీపూర్వుఁ డుగ్రపాండ్యుఁడు 'కోర్కై' వద్దఁ జొచ్చుకొనివచ్చు సముద్రునిపై బల్లెమును విసరగా, నాసాగరుఁడు పగఁబూని కుమారీదేశము నంతటిని 'పహ్‌రూలి' నదితో సహా మ్రింగివైచెనని మీకుఁ దెలియును గదా! అప్పుడు కూడ నిట్టిదుశ్శకునము లైనవని వినియుంటిని. కాన నిప్పు డేమి సంభవింపనున్నదో యని నాకు వణకు పుట్టుచున్నది" అని నుడివెను.

అంతలో ద్వారికుఁడు వచ్చి రాజుగారితో "దేవా! వికృతాకారముతో నొకతరుణి ద్వారముకడ వేచియున్నది.

ఆమె భయంకరశక్తిని బోలియున్నది. ఆత్మవిశ్వాసమున దుర్గాదేవివలె, భీకరరూపమునఁ గాళికామూర్తిభంగి యామగువ నిలిచియున్నది. ఆమెచేత నమూల్యమగు నందియ కలదు. ముఖాంబుజమంతయుఁ గన్నీరు చాఱలుగట్టి యున్నవి" అని విన్నవించెను.

"ఆమెను లోనికిఁ గొనిరమ్ము" అని రా జనెను.

కన్నకి ప్రభుసమక్షమునకు వచ్చి నిలిచినది.

ప్రభు వామెను గాంచి "ఓ నారీమణీ! నీవదన మశ్రుకణములఁ జెన్ను తఱిగియుంటకుఁ గారణ మేమి? నీ వెవ తెవు? ఇచటికి రాఁ గారణ మేమి?" అని ప్రశ్నించెను.

కన్నకి రోషావేశమున రోఁజుచుండినది. "ఉద్రేకసంభరితుఁడ వగు నో చక్రవర్తీ! నేను పుహార్ నుండి వచ్చితిని. గువ్వప్రాణములఁ గాపాడుకొఱకు డేగకు నిజమాంసఖండములఁగోసియిచ్చిన శిబిసార్వభౌముఁ డానగరమున కధిపతులై యుండిన మానవనాథులలో నొకఁడై యుండెను. యువరాజకుమారుఁడు దుడుకుతనమున నొక లేఁగపై రథమును బోనీయఁగా, గోమాత న్యాయఘంటను మ్రోయించుట వాలకించి ఏకైకపుత్రునిఁ దనరథచక్రముల క్రింద వైచి నలుగఁగొట్టిన మనునీతి కాండచోళరాజశేఖరుఁడు కూడ నాథరాధీశులలో నొకఁడై యుండెను. అట్టి ప్రోలునుండి కోవలనను వణిక్కుమారుఁడు మహాసత్త్వునిపుత్రుఁడు దౌర్భాగ్యము వెన్నాడ

మీరాజ్యమునకు వచ్చినాఁడు. అతఁడు నా కాలియందియను విక్రయించుటకుఁ బ్రయత్నించుచుండ మీయాజ్ఞపై హత్య గావింపఁ బడినాఁడు. నే నాతని పత్నిని ; నాపేరు కన్నకి" అని యామె పలికెను.

ప్రభు వామెపలుకుల నాలకించి "ఓ మానినీ ! ఆశిక్షను 'హత్య' యని నీవనుట కెట్లు సాహసించితివి ? న్యాయపాలన మొనరించి చోరులఁ దగురీతి శిక్షించుట రాజధర్మమే కదా !" అని తెలియఁ జెప్పెను.

కన్నకి:—నిరపరాధిని జంపుట న్యాయము గాదు. అది హత్య ! కేవలము హత్య ! ఇందుకు సందేహము లేదు.

రాజు:—నీ వాతనిపత్నివగుట నాతఁడు నిరపరాధి యని వాదించుచున్నావు. కాని యాతఁడు తస్కరించిన నా రాణియందియను జేతఁ బట్టుకొనియుండినపుడే పట్టువడెనని యెఱుంగుము.

కన్నకి:—అందెను తస్కరించిన దాతఁడు కాఁడు. అందె దొంగవు నీవు. మను శిబిచక్రవర్తులవలె రాజనామమున వ్యవహరించుచుండియు, నీదేవేరి నూపురమును బోఁగొట్టు కొనినందులకు నీకు మతి పోఁగా, ఏపాపమెఱుంగని నిరపరాధి జీవములఁ దీయ నాజ్ఞఁజేసిన నీవు గాక మఱి మంజీరమును దస్కరించిన చోరుఁ డెవ్వఁడో చెప్పుము. దారుణహత్య లొనరించుచుండియు న్యాయపాలన మొనరించునట్లు నటిం

చుచు, నీరాణి నంకతలమున నిడుకొని గద్దియపైఁ గులుకుచుఁ గూర్చుండ నీకు సిగ్గులేదా ?

ఆమాటలకు వీడంచెలియర్ల మండిపడి "ఏమి నీసాహసము ? ఏమనుచున్నావు ?" అని గద్దించెను.

కన్నకి తొణకక "ఏలయన, నిది సత్యము. అట్లని నిరూపింపఁ గలను" అని పలికెను.

"అవును. నిరూపింపవలెను. లేదా చావవలయును. ఇదిగో నీభర్తయొద్ద లాగుకొనిన మంజీరము" అని రాజుగ్రముగా నఱచి యందియఁ దీసి యామె కిచ్చెను.

కన్నకి యా యందియను బరీక్షించి చూచెను. తాను కోవలర్ల కిచ్చిన యందియ యదియే యని యామెకు గట్టినమ్మకము కలిగెను. "దీనిని నిరూపించుట మిగుల సులభము. మఱి నీదేవేరి నూపురములోపల నేమి యుండినవి ?" అని యామె రాజు నడిగెను.

రాజు:—మనోహరములగు ముత్యము లుండినవి.

"అయిన నా యందియయందు స్వచ్ఛములగు కెంపు లుండినవి. నీరాణిదని నీవింతసేపుగాఁ దెలివిమాలి వాదించుచుండిన యీ యందియయం దేమున్నదో మఱి యిప్పుడు చూడుము" అని కన్నకి యామంజీరమును గ్రిందఁ గొట్టెను.

అందె పగిలినది; కనులకు మిఱుమిట్లుగొలుపఁ గెంపులు చెల్లాచెదరు అయ్యెను. ఆక్షణమే రాజఛత్రము విఱిగి క్రిందఁ బడినది; న్యాయదండము వంకరపోయినది. కన్నకి యీనినపులి వలె నుండెను. ఆమె నేత్రముల నిప్పుక లురలుచుండెను. రెండవ యందియను దనకడనుండినదానిఁ గైకొని “దీని యందుఁ గూడ నేమున్నవో చూడుము” అని యఱచి క్రిందఁ గొట్టెను. అందుండి కూడఁ గెంపులు వెలువడి నలుముఖములఁ బడెను.

నీడంచెలియన్ రాజునకు నఖశిఖపర్యంతము బాధ కలిగెను. అది దుర్భరమై యుండెను. “దుర్మార్గుఁడగు కమసాల వాని తప్పుడుకూఁతఁ జెవిఁబెట్టి, ఏ పాపమెఱుఁగని మానవుని ప్రాణములఁ బోకార్చిన నేను రాజు నగుదునా? దొంగను నేనే! నేనే దొంగను. నేను న్యాయమును బాలింపఁ జాలకపోయితిని. కాఁబట్టి నేను ప్రాణములు వదలుట సమంజసము.

దైవమా! ఎట్టికట్టడి త్వర జనించి
ఒక్కఁ డెఱుఁగని హితజన్ము నొడిసి జంపె!
విధికృతంబని యేనెట్లు వితథువోలేఁ
దెలియఁ జెప్పుదు నాకింత తెలిసి యుండి?
అద్దిరే! కాంచు న్యాయదండంబు యొఱిగె
చేతిపట్టుఁ దొలంగియుఁ జేష్ట దక్కి;

దైవమంపె నీద్దైవతా తన్వి చేత
నాకు నాన్యాయపదవికి నర్హ శిక్ష !"

అని యాతఁడు పలికినాఁడో లేదో వెంటనే పిడుగడచినట్లు నేలఁ గూలి యసువులు వాసెను.

ఈ దారుణదృశ్యమును గాంచి రాణి కొప్పెరుందేవి క్రిందఁబడి, భర్త పాదరాజీవములఁ బట్టుకొని కన్నుల కద్దుకొనుచు "దేవా ! మనోనాథా ! నన్నుఁ గూడ మీవెంట రానిండు. మీరు లేక నాప్రాణములు నిలువవు" అని విలపించెను.

కన్నకి యామెను జూచి "ఓ మహారాజ్ఞీ ! నేను దౌర్భాగ్యదశకు బలియై యున్నాను. నేను విద్యావతిని గాను. కాని ఒక్కవిషయము మాత్రము వినుము. కీడు చేసినవాఁడు కీడొంది తీరును. మఱి యొకసంగతి కూడఁ దేటతెల్లము సుమా ! పైకిఁ జూచుటకు బేలనై యున్నను, పతివ్రత మహిమోపేత యనుట జగద్విదితము. మాపురియందలి సతీమణుల ప్రభావము నొకింత వినుము. ఒకమానవతి తనసతీత్వము శంకింపఁ బడినపుడు, వంటయింటిని, వృక్షమును సాక్షిగాఁ గోర, దైవము వానిచే సాక్ష్యమిప్పించి యామె మానధనమును రక్షించెను. మఱియొక సాధ్వి, నదీకూలమున సైకతప్రదేశమున నాటియుండిన నిజేశుని విగ్రహమును గాపాడుచుఁ, బైకొనివచ్చు వెల్లువను గూడ లెక్కసేయక

నిలిచియుండ—చిత్రము వినుము—ఆప్రవాహ మా యెల నాగచుట్టును గాలిగుడిగా నేర్పడి యా మెను ఆమె నాథుని విగ్రహమును దాకక పాఱినది. కారికాళరాజేంద్రుని తనూజ కావేరీముఖద్వారమున వీచికలఁ జిక్కి కొట్టుకొనిపోవు నాత్మేశుఁ జేర భూపతిని రక్షించుకొనుట కొక్కపెట్టున నల్లకల్లోలములై యుండు నగాధజలముల దూకఁగా—విచిత్ర మేమందును?— తరంగము లాసతీరత్నమున కాత్మనాథు నప్పగించి శాంతిం బొందినవి. మఱియొక మానినీమణి సముద్రయానము పోయి యుండిన జీవితేశ్వరుని బాసి ప్రాణములతో నుండఁజాలక శిలా ప్రతిమగ మాఱి సముద్రతీరమున నాటుకొని యుండి, ఆతఁడు తిరిగివచ్చి తన్నుఁ దాఁకినపుడు మరల నిజరూపమును దాల్చి యాతనికి ముదము నించినది. వేఱొకవనితాశిరోమణి లాలించు చుండిన సవతిబిడ్డ ప్రమాదవశమున బావియందుఁ బడఁగా నాబిడ్డను రక్షించుకొనుటకు సొంతబిడ్డ నెత్తి బావిలో వైచినఁ గడుపుతీఁపిచేఁ దనబిడ్డను లేవనెత్తి కాపాడునాతురమందు సవతిబిడ్డ తప్పక దక్కునను నమ్మకముతో నట్లొనరించి బిడ్డ లిద్దఱను రక్షించెను. ఇంకొక సుదతీలలామ పతి యూర లేని యెడఁ బరులు తనసౌందర్యమును గన్నార్పక చూచుచుండుటను గమనించి కొండముచ్చురూపముఁ గైకొని ప్రాణకాంతుఁడు తిరిగివచ్చుటయే తడవుగా నిజాకృతి గ్రహించినది. మఱియొక సతీరత్నము సంగతి వినుము. తన పుట్టువునకుఁ బూర్వ మెన్నఁ డో తల్లి దాసీదానితో 'నీకుఁ గొడుకు నాకుఁ గూఁతురు

పుట్టినచో, మనము వియ్యమందుద మని బాసగాఁ బలికిన పలుకులఁ దలంచుకొని యొకనాఁడు పరితపించుతల్లి నా కన్యా రత్నము గాంచి నేరుగా సేవకురాలిపట్టికడకుఁ బోయి యాతని చరణములఁ బరిగ్రహించి తన పతిగా స్వీకరించి తల్లిసమస్యను బరిష్కరించినది. ఈ సతీసప్తకము పాదరేణువులఁ బవిత్రమై యుండు పుహార్ నుండియే పతివ్రతాతిలకమ నగు నేను సైతము వచ్చితిని. ఘోరమగు నీ యధర్మమునకు గుణపాత్రమై యుండునట్లు, నేనీ పురవరము నగ్నికీలల కాహుతి చేసి భస్మ మొనరింతుఁ జూడుము" అని తీవ్రముగాఁ బలికెను.

ప్రసంగము నాపినపిదప రాణి నామె తెప్పలార్పక చూచినది. చూడఁగా, రాణిజీవము లెప్పుడో దేహపంజర మును విడిచిపోయి యుండెను.

అంతఁ గన్నకి భీకరాకృతిఁ దాల్చి, కుడిచేత నెడమ చంటిని మెలియఁబెట్టి యూడఁబెఱికి మధురాపురివైపు విసరి

"సతిమహత్వమె యనలనుత్పాది యేని
పట్టణము భయదకీలలఁ బరగుఁ గాత!
పౌరవరులకు న్యాయవైఖరిని జాటి
లలన హృదయానలంబుఁ జల్లార్చుకొనును.

ఈనగరము దగ్ధమౌఁ గాక! సజ్జనులు, బ్రాహ్మణులు, గోవులు, పతివ్రతలు, వృద్ధులు, పసిపిల్లలు—వీరు తప్ప మిగిలిన దంతయు భస్మమౌఁ గాక! రాజుచేసిన నేరమునకు—చనుఁ

గుడిపి నే నానందించుటకు బిడ్డనుబడయు భాగ్యమును వ
మ్మొనరించిన నేరమునకు, యీనగరము తగులఁబడు నందుఁ గాక"
అని దారుణముగ శపించెను.

వెంటనే యగ్ని దేవుఁడు,—నీలవర్ణ గాత్రము, కావిశిఖ,
పాలతెలుపుపండ్లు—ఇట్టి యాకారముతో బ్రాహ్మణాకృతి నా
సతీమతల్లికకు సాక్షాత్కరించి 'నీయానతి నెఱవేర్చెద' నని
పలికెను. అంత నాతఁడు జ్వాలామయమగు నోరు తెఱవఁగా
మంటలు నగరమంతయు నొక్కక్షణములో వ్యాపించెను.

నగరపోషకదేవతలు— ముత్యమురీతి తెల్లనిశరీరము,
తెఱచిన ఛత్రము, వేత్రకమండలువులు, అగ్నిదండము,
కుశలు, వేదములు, యజ్ఞోపవీతము వీనితో బ్రాహ్మణ
భూతము—ప్రవాళవర్ణ దేహము, రణభేరీ ఛత్రములు, మృదు
తూలికాతాళవృంతపతాకలు, అంకుశ తోమరపాశములు,
వీనితో, క్షత్రియభూతము—పింగళవర్ణ కాయము, తులాదీప
స్తంభములు, వీణియ, జలము, వడ్లగింజలు వీనితో వైశ్య
భూతము—నీలమణినిభగాత్రుఁడు, హాలాయుధుఁడు నగు
శూద్రభూతము—వీరికందఱకు నగరము భస్మము కానున్న
దని ముందుగనే తెలియును. కాన నిప్పుమంటలు వీథుల కేగఁ
బ్రాఁకులోపల వారు తమనెలవులు వీడి పోయిరి.

భయంకరాగ్నికీలలు పురమునంతటిని భస్మ మొనరించి
నవి. శృంగారవతులగు వారకాంతలు, సముచితవేషులగు సైని

కులు, విపణివాసులగు వర్తకులు, చేబండ్లు లాగి పొట్టఁబోసి కొను కూలీలు—వీరందఱు తలవనితలంపుగా నాయగ్నిమధ్యఁ జిక్కుకొనిరి. నిజవ్యాపారవ్యగ్రులై యుండు పౌరులందఱు హవ్యవాహనున కాహుతి యైరి. సర్వనాశంకరములగు నగ్ని జ్వాలలఁ దప్పుకోఁజాలక ప్రజలు చిత్రప్రతిమలువోలెఁ జేష్టలఁ దక్కి చేయునదిలేక నిలిచిపోయిరి.

# పదునాల్గవప్రకరణము

## సతీదేవి

అగ్నిఁ బడక తప్పి బ్రతికినవారు సైతము కన్నకిని దూరిన వారు కారు. కన్నకికిని ఆమెజీవితేశునకు జరిగిన దారుణమగు నన్యాయమున కది తగిన ప్రతిఫలమని వారనిరి. ఆమె పాతి వ్రత్యమహిమ కచ్చెరువంది తత్క్షణమే వారామెను పత్నీదేవి యనియు, సతీదేవియనియుఁ బిలువసాగిరి.

శిఖిశిఖలా మహాపట్టణమును బూదిచేయుచుండఁగా నగరాధిదేవత యగు మధురావతి దిక్కుతెలియక వాపోవుచు సందుగొందులఁ బడి తిరిగినచోటఁ దిరుగక చరించుచుండెను. కడకా శక్తి కన్నకియెదుటికిఁ బోయి "లక్ష్మీ సరస్వతి పార్వతీ దేవుల విజయముకంటె నీవిజయ మమోఘమైనది. ఓ సాధ్వీ మణీ! నామొర నాలకింపవా" అని ప్రార్థించెను.

కన్నకి యాప్రార్థన నాలకించి "నావెంట వచ్చు నీవెవ్వరు? నేఁజేసిన ఘోరాపరాధమును, నేఁజెందు పశ్చాత్తాపమును నీ వెఱుంగుదువా?" అని యడిగెను.

అందుకు మధురావతి యిట్లు చెప్పెను. "ఎఱుఁగుదును. కాని నామాట వినుము. అప్పుడు నీకంతయుఁ గరతలామలక

మగును. అధర్మమును బ్రచురించు ఘంటానినాదమును వా రాకర్ణించుచుండఁగా, నేటివఱకు నావీను లీపురియందలి వేద పారాయణమును మాత్రము వినుచుండినవి. మీా మనునీతి కాండచోళభూపతికిని, శిబిచక్రవర్తికిని సములగు మహామహు లీ రాజవంశమున లేరని నీవు భావింపరాదు. వినుము చేర రాజేంద్రుఁడు కేలు కుత్తువన్' బహూకరించిన యమూల్యా భరణములతో వేదవేత్తయగు పరాశరుఁ డొకప్పుడు 'తంగల్' గ్రామమందుఁ బోవుచుండెను. ఆ గ్రామవాసియగు 'వర్తికన్' కుమారుఁడు 'అలమర్ శెల్వన్' అను బ్రాహ్మణబాలుని వేద పారాయణము నాలకించి యామహర్షి ముదితుఁడై, చేరనృపా లుఁడు తనకిచ్చిన నిస్తులభూషణములఁ గొన్నింటిని—నూర్తిక మయమగు పవిత్ర యజ్ఞోపవీతము, స్వర్ణకంకణములు, మణి మయకర్ణాభరణములు—వీని నాబాలునకు బహుమతిగా నొసంగెను. ఆ బాలునిభాగ్యమును జూచి గ్రామాధికారుల కన్నులు పచ్చ నయ్యెను. అంత వారు భూమిాశునకుఁ జేర వలసిన నిధినిఁ జోరత్వమునఁ బరిగ్రహించి ధనవంతుఁ డయ్యె నని యా బాలునిపై లేనిపోని నేరములు మోపి రాజాజ్ఞ నంది వానిఁ జెఱసాల బంధించిరి. ఆతనితల్లి యందులకు శోక వివశ యయ్యెను. ఈ యన్యాయమునకు ఫలితముగాఁ గాళీ కాదేవాలయ ద్వారబంధము మూర్గమిాయక పోయినది. ఈ యుదంతము భూపతిచెవులఁ బడెను. అధర్మమెద్దియో యపరి హార్యమై యున్నఁగాని యిట్టిది జరుగదని యాతనికి సంశయము

కలిగెను. విచారణపై నా ధరాధీశునకు 'అలమర్ శెల్వన్' యన్యాయబంధనము తెలిసినది. భూతలమున మానవమాత్రునకు మొకరింపని యా రాజశేఖరుఁడు వెంటనే 'వర్తికన్'కు సాష్టాంగముగఁ బ్రణమిల్లి ఆ చంద్రార్కము సర్వమాన్యముగ ననుభవింపుఁడని 'తంగల్, వాయలూర్' గ్రామములను ధారవోసి 'అలమర్ శెల్వన్'ను బంధవిముక్తుఁ జేసెను. ఆ క్షణమే కాళీదేవాలయద్వారము ప్రబలనిర్ఘాతస్వనముతో నగరమంతయుఁ బ్రతిధ్వనించునట్లు తెఱచుకొనెను. అందులకు సంతోషించి యవనీపతి పన్నులన్నింటిఁ ద్రోసివేసి బంధితుల నందఱను విడిచివేయ నాజ్ఞఁ జేసెను. మఱియు నిఁకమీఁద నన్యాయముగ నిరపరాధు లిట్టి దారుణశిక్షలకు గుఱికాకుండుటకై 'పెన్నిధియంతయు పసిపట్టినవాని సొత్తగుఁ గాక' అని శాసించెను. మీఁదు మిక్కిలి యీ యధర్మచారిత్రమునకుఁ గారకులగు గ్రామాధికారుల నాప్రభు వుద్యోగమునుండి దొలఁగించెను."

"కాని విధి ప్రేరేపింప న్యాయమూర్తి యగు నీరాజోత్తముఁడే నీపతికి ఘోరమగు నన్యాయ మొనరించునట్లు తటస్థించినది. ఏలయనఁ గారణము నాలింపుము."

"ఆడిమాస కృష్ణాష్టమీ శుక్రవారము కృత్తికాభరణీ నక్షత్రము లుచ్చదశ నుండునపు డీపాండ్యభూపతి దివి నలంకరించుననియు, తదుపరి యాతనిపురి యగ్నికాహుతి యగుననియు పష్య మొకటి యుండినది. కాన నాతనివిధి నీదుఃఖము

నకు మూలమైన యధర్మమునకు దారి తీసినది. కాని కారణము లేనికార్య మెన్నఁడుండదు. ప్రకృతానుభవములన్నియుఁ బురాకృత కర్మఫలములే సుమా! పూర్వము వసు, కుమారులను దాయాదు లిద్దఱు కళింగదేశమందలి సింహాపుర, కపిల పురములఁ గ్రమమునఁ బాలించుచుండిరి. వారికి నడుమ వచ్చి గడ్డి వేసిన భగ్గునునంతవైర ముండెడిది. సింహాపురమునకుఁ జుట్టును సారవంతములగు క్షేత్రములు, దట్టములగు తోఁపులు గలవు. చొరశక్యముగాని వేణువనము కపిలపురమును బరివేష్టించి యుండినది. తమరాజధానులచుట్టు పండ్రెండుమైళ్ల విస్తీర్ణప్రదేశమునందు విదేశవర్తకు లెవ్వరు గాని ప్రవేశింపరాదని రాజు లిద్దఱు యుద్ధపరిస్థితులను బట్టి నిర్ణయించుకొనిరి. అప్పుడు సంగముఁడను విదేశవర్తకుఁ డొకఁడా నిబంధనల నుల్లంఘించి వస్తువులను విక్రయించు నాతురతతో, సింహాపురమునకు సతీసమేతముగా వస్తుజాలముఁ గొనిపోయి విక్రయించెను. నీభర్త కోవలక్ష్మ ముందుపుట్టువున రక్షకభటాధ్యక్షుఁడై భరతుఁ డనుపేర వసురాజును గొలుచుచుండినాఁడు. భరతుఁడు సంగముని గాంచి యమాయకుఁ డనుకొనక, కుమారరాజుకడనుండి మారువేషమున వచ్చిన గూఢచారి యని యనుమానపడి, తనసంశయమును రాజునకు విన్నవించెను. ప్రభువు భరతునిమాటల నట్లే నమ్మి వర్తకు నురి తీయించెను. నిరపరాధియగు నా వర్తకునిభార్య నీలి యను సాధ్వీమణి శోకవ్యాకులయై రెండువారములపాటు పిచ్చిపట్టి

నట్లు విలపించెను. ఆమానవతి నరేంద్రుని, పౌరులను, యింత యేల—అచట మూఁగిన జనులఁ గాంచి "ఓ రాజా! ఇదియా నీధర్మము? ఓ వైశ్యులారా! మీన్యాయ మిదియేనా? ఓ పౌరులారా! మీనీతి యిదియేనా?" అని దుఃఖమున నఱచెను. ఇట్లాసువతి పదునాల్గుదినములు విలపించి విలపించి, పదునైదవ నాఁడు శుభదినముగా నుండ స్వర్గవాసియగు నిజనాథుఁ జేరు భావముతోఁ బర్వతసిఖరము నధిరోహించి క్రిందికి దూఁకినది. అట్లానారీమణి దూఁకుటకు ముందు "నాభర్త నీవిధముగా హింసించిన మానవునకు మఱుజన్మమున నిట్టిగతియే పట్టుఁగాక! ఈ హింసకుఁడు రాఁగలపుట్టువున న్యాయసమ్మతముగఁ దనవస్తువును విక్రయించెడి నిరపరాధి యయ్యును, హీనమగు నేర మొనరించెనను నిందకుఁ బాల్పడి అప్పటి కప్పుడే యురి తీయఁ బడుఁగాక! నేఁడు నాపలెనే, అప్పు డాతనిపత్ని శోకాకులిత యగుఁ గాక! కాని రెండువారములు పిమ్మట నామె దివినుండు నిజపతిని నగాగ్రమునుండియే కలుసుకొని మనశ్శాంతిని బడయఁ గలదు." అని శపించెను.

"కాఁబట్టి యిట్లేల సంభవించినదో నీ కిప్పుడు తెలిసిన దనుకొందును."

ఈ కథను కన్నకి వెఱఁగుతో వినినది. ఆమె జ్ఞాననేత్ర మల్లనల్లన విచ్చెను. అంత మధురావతి యాసాధ్వియానతిపై నగరమందలి నిప్పుమంటల నార్పెను.

"నాపతిని గలుసుకొనువఱకు నాకు నిలుకడ యెక్కడిది?" అని కన్నకి తలంచి, దుర్గాదేవ్యాలయమునకుఁ బోయెను. అచట నామె విధవాలక్షణమున కనుగుణ్యముగ నుండునట్లు చేతు లందలి బంగారుగాజులను విఱచివైచెను. అంత నామె "నేనును నా ప్రాణేశ్వరుఁడు నొక్కటిగా నీ నగరమునందుఁ దూర్పుద్వారమునఁ బ్రవేశించితిమి. అయ్యో! ఇప్పు డేకాకి నై పడమటిద్వారమునుండి బయటికిఁ బోవుచున్నాను గదా!" అని బిగ్గఱగా నఱచుచుఁ బశ్చిమద్వారమునుండి మధురానగ రము వీడి చనెను.

నుఱుగులు దేలుచుఁ బాఱు వైఘనదియొద్దున కొండ లను గుట్టలను, మిట్టపల్లములను, ఱాళ్లు ముళ్లను లెక్క సేయక యామె దయ్యముపట్టినదానివోలె నతివేగముగాఁ బుడమి యదరునట్లు పెద్దయంగలిడుచు నడువసాగెను. కడకా యువిద పూజ్యమగు స్కాందపర్వతమును జేరి చెంగటఁ గల వనమున నందు నిలిచి "అయ్యో! నేను మహాపాతకిని" అని వేదనాభరమున నఱచెను. తోడనే యామెచెంతకుఁ గొందఱు కొండజాతివారు వచ్చిరి. ఆమె సౌందర్యగాంభీర్యములకు వారు విభ్రాంతులై "స్కందునివేరి పల్లిదేవివా నీవు?" అని యడిగిరి.

"కాదు. నేనొక దురదృష్టవంతురాలను. మహాపాం డ్యుని యధర్మపాలనకు నాభర్త యాహుతి యైనాఁడు. కోపా వేశమున నేను మధురను గాల్చివైచితిని. ఎప్పుడెప్పుడు నాపతి

వచ్చి నన్ను స్వర్గమునకుఁ గొంపోవునా యని నే ననుక్షణము నిరీక్షించుచున్నాను” అని కన్నకి వారితో ననెను.

అందులకు వా రత్యాశ్చర్యముతో “ఈ విచిత్ర మెప్పుడు జరుగును ?” అని యడిగిరి.

“పదునాల్గుదినములలో” అని కన్నకి యనెను.

పార్వతీయు లామాటలకు వింతపడిరి. ఆ యద్భుత మెట్టిదో కన్నులారఁ గాంచుటకు వా రాప్రదేశమునకు దగ్గఱగా విడిసిరి. పదునాల్గుదినము లిట్లు గడచినవి. అప్పుడు దేవేంద్రుఁడు స్వయముగఁ గోవలన్‌తో దివ్యవిమానమునందు వచ్చి కొండపై దిగి, సతీదేవియగు కన్నకికి నమస్కరించి కోవలన్ ప్రక్కన నాసాధ్వీమణి నాసీనురాలిఁ జేసి స్వర్గమునకు దీసికొనిపోయెను.

పాపరులగు కోయవా రావింతను గాంచిరి. వారు మఱుక్షణమే యనతిదూరమందు పెరియార్ నదీతీరమున విడిసియుండిన తమరాజు చేరపతి శెంగుత్తివన్ మహారాజుచెంతకుఁ బరుగిడి యా విచిత్రసంఘటనమును గూర్చి విన్నవించిరి. అప్పుడచట రాజసహోదరుఁడు ‘ఇళ్లాంగో అడిగల్’ కూడ నుండెను. ఈతఁడు మహామహుఁడు. తనయన్న గాక తానే రాజగునని ప్రచారమందుండిన యేష్యము నసంభవ మొనరించునిమిత్త మీతఁడు సన్యసించి తనయన్న శెంగుత్తువన్ భీతిని మాన్పఁ గలిగెను. కన్నకి బొందెతోఁ గైలాసమునకుఁ

బోయినవింతను గోయలు తమ ప్రభువునకు నివేదించినపుడు 'మణిమేఖల' కృతికర్తయగు సట్టన్ 'ఇల్లాంగో అడియన్' అతిథిగ నుండెను. అప్పు డాతఁడు రాజునకు సభ్యులకుఁ గథ నంతటిని— అధర్మచోదితమగు కోవలన్‌హత్యను, నీడం చెలియన్ కొప్పెరుందేవుల మరణమును, మధురానగరిదహన మును—వినిపించెను. అంద అతిశ్రద్ధతో నాకథ నాలకించిరి. "మహాపాండ్యుని మరణము మంచికేయైనది. ఏలయన నాతఁ డొనరించిన యన్యాయమునకు ఫలముగఁ గుటిలమైన న్యాయ దండ మిప్పుడు సరళాకృతిఁ బడయఁ గలిగినది" అని శెంగు త్తువన్ ప్రమోదమునఁ బలికి, తనయర్ధాంగి 'ఇల్లాంగో వెన్మాల్' వైపు తిరిగి "ఇటు వినుము. 'నేను నావిభు ననుసరింపవలయు' ననుచు మృతుఁడైన జీవితేశ్వరుని పాదములఁ బట్టుకొని యొక పతివ్రతారత్న మసువులఁ బాసినది. వేఱొకసాధ్వీమణి మధు రను భస్మమొనరించి, సతీత్వమహిమను ప్రపంచమునకుఁ జాటి మనరాజ్యమునకు వచ్చి, నిజనాథుఁడును దేవనాథుఁడును ద న్ననుసరింప సశరీరముగా స్వర్గము నధిష్ఠించినది. ఇప్పుడు చెప్పుము. వీ రిద్దఱిలో మహిమోపేతు లెవరు ?" అని యడి గెను.

అందులకు ఇల్లాంగో వెన్మాల్‌రాణి "వితంతుదశానల మునఁ బడి ప్రగ్గుటకుమున్నే యాత్మ లేచిపోయిన పాండ్య ప్రభ్వీ దివ్యసౌఖ్యము లందుఁ గాక ! మనభూమినుండిఁ గాయ

ముతో నాకమున కెక్కిన సతీదేవిపేరఁ గోవెలను సముచిత ప్రతిమతో నిర్మించి తగురీతిఁ బూజింతము” అని పలికెను.

శెంగుత్తువర్ మంత్రులతో నీవిషయమై యోచించెను. “పవిత్రమగు నగస్త్యకూటనగరమునుండి శిలను దెచ్చి విగ్రహముగా మలిచి కావేరీ పూతసలిలముల స్నానముచేయింప నగును. లేదా హిమగిరినుండిఁ దైకొని గంగాతీర్థములచే నభిషేకింప నగును” అని వారు యోచనఁ జెప్పిరి.

అందులకు శెంగుత్తువర్ సమ్మతింపక “అగస్త్యకూటమునుండి శిలఁ గొనివచ్చుటలో మన ఘనత యేమున్నది? ఉమ, గౌరి, దాక్షాయణి, సతి—యీపేరులఁ బరగు మహాశక్తి కావాసమగు హిమాలయపర్వతశ్రేష్ఠమునుండి మనము శిలఁ గొనివత్తము” అనెను.

సచివోత్తముఁ డగు విల్లవర్కోదై యందులకుఁ బ్రశంసాసూచకముగ “సార్వభౌమునకు శుభమగుఁ గాక! కొంకణులను, కళింగులను, కర్ణాటకులను, గాంగులను, కాతులను, వంగులను, కదంబులను తాము గెలిచి పొందినకీర్తి విస్తారమై యున్నది. ఆర్యబలముల నుక్కణంచి మీ మాతృదేవేరికి గంగాస్నానభాగ్య మొదవంజేసిన మీయాశము కకుబంతవ్యాప్తమై యున్నది. ‘ఒకానొక శక్తిప్రతిమను జెక్కుకొఱకు కేవల మొకశిలను మాత్రము దైకొనునిమిత్తము హిమాలయపర్వతమునకు సపరివారముగ యాత్ర చేయ మేము సంకల్పించి యున్నాము’ అని నగరమంతయుఁ జాటించి

జంబూద్వీప నరేశ్వరులకందఱకుఁ బ్రచురింపుఁడు. వ్యాఘ్రము, మీనము, కోదండము—యీ చిహ్నములతోడను, ద్రవిడ భూమియందలి మూడురాజ్యముల పతాకచిత్రములతోడను, ఇట్టి యాజ్ఞాపత్రమును ముద్రాబంధ మొనరించి, జంబూద్వీప మానవేంద్రులకుఁ బ్రతినిధులై మనరాజధానియందుండు రాయబారులకుఁ బ్రసాదించినచో వారీ యుదంతమును దమ ప్రభువులకుఁ ద్వరలో నందఁ జేయఁగలరు” అని మనవి చేసెను.

మంత్రి చెప్పినట్లు శెంగుత్తువర్ చేసెను. పూర్వ మొకప్పుడు కనూజ్ పట్టణమం దొకరాజకుమారి స్వయంవరసందర్భమున నార్యావర్తమునందలి రాజులు ద్రావిడప్రభుత్రయముఁ గూర్చియు, ద్రవిడదేశీయులఁ గూర్చియుఁ దిరస్కారముగా మాట్లాడి యుండిరి. ఇప్పుడు కూడ నా యార్యధారుణీశులు ద్రవిడప్రభువులను లెక్కసేయక “ఎద్దుకాలిలో ముల్లంత లేరు; ఈ ద్రవిడదేశాధీశు లుత్తరదేశమునకు వచ్చి తమ చిహ్నములగు ధనస్సును, మత్స్యమును, పుండరీకమును హిమగిరియందుఁ జెక్కుట కెట్లు సాధ్యమగునని తలంచిరో యర్థమగుట లేదు......అవును; నేటి మనశక్తి సామర్థ్యములందు సగభాగమైన లేని భూవిభు లానాఁ డార్యావర్తమునం దుండిరి. కావుననే, కాకినలుపు కాయములతో మోటువారి యుండిన దాక్షిణాత్యు లాకాలమున మనదేశీయులపై సవారి చేయఁ గలిగిరి” అనిరి. కొందఱు యతీంద్రులు హిమాలయమునుండి వంజికరువూరుకుఁ బోయి శెంగుత్తువర్ చెవులకీ తిరస్కారవాక్యముల నెక్కించిరి. వెంటనే యాతఁడు కోపా

క్రాంతుఁ డయ్యెను. ఆతఁ డాత్మబలములతో మిత్రప్రభువుల సాయమున బ్రహ్మాండమగు చమూసమూహముఁ గూర్చుకొని యార్యావర్తముపై దండెత్తి పోయెను.

శాతకర్ణులు గూడ నాతనికిఁ దోడ్పడిరి. శెంగుత్తువన్ తన సేనానివహముతో గంగానదిని క్షేమముగను సులభము గను బడవలపై దాఁటుటకు వారు సాయ మొనరించిరి. ఆ ట్లానది నుత్తరించి యుత్తరతీరమున విడిసినంతనే, ప్రజలసైన్య ములతో నార్యనరేంద్రమండలి—ఉత్తరుఁడు, విచిత్రుఁడు, రుద్రుఁడు, భైరవుఁడు, చైత్రుఁడు, సింహుఁడు, ధనుర్ధరుఁడు, శ్వేతుఁడు, కనకుఁడు, విజయుఁడు— మూర్కొనిరి. శెంగు త్తువన్ ధైర్యసాహసములతో వారిని గత్తికొకకండగాఁ జిత్ర వధ చేసెను. అతఁ డేమాత్రముగాని వెనుకంజవేయక కాలికి బుద్ధిచెప్పు నార్యసైనికులను వెన్నాడి వేనకువేలుగా నుఱు మాడెను. అంత నామహారాజు విల్లవన్‌కొదై మంత్రిశేఖరు నితో హిమాలయమునకుఁ బోయి సతీదేవి ప్రతిమకొఱకు సముచితమగు శిలను సేకరించెను.

తిరుగుప్రయాణమున నాభూపతి గంగానది దక్షిణ కూలమున రాజసభఁ జేసెను. అచట శిలను గంగాతీర్థమున స్నానమొనరింపఁ జేసి ప్రదర్శించిరి. అంత ముందటి యా విప్రుఁడు మదలన్ వచ్చి "ఓ ప్రభువరేణ్యా! నేను మధుర, పుహార్ నుండి వార్తావహుఁడనై వచ్చితిని. తనయధీనమునఁ గావుండి నిలిపిన యతిథులను రక్షింపఁ జాలకపోయిన యవ మానముచే మదారి యగ్నిఁబడి యాత్మహత్య చేసికొనినది.

కావుండి కూడఁ బ్రాయోపవేశ మొనరించినది. నేను కావేరీ పట్టణమునకుఁ బోయి కోవలన్ కన్నకి జననీజనకుల కీ ఘోర వార్తఁ జెప్పితిని. మహాసత్త్వన కావార్త ప్రపంచమును బాడుగాఁ దోపించినది. వెంటనే యాతఁడు కల విత్తమంతటిని దాన మొనరించి సన్యసించి బౌద్ధవిహారముఁ జొచ్చినాఁడు. కన్నకి తల్లివోలె నాతనిపత్ని కోవలన్ తల్లి సైతము గుండె ప్రీలి మరణించినది. కన్నకిజనకుఁడు కూడఁ దనకుండినదెల్ల బీద సాదుల కొసంగి ఆజీవకమతమును స్వీకరించినాఁడు. ఇప్పు డాతఁడు తీవ్రతప మొనరించుచున్నాఁడు. గణికాంగన మాధ వియు దుఃఖాబ్ధి మునిఁగిపోయినది. ఆ వెలయాలు శిరమును వపన మొనరించుకొని బౌద్ధాశ్రమముఁ జేర్చినది. ఆమె మణి మేఖలను గూడ వెంటఁబెట్టుకొని పోయి శిష్యురాలిగాఁ జేసి కొనినది" అని విన్నవించెను.

అది విని ప్రభువు "సరియే. ఈవిషాదకథ కంతటికిని మూలకారణుఁడగు నా కమసాలవాని కేమిగతి పట్టినది?" అని యడిగెను.

"కన్నకి ప్రజ్వలింపఁ జేసిన యగ్నియందా వంచ కుఁడు శిలభము క్రియ దగ్ధుఁడైనాఁడు. నీడంచెలియన్ మర ణానంతరము సింహాపీఠి నధిష్ఠించిన వేర్ చెలియన్ దేశమును క్షామబాధనుండి గాపాడుకొనుటకు నగరమందలి కమసాలవారి నందఱను—వేయింటి కుందురు—సతీదేవికి నరబలిగా నిచ్చి నాఁడు. ఈబలి ఫలిత మైనదో లేదో మరుక్షణమే కుంభవృష్టిగ వర్షము కురిసినది" అని బ్రాహ్మణుఁడు చెప్పెను.

"నేను ద్రవిడదేశమును వదలినప్పటినుండి నేటివఱ కెన్నెన్నియో వింతలు విశేషములు జరిగినవి" అని శెంగుత్తువన్ యాశ్చర్యమును బ్రకటించెను.

బ్రాహ్మణుఁ డామాటలకు వినయముతో "దేవరవారు బయలుదేఱి యిప్పటికి ముప్పదిమాసము లైనవని యెఱుక పఱచుచున్నాను" అని మనవి చేసెను.

అంత శెంగుత్తువన్ యెత్తునకెత్తు బంగారమునఁ దూఁగి దాని నా బ్రాహ్మణునకు దానమొసంగి సంతృప్తాత్ముఁ జేసెను.

ఆ రాజేంద్రుఁడు శుభముహూర్తమున మరల రాణి వతోఁ జేరరాజ్యమునకు బయలుదేఱెను. అమూల్యమగు నా శిలారత్నమును శిరమున మోసికొని కనకవిజయులు వచ్చు చుండిరి. దురహంకారులై దాక్షిణాత్యుల నతినీచముగఁ దూల నాడిన యార్యధరణీశులకుఁ దగురీతిగా బుద్ధిచెప్పి, ద్రవిడా వని కీర్తికళంకమును దాను బాపినవైనమును పాండ్యచోళాధి నాథులకు వినిపింపుమని నీలన్ అను నొక రాయబారిని ప్రత్యే కముగ వారికడకు శెంగుత్తువన్ పంపెను. చోళపాండ్యరాజు లా యుదంతము నాకర్ణించిరి; కాని శెంగుత్తువన్ చెయిద ములు వారికి మనస్కరించలేదు. ఓటమిఁ జెంది ప్రాణము లఱ చేతఁ బట్టుకొని కాందిశీకులగు పిఱికిపందలను మతిమాలి చిత్రవధఁ జేయుట ద్రవిడదేశాధిపతికిఁ దగనిపని యని వారు వాకొనిరి. మీదు మిక్కిలి గర్వభూయిష్ఠములగు సమరసంరంభ ములతో నాప్రభువు హిమాలయకందరములందును, గంగా తటమునందును ధ్యాననిమగ్నులై యుండు మునీంద్రులకుఁ దపోభంగ మొనరించినందులకుఁ గూడ వారిమనస్సులు చిన్న

వోయినవి. నీలన్ తిరిగి వచ్చి ప్రభువునకు వారివైఖరి నెఱింగించెను. ఆ ద్రవిడేశు లిరువురు త న్నారీతిగా నాక్షేపించి నందుల కాతని రోషమున కంతము లేకపోయినది. వారితో నాతఁడు యుద్ధమునకు దిగియుండెడివాఁడే గాని ఇంతలో మదల నడ్డుపడి యాతని శాంతింపఁ జేసెను. ఉత్తమకుల సంభవుఁ డగు నాతనివంటి రాజశేఖరునకు యోగ్యమగు విధముగా, వయసుముదిరిన యాతఁడు విషయవాంఛలను విడనాడి భక్తిమార్గమునుబట్టి దానధర్మప్రవీణుఁడై మోక్ష పదవినందుటఁ గర్తవ్యమని యాబ్రాహ్మణుఁడు హెచ్చరించెను. అంత శెంగుత్తువన్ బంధితులై యుండిన యాగ్యరాజులను విడిపించి వారు నివసించుటకు సుందర మగుసౌధము నేర్పఱచెను. సతీదేవ్యాలయమును నిర్మించుసమయమున వేదవిహిత మగు యాగ మతివైభవముగా మదలన్ యాజమాన్యమున జరుగున ట్లానరపతి సన్నాహము లొనరించెను.

అంతఁ జేరరాజధానియగు వంజికరువూరునందు నిర్మింపఁబడిన సుందరదేవాలయములో హిమగిరిపాషాణమునుండిఁ జెక్కిన నా రమణీయసతీదేవిప్రతిమ నొకానొక శుభముహూర్తమునఁ బ్రతిష్ఠించిరి. బంధితులందఱు విడువఁ బడిరి. రావలసిన సుంకములన్నియుఁ ద్రోసివేయఁ బడినవి. యజ్ఞము యథావిధిగ జరుగుచుండెను. అప్రతిమానమగు శిల్పికళానైపుణ్యమునఁ బరిశోభిల్లు భూషణరాజములచేఁ గన్నకివిగ్రహము నతివైభవముగ నలంకరించి పూలతోఁ బూజించిరి.

ఆసమయమునకే దేవాండి, విశాలాక్షి, మరకతము, ఆయి యచటికి వచ్చిరి. దేవాండి రాజుతో "దేవా! హిమా

లయమున నుద్భవించి, గంగాతీర్థముల స్నానము చసి, ప్రస్తు తము మీచేతను, ద్రవిడదేశాధీశులచేతను గౌరవము నంది కాపాడఁబడు నీమహాదేవతకు నేను సఖిని" అని నుడివెను.

మరకతము ముందుకు వచ్చి "మహాప్రభూ! మాధవి పై సైత మించుకయైనఁ గినుకవహింపక, త్రాగుటకుఁ బుడిసెడు నీరైన లేని కీకారణ్యములకు జంకుకొంకుమాని నిజపతి ననుగ మించిన యీసాధ్వీశిరోమణికి నేను బరిచారికను" అని విన్న వించెను.

"వృద్ధులగు మాతాపితలతోఁ గాని, దాదితోఁ గాని, కడకు నాతోఁ గాని, ఒక్కమాటనైన వీడ్కోలుగాఁ జెప్పు టకుఁ దీఱిక లేక, సీతామాతవలెఁ బతివెంట నరిగిపోయిన నీ సుశీలకు నేను గాదిలి నెచ్చెలిని" అని విశాలాక్షి పలికెను.

దేవాండి కన్నకివిగ్రహము కడకుఁ బోయి "ఓ నెచ్చెలీ! నేను మందమతినై యుంటిని. నీవు నాతోఁ జెప్పిన స్వప్నఫలమును దూర మాలోచింప నైతిని. మధురనుండి వచ్చిన పాడువార్తను వినిన మరుక్షణమే, నీతల్లియు నత్తయు శోకానలసంతప్తలై యసువులు బాసిరి. సఖి! నీవును వింటివా?" అని యడిగెను.

"చిట్టి తల్లీ! నీతండ్రియు మామయు సన్యసించిన సంగతి నాకర్ణించితివా?" అని మరకతము ప్రశ్నించెను.

"పెద్దవారిద్దఱిసంగతి యటుండ, అంతకంటెఁ జిత్ర మగు విషయము జరిగినది. మాధవి, మణిమేఖల సన్యసించిరని వింటివా?" అని విశాలాక్షి యడిగెను.

"కాపుండి తనరక్షణమందుంచిన కోవలనను దాను గాపాడఁ జాలక పోయినందులకుఁ బరితపించి ప్రాణముల నగ్ని కాహుతిచేసిన మహారిని నీకుఁ దెలిసియే యున్నది గదా! ఆమె తనూజయగు నీకన్యను ఆయినిఁ జూడుము" అని దేహాండి ఆయిని కన్నకిప్రతిమకుఁ జూపెను.

అంతలో శెంగుత్తువన్ "ఆహా! ఏమిది? బంగారు నూపురములు, నీవిబంధము, కంకణములు, కర్ణభూషణములు-- వీనితోఁ గనులకు మిఱుమిట్లు గొలుపు నీ మించుఁబోఁడి యెవరు ?...—ఆ-ఆ- తెలిసినది. సతీదేవిరూపమునఁ గన్నకి యంతరిక్షమున నిలిచి యీ శుభకార్యము నాశీర్వదించు చున్నది" అని సంతోషమునఁ బలికెను.

కన్నకి యా పుడమిపతికిఁ దన దివ్యరూపముఁ జూపి "పాండ్యుఁడు నిరపరాధి. ఇప్పు డా రాజేంద్రుఁడు మహేంద్రునియతిథియై బహుళసత్కారము లందుచున్నాఁడు. నా భౌతిక బంధవిముక్తికిఁ గారణ మాతఁడు కావున నాతఁడు నాకు జనకసదృశుఁడై యున్నాఁడు" అని వచించెను.

వంజిపౌరకాంతలు గానాభినయములతో సతీదేవిని బూజించిరి. ప్రవాళములఁ బోలిన యధరములు, దాడిమబీజములఁ గేరు రదనములు, మనోవికారమును బుట్టించు గబ్బి గుబ్బలు, కదళీకంబములవంటి యూరువులు, నీలములగు మృదుశిరోజములు, వయ్యార మొలికించు కన్నులు, కమలములఁ బోలు చరణములు,—ఇట్లు సర్వాంగసుందరియగు మణిమేఖల వేశ్యాకులమునకు నాయకమణియై విటుల కానాఁడు విమలానందసంధాయినియై యుండియు, సర్వసంగపరి

త్యాగ మొనరించి, సకలాలంకారములను వర్జించి యాశ్రమ మును స్వీకరించిన విధానమంతటిని బూసగ్రుచ్చినట్లు దేవాండి శెంగుత్తువన్‌కు వినిపించినది. "మాధవియే మణిమేఖలకుంతల ములను గొఱిగించి సన్యసింపఁ జేసినది. ఆ తపస్వినిఁ గాంచి మహాత్ముఁడగు అరవన అడిగల్ సైతమాశ్చర్య మానసమున 'ఈ చిఱుప్రాయమందే యా కోమలి వలచిన వికృతాకారమును గాంచి నా మానసము నీరైనది' అని నొచ్చుకొనెను" అని దేవాండి చెప్పెను.

ఆయుదంతము నాలించి శెంగుత్తువన్ "ఆహా! అమూ ల్యమగు మాణిక్య మబ్ధిమధ్యమునకుఁ జిమ్మఁబడినది గదా!" అని చింతించెను.

ఇట్లుండగనే దేవాండి కావేశము వచ్చినది. ఆమెపైఁ బాషండుఁ (సటన్) డూనెను. ఆమెశిరముపైనిఁ బూలదండ లూగులాడుచుండెను; కనుబొమ లదరఁ సాగెను; కెమ్మోవి యదరుచుండెను; అసహజమును అర్ధవిరహితము నగుదరహాస మామెదంతపంక్తిఁ దాండవించుచుండెను; ఆమెపలుకు లసం భావ్యములై యుండెను; మొగమంతయు వారిబిందువులు నిండియుండెను; కన్నులు చింతనిప్పు లయ్యెను. ఆమె భయం కరముగ రెండుచేతుల నెగురవేయుచు "ఇచటఁ గూడియుండు సభ్యులయందుఁ జక్కని చుక్కలగు నాడుబిడ్డలు ముష్వు రున్నారు. వా రందఱివయస్సు రెండేండ్లు. వారిలో నిద్దఱు అరత్తన్‌శెట్టి కవలపిల్లలు; మూడవది సెడక్కుడింబి యాడు బిడ్డ. ఓ మదలన్! ఈబ్రాహ్మణియం దావేశించియుండు నేను పాషండుఁడని తెలియుము. నాకు 'సెట్టన్' అను పేరున్నదని

నీకుఁ దెలియును గదా! నేను జలపాత్రను కకపాలయం దుంచి మంగళాదేవి కోవెలయందు నీ కిచ్చియుంటిని. ఆజల మును కొంచెము తెచ్చి యీ యాఁడుబిడ్డలు ముగ్గురిపైఁ బ్రోక్షించుము. వెంటనే వారికిఁ బూర్వజ్ఞానము కలుగును" అని చెప్పెను.

అంతయు నిజమే; మదలకు నద్భుత మయ్యెను. మంగళాదేవి యర్చకుఁడు మదలన్ కట్టెకుంభము నొకప్పుడా గుడియం దొసంగియుండుట వాస్తవమే. ఇప్పుడు మదల నా పాత్రను దెచ్చి యందలి తీర్థము నానిసుఁగులు మూఁవురపైఁ జిలుకరించెను. తోడనే కవలపిల్లలలో నొకతెకుఁ బూర్వజన్మ జ్ఞానము కలిగెను.

ఆబాలిక ముందుపుట్టువునఁ గన్నకి తల్లియై యుండినది. "అయ్యో! కూఁతురా! అయ్యో! బిడ్డా! ఒక్కమాటనైనఁ జెప్పక నన్నుబాసి పోయితివి కదా! రా; వచ్చి, శోకసముద్ర మునుండి నన్ను గట్టు కెక్కింపుము" అని యాశిశువు వాపోయెను.

ఇంకొక కవలబిడ్డకుఁ గలిగిన పూర్వజ్ఞానమును బట్టి తా నింతకుముందు కోవలకు తల్లిగా నుంటినని గ్రహించి "అయ్యో! కొడుకా! ఆరాత్రి చీఁకటిలో నీవు నీపత్నితో వెడలిపోయి నావు రా; వచ్చి, నాదుఃఖ ముడుపుము" అని బావురుమని యేడ్చెను.

"ఔను. పూర్వజన్మమున వా రిద్దఱకుఁ గన్నకిపై నుంచిన గాఢానురాగము సమానమై యుండినది. ఆకారణమున నీజన్మమున వారు కవలలై పుట్టినారు" అని మదల ననెను

సెడకుడుంబి తనయ ముందుపుట్టువును జ్ఞప్తిచేసికొని తాను మదారిద్యై యుంటినని గ్రహించి "ఓ చిట్రిత్తల్లీ ! ఆ ఘోరవార్తను నేను నదీతీరమున వింటిని. బిడ్డా ! తర్వాత నీ వెచటికిఁ బోయితివి ? ఎక్కడ డాఁగితివి ?" అని విలపించెను.

దీనినంతయుఁ గాంచి మదలక్ "పూర్వజన్మమున నీవె కృష్ణభక్తురాలై యుండినది. కన్నకి కాపద బాపుకొంట కీవె 'కురవ' నృత్యమును జరిగించినది. దానం జేసి అనంతశయనమునఁ బద్మనాభస్వామి విఖ్యాతదేవాలయమునందలి పూజరికిఁ గూతురై యిపుడు పుట్టినది. మన పాపపుణ్యకార్యములపై మఱుజన్మ యాధారపడి యుండును. పుట్టినజీవి గిట్టక తప్పదు ; గిట్టినజీవి తిరిగి పుట్టును. ఓ మహారాజా ! ఈశ్వరానుగ్రహమున జన్మించితివి. కావున సదా సత్కర్మ లొనరించుచు దుష్కర్మలఁ దొలఁగఁ జేయుచుండుము" అని మదలక బోధించెను.

మహోదారగుణమున శెంగుత్తువన్ సతీదేవ్యాలయమునకు మడులు మాన్యములు దాన మొనరించెను. ధూపదీప నైవేద్యములతోఁ బ్రతిదినము దేవళమునందుఁ బుష్పపూజఁ జేయుచుండవలయునని దేవాండికిఁ బ్రభువు కట్టడఁ జేసెను.

అంత నవనీపతి, అవంతీనాథుఁడు, లంకేశుఁడు, బంధవిముక్తులైన యార్యభూవిభులు—అందఱును దేవాలయమునకు ముమ్మారు ప్రదక్షిణించి సతీదేవికి నతు లొనరించిరి. లంకేశుఁడగు గజబాహువు, మాళవాధినాథుఁడు, కంగుభూపతి, ఆర్యరాజన్యులు "మహాజననీ ! శెంగుత్తువన్ కావించిన సవ

నమునకుఁ బ్రసన్నచిత్తవై యీ శుభముహూర్తమున నిచట వేంచేసినవిధముగా, మారాజ్యములయందుఁ గూడ సాక్షాత్కరించి పవిత్ర మొనరింపుము" అని ప్రార్థించిరి.

"అట్లే వర మనుగ్రహించితిని" అనువాక్యము వారికి వినవచ్చెను. శెంగుత్తువన్ తదితర మేదినీశు లాదేవిని భావ బంధురమగు వాక్యముల స్తుతించి మదలన్‌తో యాగశాలఁ బ్రవేశించిరి. మరల నొకమారు దేవాండి కావేశము వచ్చినది.

ఆమె మాట్లాడసాగెను. "ఓ సభాసదులారా! మీ యదృష్టమే యదృష్టము. మీరు సతీదేవిపలుకుల నాకర్ణించు భాగ్యముఁ గంటిరి. సుఖదుఃఖముల కతీతులై యుండుఁడు. భగవంతు నెఱింగి భక్తులను సేవింపుఁడు. బొంకులాడకుఁడు. కొండెములు చెప్పకుఁడు. మాంసభక్షణము మానుఁడు. అనవసరముగ నొకరిని బాధింపకుఁడు. దానము చేయుఁడు. తప మొనరింపుఁడు. కూటసాక్ష్యముల నీయకుఁడు. సదా కృతజ్ఞతాబుద్ధితో నుండుఁడు. దుస్సాంగత్యము నుండి దప్పుకొనుఁడు. దుర్మార్గులకు దూరమై యుండుఁడు. సుమనస్సజ్జన గోష్ఠి నుండుఁడు. సదా సత్యమును వీడకుఁడు. పరసతీకూటమి మానుఁడు. అనదల నాదరింపుఁడు. మధుపానము, దొంగతనము, జంకుతనము, అబద్ధము, విషయలోలుర మైత్రి—వీనిబోలి మానుఁడు. పడుచుతనము, ధనము, దేహము—యివి శాశ్వతములు గావు. కాన నో భూలోకనివాసులారా! స్వర్గమార్గము నారసి, మఱి దానిని వదలకుండుఁడు" అని దేవాండి యుపన్యసించెను.

ఆ శుభసమయమున కుచితముగ నుండునట్లు మదల దేవీస్తోత్రమును రచింపఁగా సభికులంద ఱైకకంఠ్యముగా ః దేవి నిట్లు స్తుతించిరి.

నగరమంతయు దగ్ధమౌనట్లు చేసి,
వర్షముల్ ధారధారల వఱలఁ జేసి,
పాండ్యవిభునకు నమ్మక పథముఁ జూపి,
సంశయనివృత్తితో వానిఁ జక్కఁ జేసి,
పతియె దైవంబు ప్రాణంబు పడఁతికవుట
వానికై త్యాగముం జేసి, వానిఁ గాంచి,
కాంతుని యధర్మహత్యకై కసిని బూని,
పండితుల నామె చరితంబుఁ బాడఁజేసె.
దివ్యయానము పైనెక్కి దివికినరిగె.
అవని నాచంద్రతారార్క మతివ మాన
వతుల తలమానికంబుగా వఱలుఁ గాక !

# వచన గ్రంథములు



| | | | రూ. | అ |
|---|---|---|---|---|
| | | | ప్రతి 1-కి | |
| | ్రవచనభాగవతము | | | |
| | ద్వాదశస్కంధములు, శ్రీ శతఘంటము వేంకటరంగశాస్త్రికృతము, | | | |
| విడి: | ఒకటే సంపుటము | | 9 | 0 |
| బైండు | మూడుసంపుటములు | ... | 10 | 8 |
| బ్ర | ్రవచనభారతము | | | |
| | ఆదిసభాపర్వములు | ... | 5 | 0 |
| ,, | ఆరణ్యపర్వము | ... | 5 | 0 |
| ,, | విరాటోద్యోగపర్వములు | ... | 5 | 8 |
| ,, | భీష్మద్రోణపర్వములు | ... | 7 | 8 |
| ,, | కర్ణశల్యసౌప్తికస్త్రీపర్వములు | ... | 5 | 8 |
| ,, | శాంతిపర్వము | ... | 7 | 8 |
| ,, | ఆనుశాసనికము మొదలు స్వర్గారోహణపర్వమువరకు | | 7 | 8 |
| | ంధ్రవచనవాల్మీకిరామాయణము | | | |
| | బాలకాండము | ... | 2 | 8 |
| | అయోధ్యాకాండము | ... | 5 | 8 |
| | అరణ్యకాండము | ... | 2 | 0 |
| | కిష్కింధాకాండము | ... | 2 | 8 |
| | సుందరకాండము | ... | 3 | 0 |
| | యుద్ధకాండము | ... | 7 | 8 |
| | ఉత్తరకాండము | ... | 3 | 8 |
| | ్రవాఙ్మయచరిత్రసంగ్రహము | ... | 3 | 0 |
| | రేబియన్ నైట్సుకథలు | ... | 2 | 0 |
| | లసీదాసురామాయణము, వచనవ | ... | 12 | 8 |
| | మహాభక్తవిజయము | ... | 12 | 0 |